# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

నవంబరు 1976

సంపుటము : 53 సంచిక : 11

విడిపత్రిక వెల రూపాయిన్నర

# బక్కయ్య కథ

"తీసుకున్నప్పుడున్న తెలివి యిచ్చేటప్పుడు వుండొద్దయ్యా" అని ఋణదాత పేద రైతు బక్కయ్య యింటిమీదకి వచ్చి దబాయిస్తున్నాడు. ముందు నుయ్యి, వెనుక గొయ్యి - ఏం జవాబు చెప్పినా తప్పే! "ఈ ఒక్క ఏడాది ఈయన ఓర్చుకుంటే ఎంత బావుణ్ణు" అని లోపల గొణుక్కుంటాడే గాని పైకి అనలేడు బక్కయ్య.

ఈ బక్కయ్యల సందిగ్ధ పరిస్థితిని మన రాష్ట్ర ప్రభుత్వం గుర్తించింది. చిన్న రైతులు, భూమిలేని వ్యవసాయ కూలీలు, గ్రామీణ చేతి వృత్తుల వారు తీసుకున్న ఋణాల మీద మారటోరియం ప్రకటించారు.

దీనివల్ల కోర్టులోవున్న 22 వేల దావాలు ఆగిపోయాయి. సుమారు రూ. 6 కోట్ల ఋణం ప్రస్తుతానికి తీర్చనవసరం లేకుండా వాయిదా పడింది. పేదవారు యివ్వవలసిన ఋణాలను రద్దు చేస్తూ, లేదా తగ్గిస్తూ చట్టం కూడా చేయాలని అనుకుంటున్నారు.

మరి మళ్ళీ కావలసినప్పుడు ఏ అయ్య ఆదుకుంటాడు? అనేది ప్రశ్న. ఎవరో ఎందుకు ప్రభుత్వమే ఆదుకునే చర్యలు తీసుకుంటున్నది.

1972-73 లో సహకార సంఘాలద్వారా యిచ్చిన స్వల్పకాలిక ఋణాలు రూ. 25 కోట్లు. 1975-76 లో రూ. 78 కోట్లు. 1976-77 లో రూ. 100 కోట్లు యివ్వాలని లక్ష్యం.

సహకార సంఘాలలో మేనేజిమెంటులో సగం మంది బలహీన వర్గాల వారు వుండేట్లు చట్టాన్ని సవరించారు.

మన రాష్ట్రంలో 16 జిల్లాలలో చిన్న రైతుల సహాయ పథకాలు అమలు జరుగుతున్నాయి. 2½ లక్షల వ్యవసాయ కార్మిక కుటుంబాలకు లాభం చేకూరుతున్నది.

ఇక బక్కయ్య లెవరూ భయపడవలసిన పనిలేదు. ఋణదాతల చక్రవడ్డీల పరిధుల్లో గిరగిరా తిరిగే పనిలేదు.

సమాచార పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR. 15/76-77

# విషయానుక్రమణిక

## నవంబరు 1976

# ఆనంద ముద్ర

కే ఎ స్వీ

వెన్నెల మైదానపై శయించి
కన్నెగాలుల కౌగిలింతలలో పరవశించి
కన్నానొక దివ్య స్వప్నం
విన్నానపూర్వ సంగీతం
నా ఆత్మలో ప్రతిధ్వనించిందొక నాద స్వర్గం

ద్వేషాలూ మోసాలూ బురద పాముల్లా జారుకున్నాయి
కావేషాలూ కక్షలూ కలికంలోకి కానరాకుండా పోయాయి
నేను నడిచిన బాటవెంట నాగజెముళ్ళు మల్లెలు పూశాయి
నా చేయి సోకిన ప్రతి మోడూ నవనవలాడుతూ చివుళ్ళెత్తింది
చీకట్లో సిరివెన్నెల రేకులు రేకులుగా విచ్చింది
మెరుపుల మువ్వలు సవరించి చుక్కలు ఆనందలాస్యంచేశాయి

నా నీడ నాతో అంది:–
"అన్నా! - ఎక్కడినుంచి ఎక్కడికి?"
నేను నా నీడతో అన్నాను:–
"ఎన్నెన్నో చీకట్లలోంచి తమ్ముడా! కాని–
అన్ని వెలుగులూ తానైన ఆ వెలుగులోకి–"

"నిన్నటి మొన్నటి నిట్టూర్పులేవీ ?
నన్ను తొక్కుతూ నువ్వు రక్కుకున్న స్వగతాలేవీ
ఏవీ ఆ అశ్రు ఝరులు ఏమయ్యాయి ?
ఎలా నీ చిక్కిన చెక్కిట ఇంకాయి ?–"

"ఇంకెక్కడి కన్నీళ్ళు ఇంకెక్కడి నిట్టూర్పులు.
తమ్ముడా! ఇప్పుడీ జీవితం
తామర కొలనై వికసించిన ఆనందం
ఇంక స్వగతాలు లేవు సోదరా ఈ హృదయం
ఎక్కుపెట్టిన సాహస కోదండం–"

నవ్వకే నవ్వింది నా నీడ
నమ్మకే నమ్మింది నా నీడ
"అన్నా! నాదో చిన్నమాట
అన్నావు కదా ఒకప్పుడు నాతో ,
ఎన్నో నాళ్ళుగా నీ హృదయం బీడుపడిందని
మళ్ళీ ఎలా వచ్చిందీ నవనవోన్మేషం?
ఎలా ధరించావీ వసంతోత్సవ పరివేషం ??"

"గడుసైన వాడా !
నా నీడా !
గదిలాంటి నా హృదయానికి
మంచితనంపై కప్పు–
మనిషిమీద విశ్వాసమే
మహిమాన్వితా శాస్త్రైగ్యాలను నిలిపె
అసలు నేల–
నేలను నమ్ముతాను నేను
నమ్ముతుంది నా నేల నన్ను
కాలం నా గుండెలో గుచ్చే బల్లేలను
మల్లెలుగా మార్చేది
ఆ నమ్మకమే సుమా!......"

నీ చీకటి నవ్వులు కట్టిపెడుదూ నా నీడా !
నా మనసిప్పుడు తెలిమల్లెల వెన్నెల వన్నెల వాడా!
నా నేత్రాలకు ఘ్రాణశక్తి
నా అంగుళులకు సంగీతాన్ని స్పృశించే రాగరక్తి
–ఇవాళ నేనో కుసుమించే దీపాన్ని
తెలుసునంటావు నా రహస్యాలన్నీ నువ్వు
ఏదీ ఏదీ మళ్ళీ నవ్వు–
వెళ్తానంటావా? వెళ్ళలేవు
నేను లేక నువ్వు లేవు
ఇవాళనుంచి నీతో నాకిక మాటలులేవు
మన మధ్య సంభాషణకిక సెలవు
అయినా నువ్వు నాతో ఉంటావు
–అదీ మరి అలా ఒప్పుకో
అదిగో అక్కడో కాంతి వృక్షం
నువ్విక వెనక్కి తప్పుకో–

ఒదిగి ఒదిగి జరిగి తిరిగి
వెళ్ళింది నీడ వెనక్కి
నా అడుగుల క్రిందనుంచి నక్కి నక్కి

రా! రా! రమ్మంది కాంతుల కల్పవృక్షం
సంగీతం ముసిరి ఝుమ్మంది
కాంతులు ఘుమ్మన్నాయి
పరిమళాలు ఘల్లున నా రక్తాన్ని తాకేయి
ఒక్కొక్క చుక్కా వంగి వంగి
జల్లు జల్లుగా అక్షతలు కురిసింది
"నమ్మకంమీద నమ్మకం
ఇంకా నీకుందంటే లేదు నాకు నమ్మకం"

"నిరాశల మేడా!
నా నీడా!
నా పుట్టుకకు ముందు నేనెక్కడున్నాను?
నా చావుతర్వాత నే నెక్కడుంటాను?
ఆదీలేదు అంతూలేదు
ఈ నడుమంత్రపు ఉచ్ఛ్వాస నిశ్వాసాల జీవిని
నేనున్నాననేదే కదా నమ్మకం ?
అదిలేనప్పుడు ఆత్మలోకంలో దివాలాకే ఈ బ్రతుకు అమ్మకం!"
"అన్నా! నీ నీడను
నన్నన్నావు నిరాశల మేడని!
నిన్నటికి నిన్న మొన్నటికి మొన్న
కన్నీటి సంద్రాన ఒంటరి ఓడని నువ్వని మరిచేపోయావు!
ఇంతలో ఎంత మార్పు!
ఎవరిచ్చారు నీకీ ఓదార్పు!!"

ఈసారి
నవ్వకే నవ్వింది నేను!
నా నీడను
నమ్మకంగా నమ్మింది నేను!—
"తెలిసీ తెలియనట్టు నటిస్తావేం తమ్ముడూ!
నావద్ద దాచలేవు నీ అంతస్సు ఎన్నడూ!

మట్టిలోంచి మకరంద తుందిల
గోధుమవన్నెతాచులై లేచాయి
మొగలి ముళ్ళలా పులకరించిన
నేను—

మేల్కొన్నాను నిద్ర
అంతసేపూ కలా నిద్రా ?
ఏదైతేనేం-జీవితాంతం చెదరదు కదా
సుభాతమైన ఆనంద ముద్ర !!

# శృతి

## శ్రీ రామా చంద్రమౌళి

ఏది దేనికి ఆది...?
రేపు రెక్క విప్పుకునే స్వర్ణోషస్సుకు
నిన్న వెక్కిరించిన గాఢ తమస్సు ఆది కాదా!
పండు వెన్నెలలా పరుచుకోబోయే ప్రశాంతతకు
సుడిగాలిలా వడితిరిగిన తుఫాను పువాది కాదా—
గాలివానలు,
తెగిన వీణలు,
స్తబ్దతలో పొర్లిన కాలం అచేతన కేతనాలు...
యివన్నీ రేపు విచ్చుకునే కాంతి కాలానికి సంకేతాలు
గతా తాన్నిల్ని నేను తయారుచేసిన
బాణం కొనకు సూర్యుణ్ని అతికించి
ఆకాశంలోకి ఎక్కుపెడుతున్నాను
యిక విచ్చుకుంటాయి నిప్పు పూలు
కాంతిప్రసవంకోసం ఆకాశానికి యిది తొలిచూలు
ఈ 'రోజా'కు నేను పాడుతున్న చరమగీతి
'రేపు'కోసం నా హృదయవీణకి చేస్తున్న శృతి.

# ఆంధ్రమున బౌద్ధ మెప్పుడు వచ్చెను?

## శ్రీ ఐ. కార్తికేయ శర్మ

ఇటీవల కొన్ని పురావస్తు పరిశోధన లీ సమస్యపై కొంత నూతన వెలుగును ప్రసాదించినవి. ఈ వ్యాసమున వీటినిగూర్చి ప్రస్తావింతును.

కీర్తిశేషులు ఆచార్య శ్రీ మల్లంపల్లి సోమశేఖర [1] శర్మగారు "అమరావతి స్తూప" మను ఆధారగ్రంథమున ఆంధ్రమున బౌద్ధమశోకుని పూర్వముననే వ్యాపించియుండెనని చెప్పియుండిరి. ఇటీవల (1974–75) నేను అమరావతి స్తూప పరిసరముల పరిశోధన గావించితిని. శ్రీ శివలెంక రాధాకృష్ణగారు దయతో నా సుదీర్ఘపరిశోధన సచిత్రిత వ్యాసమును భారతి ఆగష్టు–75 (పుటలు 16–27), సంచికలో చక్కగా ప్రచురించిరి.

బౌద్ధ భిక్షువుల, (బావరి), సంఘములు మహిష మండలమునుండి బుద్ధుని దర్శనార్థమై రాజగృహము (బీహారు) పోయినట్లు "బుద్ధ చరిత"మను గ్రంథ పరంగా తెలియుచున్నది. వీరు పోయిన మార్గము 'సూత్తని పాత' మను బౌద్ధగ్రంథము వివరించుచున్నదికూడ. 'ధమ్మ పదాట్ట కథ'లో తథాగతుడు తన పూర్వజన్మలో సుమేధుడను నామముతో అమరావతిని జన్మించినట్లు కలదు. ఇవన్నియు కొంత కల్పనలుగా తరువాత గ్రంథస్థములైనట్టివిగా పలువురు భావించుచున్నారు.[2]



పటము 1 : మట్టిపాత్రపై శాసనము : క్రీ.పూ. 4 వ శతాబ్ది, అమరావతి స్తూపము (1975).

అమరావతి మహాస్తూపమునకు చేరువగా చేసిన త్రవ్వకములలో స్తూప పూర్వపు (కాలము-1 అ), స్తూప పునాదుల (కాలము–1 ఆ), స్తరములలో కొన్ని ముఖ్య పురావస్తు–వాస్తు విశేషములు, లభ్యమయినవి. వాటిని పేర్కొందును.[3]

1. యన్. బి. పి. అని పిలవబడు మృణ్మయపాత్రావశేష



పటము 2 : కుండముక్కపై శాసనము. క్రీ.పూ. 4 వ శతాబ్ది, అమరావతి (1975)

ములు: ఉత్తర భారతమున బుద్ధ భగవానుని కాలమున ప్రసిద్ధములైన మహా జనపద నగరములైన–వైశాలి, రాజగృహ, విదిశ, ఉజ్జయినీ, కోశాంబి, రాజఘాట్ (వారణాశి) శ్రావస్తి, కుశినగరము మొదలగు పవిత్ర స్థలములో క్రీ. పూ. 6–4 వ శతాబ్దిలలో, నీ పాత్రలు వాడుకలో నుండెను. ఈ పాత్రావశేషములు పలు రంగులతో (బంగారు, వెండి, తామ్ర, యినుము), మెరిసిపోవుచున్నవి. సరిగా అదే కాలపుస్తరములలో మహా చైత్య నిర్మాణమునకు పూర్వమే యిచ్చట నివశించిన బౌద్ధ బిక్షువులు వాడుచున్నట్లు విదితమైనది. ఈ పాత్రలు, బహుశ వీరు ఉత్తర భారతమునుండి కొనివచ్చిరి కాబోలు,–విరిగినను వాటిని రాగి తీగతో చుట్టి బాగుచేశిరికూడా! వీరు చిన్న చిన్న పర్ణశాలలో నివశించుచున్నట్లున్ను, ఇనుపవస్తువులు వాడుచున్నట్లు తెలియుచున్నది. ఈ శోభస్కరమైన యన్.బి.పి.తో బాటు ఎరుపు-మరియు–నలుపు మట్టిపాత్రలు, (గిన్నెలు, మూతలు, ప్లేట్లు వంటివి), లభించినవి. కొన్నింటిపై బౌద్ధబిక్షువుల పేర్లుండుట విశేషము. (పటము-1-2) — – శిస పాశ – —



పటము 3 : ధనకటకమును చూపు శిల్ప స్తంభము. క్రీ.పూ.3వ శతాబ్ది :
యెడమ అంచున : ధమ్మకడ వందనామ గో;ష్ఠి
అమరావతి (1975)

తిస్సుని పాత్ర : మలస (మల్లస్య) మొదలగునవి. ధర్మపదాట్ఠకథ (I. P. 167)లో పేర్కొన్న తిస్స భిక్షు వీతడేనేమో ? లేక ఈ నామము గల భిక్షువు విభాజ్య వాదకారకుడై నథేర తిస్స – (మొగ్గలిపుత్ర తిస్స కుమారుడు), కావచ్చును. యెట్లైన అశోకుని కాలమునకు పూర్వముననే బౌద్ధ సంఘవ్యాప్తికి పునాదులు వేయబడిన వనుటలో యిసుమంత సందియము లేదు. పై మట్టి పాత్రలు క్రీ.పూ. 4 వ శతాబ్ది స్తరములలో లభించినవి కనుక మౌర్యకాలమునకు కొంచెము ముందుగనే అమరావతి–ధరణికోటల బౌద్ధము వ్యాపించి యుండనగును. మహాస్తూపము సాతవాహన కాలమునవలె పెద్దది కాకపోయినను చిన్న మట్టి దిబ్బగా, వైశాలిలోని స్తూపమువలె, యుండి యుండవచ్చును. అశోకుడు బౌద్ధ మతావలంబనము చేసిన మీదట ఈచోటును పవిత్ర స్థలముగా భావించి, తన ధర్మయాత్రలో భాగంగా మహా చైత్యమును (శ్రీ ధాన్యకటకే చైత్యే జిన ధాతుధరే భువి), దర్శించుటయేగాక ఈ స్థల ప్రాభవమునకు ముగ్ధుడై కాబోలు దక్షిణ దేశమున బౌద్ధ మహాక్షేత్రముగా రూపొందించినాడు

బుద్ధుడాంధ్రమునకు వచ్చెనా ? యన్న ప్రశ్న కేవలమూహగా మాత్రమే పలువురు విద్వాంసులు భావించియున్నారు. కాని హెల్మూట్ హాఫ్మన్[4] అను జర్మను పండితుడిటీవల కాలచక్ర మూలతంత్రమును, ప్రాచ్య లిఖిత ప్రతిని పరిశోధించి ప్రచురించుట వలవ కొన్ని జుగుప్సాకరమైన విషయములు వెలుగులోనికి వచ్చినవి. బుద్ధ భగవానుడే మంత్రయానమును బోధించెననియు, ముఖ్యముగా నీ కాలచక్ర మూలతంత్రమును శ్రీధాన్య కటకమున వివరించెననియు యీ గ్రంథమున స్పష్టముగా పేర్కొనబడినది.

"గృధకూటేయథాశాస్త్ర
ప్రజ్ఞాపార మితానయె!
తథా మంత్రనయే ప్రోక్తా
శ్రీ ధాన్యే ధర్మదేశాన॥
కూటః స్థానాత్ కూటః శాస్త్రాత్
తత్రతంత్రాశ్చ దేశితః॥



పటము 4 : నల్లరాయి నిలువు స్తంభము
కాలన్వెరగారుస ధభో ( క్రీ పూ. 3వ శతాబ్ది )
(అమరావతి–75)

బుద్ధభగవానుడు గృధ్రకూటమున (రాజగృహ) ప్రజ్ఞాపారమిత ధర్మము నెట్లు బోధించెనో, అట్లే శ్రీ ధాన్యకటకమున కాలచక్ర యానమును ప్రబోధించెనని విదితము.

ఈ గ్రంథ ప్రతి క్రీ. శ. 11వ శతాబ్దిదేయైనను ఇందు పేర్కొన్న అంశములు, బౌద్ధవిశేషములు, సత్యములని నిర్ణయముగా చెప్పనగును. ముఖ్యముగా బుద్ధుని జీవిత విశేషములు – ధర్మబోధన చేసినచోట్లు, అచ్చటి బౌద్ధసంఘముల, భిక్షుకుల నుద్దేశించి వివరించిన విషయములు యదార్థములే. ఈ సందర్భమున అమరావతిలో లభ్యమయిన నొక నలుపలకల శిల్పస్తంభము చాల ప్రాముఖ్యమైనది.



పటము 5 : నిలువు స్తంభముపై శాసనము. క్రీ. పూ. 3 వ శతాబ్ది అమరావతి (1975)

ఈ శాసన శిల్పస్తంభము భారతదేశముననున్న బౌద్ధశిల్పములలో తలమానికమైయున్నది. ఇందు ప్రతిఫలకముపై చూపిన గాథలు బుద్ధుని జీవిత విశేషములకు చెందినవి. ఇందు నొక ఫలకముపై (పటము–3) శ్రీ ధాన్యకటకము అచ్చటి చైత్యారామములు కృష్ణానది చూపబడియున్నవి. బుద్ధుడిచ్చోటిని సందర్శించుటను పాదుకల రూపమున చూపబడియుండుట గమనార్హము. ఈ శిల్పస్తంభము (చూడుడు భారతి ఆగస్టు 75) క్రీ. పూ. 3వ శతాబ్దినాటిదిగా కళాకారులు నిర్ణయించినను, దీనిపై చెక్కిన విశేషములు బుద్ధుని జీవిత కాలము నాటివి- చివరి నాలుగు నెలలు. తథాగతుడు తిరిగినచోట్లు. అందువలన బుద్ధభగవానుడు అమరావతి ధరణికోటల దర్శించి "కాలచక్ర యానమును" ప్రబోధించియుండెనని నమ్మవచ్చును. రాజగృహమున ప్రజ్ఞాపారమిత న్యాయమును బోధించెనని చెప్పుకున్నాము కదా! పై శిల్పముపై ఈ గాథ చిత్రరూపమున చూపబడియున్నది.

ఇక కాలమం-1 అ (క్రీ పూ. 3వ శతాబ్ది) స్తంభములలో మహా చైత్యస్థాపనగూర్చి కొన్ని వివరములు లభ్యమైనవి. కాని స్తూపము నెవరు గావించిరో మనము చెప్పజాలము. కారణము– స్తూపమును ఆ పూరి జమీందారు, పెజ గుంటలుకొట్టి పాడు చేసినందున, అశోకుని శిలాశాసన స్తంభపుముక్క నాధారము చేసు కొని స్తూపమీతని పూర్వకృతముగా భావించుటకు వీలగుచున్నది. అదెట్లన అశోకుని కృతములని తలంపబడు నిలువు శాసన స్తంభములు, అశోకుని కృతములు కావని–అంతకుముందే వున్న నిలువు కంభములని–వీటిని ధ్వజములుగా పవిత్రస్థలముల ప్రజలు పూజించెడి యాచారాన్ని శ్రీ ఇర్విన్[5] అను పండితుడిటీవల విదితం చేసినాడు. అశోక చక్రవర్తి ఈ నిలువుస్తంభముల నన్నింటిపైని తన ధమ్మలిపిని మాత్రము చెక్కించెనని తెలిపినాడు. అమరావతి శాసన ముక్కను పరిశీలించినకూడ నిది సత్యమేయని తోచుచున్నది. యేలనన బాగుగా నునుపైన స్తంభభాగముపై, ఆ నునుపును ఛిద్రముచేసి, అక్షరములు చెక్కినట్లు విదితమగుచున్నది. అనగా శోభాయమానమైన నున్నటి కాంతివంతమైన నిలువు స్తంభముపై, ధమ్మలిపిని అశోకుడు తరువాత చెక్కించెనన్నమాట.

ఇదిగాక, యిటీవల త్రవ్వకములలో అశోకునికాలమున గావించిన నిలువు స్తంభములు చక్కటి నునుపుతో నల్లరాయివి (పటము-4) స్తూప తూర్పు పడమరల అసంపూర్ణ ప్రాకారవేదిక, తోరణాలంకృత ద్వారము అశోక చక్రవర్తి కృతములని తేలినది. ఈ నల్లరాయి స్తంభ



పటము 6 : యక్షమూర్తి, క్రీ. పూ. 3వ శతాబ్ది, అమరావతి (1975)



పటము 7 : యేనుగు శిల్పము.
క్రీ పూ. 2 వ శతాబ్ది, అమరావతి (1975)

ములపైని శాసనముల చూడుడు. (పటము-5) అట్లే నొక నల్ల రాతితో గావించిన కూర్చొన్న యక్షమూర్తి శిల్పము (పటము 6) దక్షిణ దేశమునలభ్యమగున అత్యంత ప్రాచీనమైన మూర్తి శిల్పము.

ఇక ముద్రిత వెండినాణెముల గూర్చి ప్రత్యేకముగా చెప్పవలసిన పనిలేదు కదా! చాలచోట్ల లభ్యమయినవి. అమరావతిలో పెక్కులున్నవి. మౌర్యచంద్రగుప్తుని కాలమున మనదేశమును పర్యటించిన గ్రీకు రాయబారి మెగస్తనీసు ఆంధ్రపట్టణములు, సైన్యమును గూర్చి వివరించినాడు గదా!

కాలము-2 : క్రీ. పూ. 2-1 శతాబ్ది. ఈ కాలమున లభ్యమయిన శిల్పములు కొన్ని చైత్యమెంతటి సుందరముగా, శిల్పాలంకార శోభితమైయుండెనో తలపుకు వచ్చును. అమరావతిలోని గజతమ చిత్రము (పటము-7)కార్లిలో (యు. పి.) గల బండపైనున్న యేనుగును బోలియున్నది. ఈ గజతమ (గజోత్తమః) తథాగతుని రూపము. అశోకుని కృతముగా పలుచోట్ల భావింపబడుతున్నది. ధమ్మకడచైత్యమున గర్భితమైనది ఆ తథాగతుని అస్తికయే గదా! అందుకే ధమ్మకడ చైత్యము-చైత్యకావం మహాచేతియగా ఖ్యాతిగాంచి రాజగృహ, పాటలీపుత్ర, వైశాలి, కుశినగరముల నుండెడి బౌద్ధులకు మిక్కిలి పవిత్ర స్థలమైనది. వీరు యీ స్తూపమునకు, పెక్కు దానములు గావించిరి కూడ.

పైన వివరించిన నూతనాంశములను తర్కించి యింకను పరిశోధనలు గావించదలచిన యవసరమెంతేని కలదు. ఏది యెట్లున్నను దక్షిణ దేశమున ముఖ్యముగా నాంధ్రమున బౌద్ధము, తథాగతుని జీవిత కాలముననే యంకురించెను. కొన్ని చైత్యములు (అమరావతిలో వంటివి) అశోకుని పూర్వముననే వెలసెను. బౌద్ధమత స్థాపన, దాని వ్యాప్తి ఉత్తర భారతమున యెట్లు జరిగెనో, అట్లే యించుమించు అదేకాలమున ఆంధ్రమున కూడనని గట్టిగా చెప్పక తప్పదు. అశోక చక్రవర్తి వైశాలి, పాటలీపుత్రము, విదిశ మొదలగుచోట్ల ధర్మవ్యాప్తికై నెట్లు మహాస్తూపారామముల నుద్ధరించి, పెద్దవి గావించెనో, ధమ్మకడమున కూడనట్లే చేసియుండవచ్చునని నా భావన. బుద్ధుడు స్వయంగా కాలచక్రయానమును ప్రబోధించి వందువలననే కాబోలు మన యాంధ్రభూమిన, మరే రాష్ట్రములో లేనన్ని అపూర్వమైన బౌద్ధస్తూపారామములు వెలసి యావద్భారతముననే ఖ్యాతి తెచ్చినవి.

మరియొక ముఖ్యవిశేషము-ఆంధ్రస్తూప నిర్మాణశైలి చక్రాకృతిగా నుండుట యీ కాలచక్ర తంత్రప్రభావమే.

ఇన్ని చారిత్రక, గ్రంథస్థ విషయములు' పురాణ వస్తు అవశేషములు, నిర్దుష్టముగా మన యమరావతి స్తూప ప్రాచీనతను చాటుచున్నను, డౌగ్లసొబారట్ (బ్రిటిష్ మ్యూజియం అధిపతి)గారు మాత్రము ఆంధ్రమున స్తూపములు, బౌద్ధము (అమరావతితోసహా) క్రీ. శ. 30వ ఏటనుండి మాత్రమే వచ్చెనను మొండివాదనను విడువకున్నారు.[6]

## ఉపయుక్త గ్రంథములు


1 మల్లంపల్లి సోమశేఖరశర్మ, అమరావతి స్తూపము — ఇతర వ్యాసములు, (మద్రాసు 1932). P P. 1-34

2 **K. R. Subrahmanyam, Buddist Remains and History of Andhra, (Madras, 1932) P P. 3-4.**

3 బి. కార్తికేయశర్మ. అమరావతి స్తూపము నేటి పురావస్తు

పరిశోధనలు' భారతి, 52 సం. 8 (ఆగస్టు, 1975) పుటలు. 16–27.

4 Helmutt Hoffmann, "Buddha's Preaching of the Kalachakra tantra at the Stupa of Dhanya Kataka," German Scholars in India, I (Varanasi I, 1973), P P. 136-40.

5 John Irwin, "Foundations of Indian Art" delivered at the National Museum, New Delhi, 18th to 24th Nov. 1975. Also Burlingam, Indian Buddhist legends (Harward, 1921) 28 Pt. I P. P. 167, 203-04.

6 Douglas Barret, "The Early Phase at Amaravati," British Museum quarterly, I-XXII (London, 1967) ; P P.

# "స్మృతిరాగం"

శ్రీ పి. వి. లక్ష్మీనారాయణ

ఓ, స్మృతీ !
నీ కృతి గొప్పది.
నాకే స్మృతులూ
రావంటే
తప్పది.
చప్పరించే వయసు
నాటికి
తప్పటడుగులు
గుర్తుకొస్తే—
తెల్ల వెంట్రుక
తెలిసినప్పుడు
బాల్యరేఖలు
గోచరిస్తే—
మనసు మనసది
కాదు,
మద్దెల !
తేనె నీవై
పోదువే
ముద్దుల !!

ఓ, స్మృతీ !
నీ ఆకృతి
మరీ గొప్పది !
కలల సరసున
అలల ఒడిలో
ఆశలే పూలై,
వయసుకు
వాసననిచ్చే
యవ్వనరాగానికి
ఆలాపన ఆలంబన
యెదురైతే—
అబ్బా !!—
ఆజీవన
గీతమింక
మరీ గొప్పది !
దాని ఝుంకృతిలో
ఓ, స్మృతీ !
నీ ఉనికి
ఎంతో గొప్పది !

జీవనాంతాన-
జీవన జీవనరాశిని
దాటలేని
నిస్సహాయ స్థితిలో
జీవితం
వచ్చి వెళ్ళిన
వసంతం
అనిపించేనాడు—
నీ కృతిచేసే
శృతి
భలే గొప్పది !
నీ ప్రకృతి
చెప్పరానిది !
అది—
అవిస్మృత
అతి మధురపు
సుధాగీతి !!

# ఏకాంత సేవ

## శ్రీ యామిజాల పద్మనాభస్వామి

వాసరారంభ సంధ్యా సమానాంభోజ
కుసుమమాలికలివే కూర్చినాను,
ఇపుడె విచ్చిన మల్లెలెంచి సంపగులతో
మంచి బంతులు సంతరించినాను,
నడచివచ్చిన శ్రమం బుడుప గంధపుతావు
లురలు వీవన సిద్ధపఱచినాను,
ఆకొన్న కడుపుతో అరుదెంతు వీవంచు
ఎంచి తీయని ఫలాలుంచినాను

ఏమిసేయుదొ నా యత్నమింతవరకు
మనసులో నిన్నె నిల్పి తోచిన విధాన
పూజగావింపనున్నాను ముగ్ధగతుల
మ్రొక్కుచున్నాను రావోయి భువననాథ!

౨

పండువెన్నెలలేని పసిమిచాయలలోన
వెదకుచున్నాను నీ పెదవి సొబగు;
మలయమారుత గాన మాధురిన్ గమనించి
అరయుచున్నాను నీమురళిపాట,
పలుకరించెడు రామచిలుక పల్కులలోన
దిద్దుచున్నాను నీముద్దుమాట;
క్రొక్కారు మొయిలు తళ్కుల బెళ్కులన్‌గాంచి
మోహించినాను నీ దేహలతను

కాని కడలేని ప్రణయాంధకార బలము
దివ్యతరమౌ పదార్థమందించలేదు
మోసపోయితి నీ దొంగ వేసమునకు
వెలుగుచూపవె యికనైన విశ్వనాథ!

౩

భువన మోహన! నీపాద భువనజముల
కంకితంబైన నాహృదయాంబుజంబు
ఇరులఁదెగజిమ్మి సాత్త్విక గరిమనొంది
నిశ్చలాధారమూర్తితో నేస్తమౌను.

౪

సాహంకార మనో వికారముల నాట్యంబాడుచున్నాను వి
ద్యాహీనస్థితి తోడుగా భువనమర్యాదన్ గణింపంగలే
ద్రిదిహో నిర్ఝరు లూరడిల్ల వికనేన్నేరితి ధన్యాధ్వగ
వ్యాహారంబున మేలుగాంతు భువనైకారాధ్య పీఠాధిపా!

౫

అమృత భానుని మందహాస వీచికలలో
తలమున్కలాడు వెన్నెలపులుంగు,
పద్మినీ ప్రణయ జీవన తంతువుల లోన
ప్రేమామృతము నింపు భృంగరాజు,
బాలభానుని ఫాలభాగాన కుంకుమ
ప్రభ బొట్టుదిద్దు ప్రాభాతలక్ష్మి,
పసిమి జవ్వనపు సొంపెసలారు కుసుమాంగి
మనసు నాకర్షించు మల్లెమొగ్గ

ఈభువన రాజ్యపతివి నీవే యటంచు
లలిత భావానుకూల విలాసమధుర
సరసవృత్తులతో బోధసల్పుచుండె
సత్యశివసుందరోపనిషత్ప్రభావ!

౬

ముంగురుల్ తీర్చి మోమున మోము గదిపి
చెక్కు ముద్దాడి నందుని చిగురుబోణి
చన్ను గుడిపిన సంతృప్తిగన్ననాటి
నీ నగు మొగంబు చూపవే నిగమ మూర్తి!

౭

నీవు తుంటరివంచును వ్రేవెలందు
లమ్మతో సిద్ధపడిరి కయ్యంబునకును
యోగిమానసవర్తి! నీ కౌగిరంబు
వియ్యమా కయ్యమా చెప్పవే మహాత్మ!

౮

'పునుక పేరులో కాసు భమో తలంప
నీవు కయిపేయగా ప్రియమేది దేవ!
కాలకూటము నందు నిల్వా లొసంగు
పన్నగమా నీకు మిగుల రుచ్యంబు చెపుమ!'

౯

రత్న కంకణ ఘల్లు లారావములకు
ముగ్ధ ముఖ చంద్ర సౌభాగ్యమునకు లోంగి
పొగిపోతివి దేశ దేశాలకడకు
నివ్వరని మోహినీమూర్తి వెంచినావొ?

౧౦

మోహినీదేవి వాలుచూపులకు లొంగి
కొంగు తగిలినచో అదే కోటియనుచు
అడవులందామెతోన వెంటాడు నీదు
లీలగని యెంత నవ్వెనో శైలతనయ!

౧౧

ఒక్కసారియెకాదు నీ యుద్యమంబు
పరిభవంబందె పలుసార్లు ప్రకృతికడను
ప్రేమ విజయమునందు కిరీటపూజ
వలిపెగా రాజసవిధాన సత్యభామ

౧౨

ప్రేమనిధాన! నా ప్రణయరేఖకు జీవమువోయుచుండెని
ఆమని కోయిలల్ జగమునందలి జీవపదార్థశక్తి బో
ధామల గీతికారవ సుధారస దోహద మాచరించుచున్
నీ మధురాహ్వయాక్షర వినిర్మల తేజము స్థాయి చూపగ

౧౩

ఆదిమ బ్రహ్మచారి విఖ్యాతినొంది
భావ బలమున పార్వతీదేవి కొరకు
యోగివై మౌనివై విప్రయోగివై!
విస్మరింతువె ఆ గాథ విశ్వనాథ!

# చిన్న సున్నా - పెద్ద సున్నా

## శ్రీ పి. రామకృష్ణారెడ్డి

చిన్న సున్నాకు చిన్నకోరికలున్నాయి
  పెద్ద సున్నాకు పెద్ద పెద్ద కలలున్నాయి.
చిన్న సున్నకు జాగా జానెడు ఆకలి కడుపు చాలు.
పెద్ద సున్నా ఆకలికి, ఆకాశం, భూమీ అనవు.
పెద్ద సున్నా తలలో సూర్యుడు పేలిపోతుంటాడు
పాదాలను...చంద్రుడు మంచుతో ప్రక్షాళనం చేస్తుంటాడు
శుక్ర, బుధ గ్రహాది తారలు చుట్టూ పడివుంటాయి ఆట
వస్తువుల్లా!
ఆకలేసినప్పుడల్లా...ఆలోచిస్తూనే అణుబాంబుల్ని తింటుంది
దాహమేస్తే సముద్రాలన్నిటినీ తాగేస్తుంది.
అణువుకున్న విలువ మనిషికెన్నడూ లేదు పెద్దసున్నా
మనసులో

చిన్న సున్నా మనసులో మనిషితప్ప మరోటుండదు
బాధలూ, భయాలూ, కష్టాలూ, నష్టాలూ, కావల్సినవాళ్ళు
శక్తిమీదకన్నా వ్యక్తిమీదనే ఆసక్తి దానికి.
పెద్దసున్నా మరీ పెద్దదై చిన్నసున్నానింకా చితకదొక్కు
తోంది.

ఒకటి పెరిగి దానవతకు దగ్గరయింది, మరొకటి తరిగి
మానవతకు దూరమయింది.

రెండు సున్నాలూ లేకపోతే లోకమే పిండుసున్నా.
రెండు సున్నాల సమన్వయం మానవతకు సరైన అన్వయం
విసర్గ విభేదించకపోతే...విసర్గమైన మనిషి నిలబడతాడు.

# నే నిక్క డ

## శ్రీ సూరపరాజు రాధాకృష్ణమూర్తి

నాకేమి కావాలో నాకే తెలీక వెర్రిగా వెతుక్కుంటూ యీ తోటలోకి వచ్చాను. విరబోసిన యామినీ కుంతలాలపై విరిసిన మల్లెలవలె వెన్నెల.

జడజ్యోత్స్న జలమైనట్లున్న ఏటిపై చాచిన చంద్రబింబంలా తెరచాప. తోటలో మోజు తీరగానే తిరిగి వస్తానేమోనని వేచిఉన్న నావ.

ఆకుల నీడల్ని మింగుతూ పాకివస్తూన్న తెల్లని పాముల్లాటి వెన్నెల, చేతి వేళ్ళవలె, కాలిగోళ్ళవలె ఉన్న నీడల్ని తప్పుకు తిరుగుతున్నా.

ఒడ్డునున్న రెండు పొడుగాటి చెట్ల సందుగా నావైపు చూసి నట్టు లేదూ నావ? అలల ఊపుకో వెన్నెల సోకుకో కదిలింది కొద్దిగా.

ఆకులు నాపై జల్లించిన వెన్నెల పూలు రాలుస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ అడుగువేసినచోటనే ఆగిపోతున్నాను అలికిడైనపుడల్లా కన్నెత్తిచూస్తూ శాకినీ ఢాకినీ కామినీ కాంతుల్ని.

చాచి రెండు చెట్లకి కట్టేనట్లున్న తెరచాప ఊగిపోతూంది పడవ సాగిపోతూంది భారంగా బోడిగా నిలిచిపోయిన చెట్లని చూస్తూ దూరంగా నేనిక్కడ.

---

# 'వెలితి'

## శ్రీ బొలిమేరు వెంకటప్రసాద్

మెరుపు మెరిసినప్పుడే
తెలుస్తూంది
ఆ కళ్ళల్లో వెలిగేది
అసలు వెలుగే కాదని.
మల్లె విరిసినప్పుడే
తెలుస్తూంది
ఆ మనసుల్లో విరిసేది
అసలు తావే కాదని.
గుండె నెరిసినప్పుడే
తెలిసింది

ఈ బ్రతుకుల్లో వెలితి
నిక్కడో దాగుందని.
ఆ కొరత
కాశీలో నిండుతుందా?
శ్రీకాకుళంలో తీరుతుందా?
అందుకు
శివుడినై హిమగిరి నెక్కేదా?
విష్ణువునై ఏ అవతారమో దాల్చేదా?
లేక
ఇంద్రుడినై చేతులు జోడించేదా?

# పూలకవేళాలో డిసెంబర్ గులాబీలు

శ్రీ జ్వాలాముఖి

చీకటి
చిరస్థాయిగా నిలవడానికి
దట్టంగా ముట్టడిచేసి
కాంతిని వేలమట్టం చేసిన
కర్కోటకపు కాళరాత్రి
కసినింపిన చలి
కనిపించని కొరడాలా
చరుస్తూ కురుస్తున్న కళాకేళి
మదించిన కోర్కెలు
విచ్చల విడిగా విహరిస్తున్న
అతి భయంకర అడవి మృగాః
విజిళ్ళు లేని విశృంఖలత
కిరాయి గజిళ్ళ రాసకేళి
సుఖశాంతులు రతి శ్రాంతులు
ఆనందం
అమ్ముడుపోయిన కళాఖండం
ధర్మం
దూడ చచ్చిన పాడియావు
అబద్ధం
నిజం నిసుగును పిసికేసిన అభినేత్రి
నిరాశ
ఆశను చీల్చి చెండాడిన చరమరాత్రి
పాపం—ఆకలి !
బతుకు పునరావాస శిబిరంలో గాయపడ్డ కాందిశీకుడు
కాయకష్టం బజారులో సొమ్మసిల్లిన చెల్లనినాణెం
దుఃఖం
ఎక్కణ్ణుంచో కొట్టుకొచ్చిన కంటిదుమ్ము
అనుభవవైభవాల ఒంటి స్తంభంమేడమెట్లూ
ఆవురావురుమనే అనాది అతృప్తాత్మ
పీడగ్రస్తం దాని చరిత్ర సమస్తం
ముక్కపట్టే ఊపిరాడక
ఉక్కపట్టే వెలుతురానక
చీకటి చక్రబంధంలో
చిట్లిన రాచపుళ్ళు—చరిత్రకళ్ళు

క్యాలెండరు చరమాంకం చేరే తొలి చరణం
ఉగాదికి పరితపించిన తపస్వికోకిల మరణం
సాలుపొడుగునా సాగిన పాదుకలలు పీడకలలు
నిర్మల నక్షత్రాల్ని వేలాడదీసిన వేకువ వికృతాకారం
కాళరాత్రి కాంతి గవాక్షాలు కనుమూసిన విషాదమౌనం
బిగిసిన హృదయం బద్ధలైన ఉదయకాల నిశ్శబ్ద శబ్దాలు
మిడతలదండు దీపాలార్పిన కమరు వాసనలు
రాలిన మంచులో కూలిన కలల కన్నీరు
వీస్తున్న పిల్లగాలిలో నేల తల్లి కడుపుకోత—
'శీక్ హై' హెచ్చరికల్లో అమంగళం రెచ్చిపోయింది
'జాగ్తే రహో' సంక్షేమంలో సంక్షోభం పుచ్చిపోయింది
ఉదయసంధ్య నెత్తురు కక్కిన మరకల ఆకాశం
కోరతో మినకరి తెలివి తెల్లవారిన మందహాసం
ఉరిప్రాణం వేలాడేసిన నాలుకలా
తలవంచుక వచ్చాడు కర్మసాక్షి
ఆత్మ అవనతాన్ని చాటిన తూర్పుదృశ్యం
పగిలిన పాలలా కాంతి విభ్రాంతి
కష్టమని కాలం కళ్ళుమూసుక వెళ్ళిపోయింది
రాలిన నక్షత్రాలు రత్నగర్భంలో పునర్జన్మ ప్రయత్నం
భూమి కష్టాలకు ఆకాశం నష్టాలకు ఫలితం దిక్చక్రం
ప్రకృతిలో ప్రతిధ్వనించిన నిర్వేదం 'వీరభోగ్య వసుంధర'
కాళరాత్రి కన్నుమూతలో కాంతి ధాత్రి కనువిప్పు
విరబూసిన గులాబీల వైతాళిక గీతంలో వీరగంధ విన్యాసం

"రాత్రి రాలిన నిర్మల నక్షత్రాలు
చరిత్రాకాశంలో నిశ్చలంగా మెరుస్తాయి
బీళ్ళకూ మోళ్ళకూ దిక్సూచులై విరుస్తాయి
ఛిక్కు ఛిక్కుమనే దిక్కుల్లో విద్యుత్తును ప్రసరిస్తాయి"
ప్రకృతి పరిణామానికి ప్రాణమిచ్చిన డిసెంబర్ రోజాలు
మౌనత్యాగాల యాగాలనిండా మండే మరో యుగం మహానిజాలు
నేలనిండా రాలిన రెక్కల సంతాప దినాలు
గాలినిండా పండే ప్రాణవాయువు రుతుపవనాలు
కలల పంటల్ని కోసుకొచ్చిన కసాయిల సంత
నెత్తు రత్తరుగా విరిసిన వేలంపాటల రద్దీ వింత

''ఈసారి డిసెంబర్ గులాబీలకు
ఎక్కడాలేని ఎర్రని తనం
ఎన్నడూలేని సువాసన–''

పూలకబేళాలో ఖరీదుకట్టే కసాయి పాటలు
డాగిన సత్యాల్లో ధగధగ మెరిసే నెత్తురు జాటలు

కండగల రోజాలు

ఖండఖండాలై రాలినా
జెండాలై విగురుతున్నాయి
మేలుకొలుపులు పాడుతున్నాయి
నెత్తురత్తరు చిత్తడిలో
సూర్యోదయం కూరుతున్నాయి
పూలకబేళాలో డిసెంబర్ గులాబీలు
కసాయిాల ఓటమివే చాటుతున్నాయి–

# "మాతృస్తవము"

శ్రీ సి. చంద్రశేఖర్

*(శ్రీ వాసిష్ఠ గణపతి ముని ఉమాసహస్రము నందలి కొన్ని శ్లోకములకు అనువాదము)*

అమృత శశికళా కీర్త్య పహారకములు
నవనవోద్భాస లీలా విధాత్మకములు
ఇత్తములు నాకు సుగతి భర్త్రుకములగుత
స్కంద జనయిత్రి దరహాసచయము లెపుడు.

తల్లిస్మితలేశమొకడు దిగ్వల్లియందు
విశదము సుమపరిమళ వేద్యమాన
మదియు బహుళాతిశాయియై యరయు గాత
మభినవంబులు చిరశోభనములు నాకు.

అభ్రపథమది నీకు క్రీడాంగణమ్మ
అర్కతేజోవలయము కార్యాలయమ్మ
పృథ్వి ఇది బహుళాన్న సమృద్ధమైన
అశన మందిరమై యొప్పునమ్మ నీకు.

పరము వియదాఖ్య ముద్యాన పదము నీకు
గర్భగోళములన్నియు కందుకములు
విగురవేయుచు వాని నాడెదవు కాళి!
అల్పవాక్కులచేత వివ్వరయగలమె.

నీదు హాస్యైక పరిణతి నిఖిల జగతి
కలిగి మెలగును భార్గవి! కారయిత్రి
నగుట నినుగూర్చి స్తోత్రము పాడుటెట్లు?

# కవులు ప్రపంచాన్ని మార్చటానికి ప్రయత్నించాలా?

శ్రీ జాన్ వేన్

ఈ వ్యాసం రంగాన్ని సిద్ధంచేసే ఒక అభ్యాసం అవాలని నేను అనుకుంటున్నాను. కాల్పనిక కళకి సంఘంతో ఉండే సంబంధాన్ని గురించి ఈ వస్తువు విషయంలో వెలువడేటువంటి పరస్పర విరుద్ధమయిన అభిప్రాయాలు ఇంక దేనివిషయంలోనూ వెలువడి ఉండలేవు; నేను కవిత్వం తరఫున మాట్లాడుతున్నప్పటికీ నా నిర్ణయాలు చిత్రరచన, నాటకం, వచన కధారచన (కొన్ని సర్దుబాట్లతో సంగీతం కూడా—అసలు సంగీతం ఈ రకం గొడవలో ఇరుక్కునే మేరకి)—వీటన్నిటికీ వర్తిస్తాయి. నేను శుభ్రం చేద్దామనుకుంటున్న రంగం ఎటువంటిదో ఈ కింది ప్రశ్నలు సూచిస్తాయి:

ఒక కవికి తన సమాజంయొక్క అనారోగ్యాన్ని గురించి కాని ఆరోగ్యాన్ని గురించి కాని తన అభిప్రాయాలని చెప్పాలన్న నైతిక బాధ్యత ఏమన్నా ఉంటుందా?

మన సంప్రదాయంలోని ముఖ్యమయిన కవిత్వంలో సాంఘిక విమర్శ అధికంగా కనిపించే వస్తువా? లేకపోతే అది ఎన్నో వస్తువులలో ఒకటిగా అయిపోయిందా?

నేరుగానే సాంఘిక నిర్ణయాలని చేసే కవిత్వం మనలో సంచలనాన్ని కలిగించినప్పుడు మనం ప్రత్యేకమయిన లక్షణాలని వేటినయినా వర్తింపచెయ్యాలా? లేకపోయినట్లయితే, ఈ కవిత్వాన్ని కూడా తక్కిన కవిత్వంలాగే చూడాలా?

అన్నిటికన్నా సూటిప్రశ్న-కవిత్వం ఎన్నటికయినా ప్రత్యక్ష ప్రచారం కాగలదా? ప్రశ్నని ఇంకొక విధంగా వెయ్యాలని మీకు అనిపిస్తే—ప్రత్యక్ష ప్రచారం ఎన్నటికయినా కవిత్వం కాగలదా?

మనలాంటి రాసేవాళ్ళందరికీ ఒకరకం వ్యక్తి తెలుసు. అన్ని రూపాలలోనూ, అన్ని సైజు (size) లలోనూ వచ్చే ఈ వ్యక్తి సగటున మూడు వారాలకి ఒకసారి మన దగ్గిరికి వచ్చి, "మీ రచనతో ఇంతకన్నా మంచి ప్రపంచాన్ని తయారు చెయ్యటానికి ఎందుకు ప్రయత్నించరు?" అని అడుగుతాడు. (లేకపోతే అడుగుతుంది.) అతని (లేకపోతే ఆమె) స్వరంలో ఒక ఆరోపణ ధ్వనిస్తుంది; రచయిత గుండెలేని, చపలత్వంకల వ్యక్తి. బహుశ అతను విలువలని గుర్తించని "సినిక్" అయి ఉండాలి; కాకపోతే, ఇంత స్పష్టంగా తెలిసే కర్తవ్యాన్ని నిర్వహించకుండా ఉండడు. ఈ ఆరోపణ అర్థం ఇదే. రచయితకి ప్రజలని ఆకర్షించగల శక్తి ఉంటుంది, అతను వాళ్ళ భావాలమీద తన ప్రభావాల్ని చూపించగలడు, వాళ్ళ భావాలు ఒక వైపు మళ్ళేట్లు చెయ్యగలడు. అటువంటి రచయిత 'మెరిసే కవచా'న్ని వేసుకుని 'డ్రాగన్'ని చంపాలికదా? ఈ డ్రాగన్ ఏమిటి, అని ప్రశ్న వేసేవాళ్ళ "దేవతాఖ్యా"న్నిబట్టి సమాధానం మారుతూ ఉంటుంది. ఇది పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం, జాతి సిద్ధాంతాలు, ఫాసిజమ్, అన్ని రకాల విచక్షణలూ—వీటిలో ఏదయినా కావచ్చు. తేలికగా చదివే లేబిల్ (label) తగిలించి ఉన్న డ్రాగన్లకి కొరతలేదు. ఎవరయినా తన కళని ఊడదీసి దానిని ఒక అస్త్రప్రయోగ యంత్రంగా వాడటానికి సందేహిస్తే ఆ సందేహం ప్రపంచ పరిస్థితిపట్ల దాక్షిణ్యాన్ని ప్రకటిస్తోందని అనుకోనక్కరలేదు. మానవ సమాజాన్ని మార్చాలని నేనూ నమ్ముతున్నాను. ఈ సమాజంయొక్క క్రౌర్యం, "సినిసిజమ్" నన్ను చకితుడిని చేస్తాయి; దాని దురాశ, పోటీ, దుబారాతనం నాకు విచారం కలిగిస్తాయి; దాని వికార స్వరూపం నాకు కోపం తెప్పిస్తుంది. ఈ భూమి ఒక అందమయిన గ్రహం; మానవజాతి దుష్ప్రవర్తన ఇంత అందమయిన గ్రహంమీద కొనసాగటం మరింత భయంకరంగా ఉంటుంది. ఒక చక్కటి ఇల్లు ఉందనుకోండి. అందులో ఉండే ఫర్నిచర్ని ఆసక్తితో, మంచి అభిరుచితో అమర్చారనుకోండి. కొందరు అల్లరి పిల్లలు ఆ ఇంట్లోకి జొరబడి ఎక్కడ పడితే అక్కడ మలమూత్ర విసర్జనలు చేస్తే ఎలా ఉంటుంది? అలాగే ఉంది మన పరిస్థితి. ప్రపంచాన్ని మార్చాలని నేను ఒప్పుకుంటాను! కాని, మార్పుని తీసుకువచ్చే సాధనాలలో కెల్లా తగినవి కాల్పనిక కళలేనా? కట్టెలు కొట్టటానికి

రేజరు వాడితే కష్టాలు ఎన్ని వస్తాయి? రేజరు సంగతి ఏమిటి? పాడైపోయిన రేజరుతో దాని అసలుపని చెయ్యటానికి వీలవుతుందా? రాజకీయ కార్యక్రమానికి అంకితమయిన వ్యక్తి, "నష్టం కళదే!" అని వెంటనే సమాధానం ఇస్తాడని నాకు తెలుసు. అటువంటివాళ్లకి ప్రపంచాన్ని బాగుచెయ్యటంకన్నా ముఖ్యమయిన పనిలేదు. అసలు అంతకన్నా ముఖ్యమయిన పని ఉన్నదని అనుకోవటం; వ్యక్తిగత సంబంధాలు లేదా లక్ష్యంలేని కళ లేదా ప్రకృతి సౌందర్యం లేదా బుద్ధికి సంబంధించిన సైద్ధాంతిక సమస్యలు — వీటిమీద శ్రద్ధ చూపించటం వాళ్లకి అవినీతి అనిపిస్తుంది. ఇటువంటి ఏకాగ్రతముందు చిన్నతనం వేస్తుంది. కాని ఒకదాన్ని మాత్రమే చూడగలిగిన చూపు సొరంగంలోనుంచి చూసే చూపులాంటిది. అది దాని విస్పష్టతని ఒక "డాకో" రకం ప్రత్యేకతద్వారా సాధిస్తుంది. ఒక సమస్యల జాలాన్ని ఎంత తీవ్రమయిన స్పష్టతతో చూడటం ఇతర సమస్యల జాలాన్ని కావాలనే చూడటం లేదనటానికి సాధారణంగా ఒక గుర్తు. మౌలిక విచ్ఛేదం ఇక్కడే వస్తుంది. ఒక వయిపే ప్రసరించే తీవ్రదృష్టి—అది విప్లవ వాదిది అయినా, మిస్టిక్ (mystic)ది అయినా, త్యాగిది అయినా-కళని సృష్టించే దృష్టితో పొత్తుకుదరనిది. (మళ్ళీ "నష్టంకళదే!" నష్టమే కాదు, లాభం కూడా. ఎందుకంటే. మానవుడి అనుభవాలు అంత నిండయినవీ, పరస్పర విరుద్ధమయినవీ కూడా. "యదార్థాన్ని గుర్తించ వెందుకు?" అని ఎవరో ఇ. ఎమ్. ఫారెస్టర్‌ని అడిగారు. "ఎలా గుర్తించను, నా చుట్టూ అన్ని ఉంటే?" అని ఆయన సమాధానం చెప్పాడు.)

యూటన్‌మీద లూయీస్ మెక్‌నీస్ రాసిన పుస్తకంలో కవిత్వం, ప్రచారాలని గురించి కొన్ని మంచిమాటలు చెప్పాడు. అతను పుస్తకం రాసిన కాలంలోనూ ఇప్పటిలాగే ప్రచారంచేసే అవసరాన్ని గురించి ఎంతో చెప్పబడేది.

"ప్రచార కవులు తాము యదార్థ వాదులమని అనుకుంటారు. ఈ వాదం నిజం కావటానికి యదార్థం, ప్రయోజనం ఒకటి కావాలి. సత్యం అనేది కవిత్వానికి సంబంధించినా, శాస్త్రానికి సంబంధించినా అది సాధారణంగా, సరళంగా ఉండదు; తేలికగా అర్థమూకాదు. అయినా ప్రచారకుడు తన పాఠకలోకానికి వాళ్ళు ఏదయినా సులభంగా మింగి, జీర్ణం చేసుకోగలిగేదాన్ని ఇచ్చి తీరాలి. అతని ధర్మం అది. యదార్థవాదం (ఈ మాట సరయిన అర్థంతో వాడితే) యదార్థం యొక్క ప్రచారపు విలువతో సంబంధం లేకుండా ఒక రకం జనానికి సరిపడే విషయాలనే కాక ఇంకొకరకం జనానికికూడా సరిపడే విషయాలని లెక్కలోకి తీసుకుని వాటిని గ్రంథస్థం చెయ్యాలి. యదార్థవాదం ఎవరికీ సరిపడని విషయాలని సయితం తీసుకోవచ్చు. ప్రచారకుడి సత్యం అనేది ఉంటుందేమో కాని అవేది శాస్త్రజ్ఞుడి సత్యమూ కాదు, యదార్థవాది సత్యమూకాదు. కవితాసత్యంకన్నాకూడా, ఇది వీటికి దూరంగా ఉంటుంది. అతనికి (ప్రచారకుడికి) ప్రపంచాన్ని మార్చటం ఒకటే ధ్యేయం. అబద్ధాలు, వక్రీకరణాలు, సహింపరాని స్థూలీకరణాలు-ఇవన్నీకూడా అతనికి సత్యం కిందే లెక్క; మాటలని తన ధ్యేయంకోసం వాడితేచాలు అతనికి. ఇది సమర్థనీయమయిన వైఖరేకాని కవి కవితాసత్యం బదులు ప్రచార సత్యాన్ని వాడటంవల్ల మంచి కవిత్వం రాస్తాడని నిరూపించదు. కవికి ప్రచారకుడి లక్ష్యం పట్ల విశ్వాసం ఉండవచ్చు; కవిత్వాన్ని పడుపు వృత్తిగా చెయ్యటం చేత ఆ లక్ష్యం నెరవేరుతుందా అన్న న్యాయమయిన సందేహంమాత్రం అతనికి కలిగినా కలుగవచ్చు. కొంతవరకు గణిత శాస్త్రంలాగ కవిత్వం కూడ తన ఉద్దేశాన్ని తన వ్యాపారం ద్వారానే నెరవేర్చుకొనగలదు. అశేష, కవిత్వంకాని, గణిత శాస్త్రంకాని ఒక మంచి ఉద్యమానికి మేలు కలిగించ గలిగితే ప్రయోజన కరంగాఉండే కళయొక్క ఈరకం దుర్వినియోగాన్ని గణితశాస్త్రజ్ఞులూ, కవులూ కానివారికి వదిలి వేద్దాము."

ఇంత నిశితంగా, సమర్థవంతంగా చేసిన ఈ వాదానికి వేరే మద్దత్తు అక్కరలేదని అనిపిస్తుంది. కాని, దానిని ఇటూ అటూ లాగగలిగే బలమయిన అయస్కాంత శక్తులు ఉన్నాయి. ఎందరో రచయితలు—ఎందరో తక్కివరకం మనుష్యులలాగే—తమ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సంచలనాన్ని కలిగించే ఉద్యమంలో పాలుగొంటూనె ఉంటారు. సామాజికచర్య; పంచుకున్న ఆదర్శాలు; పంచుకున్న భావాలు; పంచుకున్న క్రమశిక్షణ, అపాయం మొదలయిన వాటికోసం కోరుకొనటం ఎందరికో ఒకప్పుడు సంభవించేదే. రచయితలు ఈ ప్రమాదాలకి గురికావటానికి కొన్ని కారణాలు ఉన్నాయి.

రచయిత జీవితం ఒంటరిగా ఉంటుంది. ఇతరుల చికాకు లేకపోతే ఇతరుల సాంగత్యం, అనూనయంకూడా అతనికి ఉండవు. ఈ వ్యాపారంలో కొన్ని సంవత్సరాలు గడిచిన తరువాత ఎక్కువమందే ఈ ఒంటరితనానికి అలవాటు పడిపోతారు కాని యువరచయితలకి ఇది దుర్భరంగా ఉంటుంది. అందుకనే వాళ్ళు సంఘాలు ఏర్పరుచుకుని "మానిఫెస్టో" లని వెలువరిస్తూ ఉంటారు, ఉద్రేకంతో గుంపులుగా మూగుతూ ఉంటారు. ఈ ఆవేగంలో తరుచు రాజకీయపు ఛాయ కనిపిస్తూ ఉంటుంది. అప్పుడు యువరచయితకి తల తిరిగేట్లుఉండే అనుభూతి కలుగుతుంది: "నువ్వుమాకు అవసరం. మా దృక్పథాన్ని నీలాగ మాటలని నైపుణ్యంతో వాడేవాళ్ళే చెప్పాలి." ఈరకం ఆహ్వానం చిన్న వయసు రచయిత చెవికి ఇంపయిన సంగీతంలాగ ఉంటుంది. ఇది వినిపించాలంటే అతను నిర్వచనంకల ఒక లక్ష్యం వయిపు సాగిపోయే ఒక వర్గంతో చేరడమే మార్గం. లేకపోతే, అతను ఎంత బాగారాసినా ఎవరూ అతన్ని తమవాడు అని

అనేరు, యువరచయితలకి తాము ఈవిధంగా కోరబడేవాళ్ళు కావాలని ఉంటుంది. ఇటువంటి వర్గ సమయిక్యత అతనిలోని గంభీరమయిన వైరితనాన్ని తప్పకుండా బయట పెడుతుంది. [నా జీవితం అంతా కవిత్వం ఉన్న పత్రికలనీ, పుస్తకాలనీ తెరిచి రాజకీయ వైఖరులమీద ఆధారపడే గంభీరమయిన వైరితనాన్ని కనిపెడుతూ ఉన్నానా, అనిపిస్తూ ఉంటుంది. పంతొమ్మిదివందల నలభయి ప్రాంతంలో ఈ కింది ద్విపదని ఎవరో తయారు చేశారంటే నమ్మండి: Bare bitten with truth, not posed not slick/Here's verse that's more than good, its Bolshevik.]

అయితే కొందరికి "తప్పదు" అనే ఒంటరితనంకన్నా వైరిగా కనపడే ప్రమాదాన్ని భరించడమే తేలికగా తోస్తుంది. మానవుడి అనుభూతి పరిధిని సార్వత్రికంగా పరిగణించినట్లయితే కళయొక్క వస్తువుకూడా అంత పరిధీ కలిగిఉండి తీరవలసినదే అని తెలుస్తుంది. ప్రాణం, మరణం, ప్రేమ, ద్వేషం, స్వర్గం, నరకం, అమరత్వం సంతోషం, బాధ–వీటిని గురించే కవిత్వం. కాని, అందరి ఆదుర్దా సయితం వీటిని గురించే కదా ? అందరిదీ ఒకే ఆదుర్దా అయినప్పుడు అవి ఎవరివీ కావేమో అనిపించటానికి అవకాశంఉంది. అలాగ కాకుండా రచయిత: "పాలస్తీనా ప్రజలకి హక్కులు ఉండాలి; (స్పెయిన్‌లోని) బాస్క్ తీవ్రవాదులని విడుదల చెయ్యాలి; బ్రిటిషు సేనలు ఉత్తర ఆయిర్లాండుని వదిలి బయటికి రావాలి" అని రాస్తే ఈ సంగతులని గురించే ఎవరు చెప్తారా, అని కాచుకు కూర్చునిఉన్న "రెడీమేడ్" పాఠకవర్గం దొరుకుతుంది అతనికి. ఈ పాఠకవర్గం అతనికి స్వాగతం చెప్పి సన్మానం చేస్తుంది. ఇది అంతా మిధ్యే అనుకోండి. అతను ఆ వస్తువుకి సంబంధించిన ఇరుకుదారిని వదిలివేసి తన మామూలు పనికి తిరిగి వెళ్ళిపోగానే; అంటే, కంచెవెయ్యని మానవానుభవాన్ని గురించి రాయటం మొదలుపెట్టగానే – స్వాగతం అనుమానంగానూ, సుహృద్భావం వైషమ్యంగానూ మారిపోతుంది. అప్పుడు తెలుస్తుంది అతనికి పెద్దపులిని ఎక్కిన తరువాత దిగటం అంటే ఎలాగఉంటుందో. అంతదాకా మాత్రం సవారీ ఉల్లాసంగా ఉంటుంది.

- డెస్కు దగ్గిర కూర్చుని రాసేవాళ్లలో, "ఈసెల్" ముందు మంచుని బొమ్మలువేసేవాళ్లలో ఆచరణ, ప్రత్యక్షంగా కనిపించే కార్యం అసూయ పుట్టేట్లు చేస్తూ ఉంటాయి. ఈ అసూయ ఒక రకంగా ప్రశంసతో సమానమయినది. పాపం, ఒక రచయిత అన్నాడుట: "ఆ జడ్జి ఎవరో దౌర్భాగ్యుడికి శిక్ష వేస్తే వాడు అయిదేళ్ళు జెయిలుకి వెడతాడు. నేను పుస్తకం రాస్తే ఏమీ అవదు!" ఈ రచయిత ఒక కోర్టు "సిట్టింగ్"కి వెళ్ళి ఉదయం సెషన్ అయిన తరువాత ఇలాగ అన్నాడని అగస్టన్ బిరెల్ చెప్పాడు ఈ వైఖరి వాస్తవిక దృష్టిని తెలుపదు. ఎందుకంటే, పుస్తకాలు ప్రచురించబటం ద్వారా చాలానే విశేషాలు జరిగాయి. మనుష్యుల ఆలోచనలు, భావాలకి సంబంధించిన రచన సాధించినన్ని ఫలితాలు విగ్గు, ఎర్మిన్ కోటు వేసుకున్న వ్యక్తి ప్రవచనాలు సాధించగలవా ? అసలు ఈ వ్యక్తి ఏ చట్టాలని అమలు పెడుతున్నాడో ఆ చట్టాలు తయారు కావటానికి పుస్తకాలుకూడా తక్కిన వాటంతా తోడుపడి ఉంటాయి. కాని, ఈ వైఖరి పోదు. యీట్స్‌మీద ఆడెన్ రాసిన "ఎలిజీ" లోని ఈ పంక్తులు చూడండి :

For poetry makes nothing happen; it survives,
In the valley of its saying where executives
Would never want to tamper; it flows south
From ranches of isolation and busy griefs
Raw towns that we believe and die in; it survives,
A way of happening, a month,

నాకు ఈ పంక్తులు స్మరణీయంగా తోస్తాయి; ఎందుకోగాని ఉపశమనాన్నికూడా ఇస్తాయి. అయితే, అవి నాకు అసత్యంగా తోచే వాటిని చెప్తాయి. ముందు "ఎక్సిక్యూటివ్" సంగతి తీసుకుంటే– ఉదాహరణకి పార్టీ నాయకులు– ఈ ఎక్సిక్యూటివ్‌లు తమకి కవిత్వాన్ని "మార్చే" హక్కు తప్పకుండా ఉందని అంటారు, కవిత్వం మాటకి ఎదురు వస్తుందని వాళ్ళకి అనిపిస్తే. ఈ మార్చటంతోనే వాళ్ళు "ది వాలీ ఆఫ్ ఇట్స్ సేయింగ్" ద్వారానే ముఖ్యమయిన నదులు పారవచ్చునని అంగీకరిస్తారు. ఇదే పద్య కావ్యంలో కవి "Peasant river" అని రాశాడు, ఈ నదే "fashionable quays" ల బల హీనత చూపించలేదనీ రాశాడు. కవిత్వం, కళ అంతా ఒక "నోరు" లాగ మాత్రమే జీవించగలిగితే నోరు చప్పుడు చెయ్యటానికేకాక ఆహారాన్ని తీసుకొనటానికికూడా ఉపయోగ పడుతుందని గ్రహించాలి.

ఇంతకీ పాయింటు ఏమిటంటే, ఒక రచయిత–అందులోనూ ఒక యువ రచయిత– తన భావాలని ప్రచురించి ఏమీ జరగలేదని "అనుకుంటాడు"; భావాలు చర్యలతో సమానంగా తోచవు. అందు చేతనే సాహిత్య గుణం కలవాళ్ళని "కార్యవాదం" ఆకర్షించినప్పుడు వారు ఆగలేరు. ఈసంగతిని గురించి రెనీ వయిన్ గార్డెన్ రాసిన "రయిటర్స్ ఎండ్ రివల్యూషన్"లో చదవవచ్చు: మనని ముగ్ధులని చేసే ఈ పుస్తకానికి "ది ఫాటల్ ల్యూర్ ఆఫ్ రివల్యూషన్" అనే ఉప శీర్షిక ఉండటం సమంజసంగానే ఉంది. శ్రీమతి వయిన్ గార్డెన్ ప్రదర్శించే ఉదాహరణలలో బాడెలెయిర్ ఉదాహరణకి మొదటి స్థానం ఇవ్వాలి. మానవుడి రోగాలు నయం కావనీ; మానవమృగానికి క్రౌర్యం, ఉగ్రతలతో నిండిన అరణ్యమే సరయిన నివాసమనీ; ఈ చెడులోంచి పుట్టిన వింత రంగుల పువ్వులోనే జీవితంయొక్క అందం ఇమిడి ఉందనీ; ఇంకెక్కడా అందం లేదనీ బాడెలెయిర్ అభిప్రాయం.

జీవితాన్ని గురించిన ఇటువంటి అభిప్రాయం ఒకటి ఉంటే అది సమాజాన్ని సమూలంగా మార్చివేసే పథకాలలో పాలుగొనకుండా రక్షించే ఒక ఇనాకులేషన్‌గా పనిచేసి తీరుతుందికదా! కాని, 1848 ఉద్యమంలో ఒక తుపాకీల అంగడిని దోచుకున్న ఒక గుంపులో బాడెలెయిర్‌కూడా ఉండటం అతని స్నేహితులు చూశారుట; అతనూ ఒక తుపాకిని ఆడిస్తూ ఏవరికీ తీసిపోకుండా నినాదాలని అరుస్తూ కనిపించాడుట.

శ్రీమతి వయిన్ గార్ట్నెన్ జాబితాలో కనిపించని ఉదాహరణలు సయితం నన్ను ఎంతో ముగ్ధుడిని చేస్తాయి. ఏడవ ఫెర్డినాండ్, ఇన్‌క్విసిషన్‌లకి వ్యతిరేకంగా స్పెయిన్ ప్రజలు తిరుగుబాటు చేసినప్పుడు ఇంగ్లాండులో కొందరు శ్రేయోభిలాషులు వాళ్లకి విరాళాలు పోగుచేశారు. పోగయిన ధనాన్ని ఇద్దరు కేంబ్రిడ్జి మనుష్యులు సిరెనీస్ కొండలలోకి ఒక రహస్య సంకేత స్థలానికి తీసుకు వెళ్లారు. అక్కడ కొందరు విప్లవ నాయకులకి ధనాన్ని అందచేసిన ఆ యువకుల పేరులు— ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్, ఆర్థర్ హల్లామ్. ఒక రహస్య మయిన పర్వతస్థావరంలో దాక్కునిఉన్న సాహసికులకే ఉపశమనం తీసుకు వచ్చిన ఈ ఇద్దరిలో ఒకతను "ఇడిల్స్ ఆఫ్ ది కింగ్, ఓడ్ ఆన్‌ది డెత్ ఆఫ్ ది డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్" అన్న వాటిని రాసిన కవి; రెండవమనిషి మరణమే టెన్నిసన్ చేత "ఇన్ మెమోరియమ్" కావ్యాన్ని రాయించ చేసింది!

ఒక వర్గం రూపంలో చర్య జరగటం అనేదానిచేత ఆకర్షింప బడేవారు రచయితలు ఒకరే కారనుకోండి. ఇతరులకి ప్రత్యక్షంగా ఫలితాన్ని ఇచ్చేది ఏదయినా చెయ్యటంద్వారా వచ్చే సంతృప్తి కావాలని ఉంటుంది. కాని రచయితల జీవితాలలో ఒంటరితనం ఎక్కువ. యౌవనంలో ఇది మరింత ఎక్కువగా ఉంటుంది. అందుచేతనే "శక్తి"కోసంపడే ఉబలాటంయొక్క ప్రభావం అధికంగా ఉంటుంది. సాహిత్యం "మంచిది" అని నమ్మేవాళ్లచేత మర్యాదగా సహింపబడటంకన్నా వాళ్ళచేత హృదయపూర్వకంగా ప్రోత్సాహింపబడకపోవటంకన్నా ఎవళ్లకో ఒకళ్ళకి ముఖ్యమయిన వాడుగా కనిపించటమే రచయితకి కావలసింది. తనకి అతీతంగా ఉండే లక్ష్యంకోసం అంకితం అయిన వ్యక్తి, తన ఆదర్శం యదార్థం కావటంకోసం తన జీవితాన్నే తాకట్టు పెట్టటానికి సిద్ధంగాఉన్న (లేదా ఉన్నట్లు కనిపించే) వ్యక్తి ఆకర్షించే వ్యక్తే అని రచయితకి అనిపించకుండా ఉండదు. ఇంగ్లీషులో కారిస్మా (Charisma) అన్న మాటని దేవశాస్త్రజ్ఞుల వద్దనుంచి కొట్టేశాము; ఇప్పుడు దీనిని తక్కిన రంగాల శాస్త్రవాళ్లు కూడా వాడుతున్నారు. పయిన చెప్పిన వ్యక్తికి "కారిస్మా" ఉన్నట్లు రచయిత తెలుసుకుంటాడు. ఒకవేళ రచయితకి ముందుగా జీవితానుభవం మీద ఈ సంగతి తెలియకపోయినా సాహిత్యమే "ఇది అంతే!" అని చెబుతుంది. టర్జెనీవ్ రాసిన "ఆన్ ది ఈవ్" తెలుసుకదా! అందులోని ఎలెనా ఒక తెలివయిన రష్యా అమ్మాయి. ఈ అమ్మాయిలో బెరుకుతనం ఉంది, అవగాహనశక్తి ఎక్కువ, ఆమె కుటుంబం మంచిది, తన వర్గానికి చెందిన ఆండ్రెయి బెర్సెన్యేవ్ అనే యువకుడు ఆమెని ప్రేమిస్తాడు, షూబిన్ అనే చిత్రకారుడి ప్రేమకూడా ఆమె తేలికగా పొందగలదు. కాని, ఆమెకి వాళ్లిద్దరూ అక్కరలేదు. ఆమెని పూర్తిగా ఆకర్షించేవాడు డిమిత్రీ నికానోరోవిచ్ ఇన్సరోవ్. ఇన్సరోవ్ బల్గేరియా దేశస్థుడు. అతను ఇతరులకి దూరంగా ఉంటాడు, తీవ్రస్వభావం కలవాడు. టర్కీ పాలననుంచి బల్గేరియాని విడిపించటమే అతనికి ఉన్న ఉజ్వలమయిన జీవితాశయం. ఈ ఆశయం పట్ల అతనికి ఉన్న ప్రగాఢానురాగాన్ని ఆమె పంచుకొనటం మొదలు పెట్టిన తరువాతనే తన దేశంనుంచి బహిష్కరింపబడిన ఇన్సరోవ్ ఆమెని గమనించటం మొదలు పెట్టాడు.

"ఎలెనా అతన్ని ఓరగా చూసింది.

"మీ దేశం అంటే మీకు చాలా ఇష్టంకదూ?' అనగలిగింది బెదురుగా.

'అది చెప్పటం కష్టం,' అని అతను సమాధానం చెప్పాడు, 'తన దేశంకోసం చనిపోగలిగినప్పుడే తన దేశాన్ని ప్రేమించాడని అనవచ్చు.'

'అంటే బల్గేరియా కి తిరిగివెళ్లే అవకాశమే లేకపోతే మీకు రష్యాలో ఉండిపోవటం కష్టంగా ఉంటుందా?' అని ఎలెనా అడిగింది.

ఇన్సరోవ్ చూపులని కిందికి మళ్లించాడు.

'నేను దాన్ని భరించలేను,' అన్నాడు.

'ఇదుగో చెప్పండి,' అన్నది ఎలెనా మళ్లీ. 'బల్గేరియా భాష నేర్చుకొనటం కష్టమా?'

'కానేకాదు. రష్యా వాళ్లకి బల్గేరియా భాష రాకపోవటం దారుణం. రష్యావాళ్లకి స్లావ్ దేశాల భాషలన్నీ రావాలి. మీకు కొన్ని బల్గేరియా పుస్తకాలు ఇవ్వనా? ఎంత తేలికో మీకే తెలుస్తుంది. ఏమి జానపదగేయాలు! సెర్వియా భాషలోని వాటితో సమానంగా ఉంటాయి... ఆగండి ... అనువాదం చేసిపెడతాను... కాని మీకు మా చరిత్ర ఏమయినా తెలుసా?'

'తెలీదు. ఏమీ తెలీదు!' అని జవాబు ఇచ్చింది ఎలెనా.

'కొంచెం ఆగండి, ఒక పుస్తకం తీసుకువస్తాను. ముఖ్యమయిన సంగతులు తెలుస్తాయి. అప్పుడు ఈ జానపదగేయం వినండి...నేను మీకొక అనువాదం తెచ్చి ఇవ్వటమే మంచిదేమో! మామీద మీకు ప్రేమ పుట్టుకొస్తుంది ... అణగదొక్కబడిన వాళ్లందరంటేనూ మీకు ప్రేమే కదా! అసలు మా దేశం ఎంత

పాడపంటలదో తెలుసా? దాన్ని నాశనం చేస్తున్నారు, అణగదొక్కేస్తున్నారు...' అంటూ చెప్పుకుపోయాడు అతను అప్రయత్నంగా తన చేతిని విదిలిస్తూ. అతని ముఖం నల్లబడింది. 'అంతా దోచేశారు! అంతా! మా చర్చిలు, మా చట్టాలు, మా భూములు... శుచీ శుభ్రంలేని టర్క్‌లు మమ్మల్ని పశువులని తోలినట్లు తోలుతారు, నరికి పారేస్తారు...'

'డిమిట్రీ నికానోరోవిచ్!' అని అరిచింది ఎలెనా.

అతను ఆగాడు.

'క్షమించండి. దీన్ని గురించి నిదానంగా మాటాడలేను. కాని మీరు నా దేశాన్ని నేను ప్రేమిస్తున్నానా, అని అడిగారు. ఈ భూమి మీద ఇంక దేన్ని ప్రేమించగలము? అసలు మారనిదీ, సందేహాలకి అతీతం అయినదీ, దేవుడి తరువాత నమ్మితీరవలసిందీ ఏమిటి? ఇక ఆ దేశానికి అవసరం వచ్చినప్పుడు...ఆలోచించండి, బల్గేరియాలో కెల్లా పేదరైతుకీ, పేదముష్టివాడికీ, నాకూ ఒకటే కోరిక... మా అందరి లక్ష్యమూ ఒకటే...అది మాకు ఎంత బలం, ఎంత ఆత్మవిశ్వాసం ఇస్తుందో మీకు అర్థం అవుతుంది.'

ఇన్సరోవ్ ఒకక్షణం మౌనంగా ఉండిపోయాడు. తరువాత మళ్ళీ బల్గేరియాని గురించి మాట్లాడటం మొదలుపెట్టాడు. ఎలెనా అతని మాటలని శ్రద్ధగా విన్నది. ఆమె శ్రద్ధలో విషాదం ఉంది. అది ప్రగాఢమయినది. ఎలెనా అందులో మునిగిపోయింది. అతను మాట్లాడటం ఆపిన అనంతరం మరోకసారి అడిగింది.

''అంటే దేనికోసమూ రష్యాలో ఉండలేరా?''

ఇక్కడ తన వ్యాఖ్య ఏదీ మధ్య రాకుండా ఆ అమ్మాయిలో ప్రేమ అంకురించటాన్ని చక్కగా నాటకంలోలాగ చూపించాడు రచయిత. కథలోని అబ్బాయి అమ్మాయి విలువ తెలుసుకున్నందుకు కాదు ఆమె అతనిని ప్రేమించేది; తమ ఇద్దరికీ అతీతమయిన విలువని ఒక దానిని తెలుసుకున్నందుకే ఆమె అతనిని ప్రేమిస్తుంది. ఈ ప్రేమ విషాద పర్యవసానమే నవలయొక్క వస్తువు కాని, ఆకర్షణ, ఆ ఆకర్షణ స్వభావం-వీటిని అందంగా చూపిస్తాడు రచయిత.

ఒక ఉద్యమంలో లీనమయిపోవటం; స్థూలమయిన ఒక లక్ష్యం కోసం యుద్ధం చెయ్యగలిగే జీవితంలో ఎంత అందం ఉన్నదో చూడగలిగినవాళ్ల సంభ్రమాన్ని, విశ్వాసాన్ని చవిమాడటం; ఇదంతా రచయితకి తన సమస్యల పరిష్కారంగా తోచవచ్చు. అయితే, రచయిత తన సమస్యలని ఎదురుకొనలేక పోయినట్లయితే అతను రచయిత కాకూడదు. ఈ వృత్తిని, ఇంకా సూక్ష్మంగా చెప్పాలంటే ఈ వ్యాపకాన్ని, మరింత సూక్ష్మంగా చెప్పాలంటే ఈ స్థితిని స్వీకరించిన తరువాత అతను కొన్ని సంగతులని తెలుసుకోవటం అవసరం. సాంఘిక, రాజకీయస్థితి; మొత్తంమీద అతన్ని తాకే అనుభవం (అది వేలకొద్ది ఎందరినో తాకే అనుభవమే) ఎంతదాకా కళకి పనికివచ్చే వస్తువు కాగలదో అతను తెలుసుకోవాలి. ఎంతదాకానో తెలుసుకోవటమే కాక ఎలాగో కూడా తెలుసుకోవాలి.

''మొదలు, తుది'' కూడా ఒక వ్యక్తిగా అతని అనుభవమే అనుకోండి...కొన్నెప్పుడు రాజకీయాలకి చెందినవిగా వర్ణింపబడే సంఘటనల జాలం అతని సర్వావస్థలో స్పందనాన్ని కలిగిస్తుంది. ఈ సంఘటన అతన్ని నైతికంగా, కాల్పనికంగా, చిత్ర వికారపరంగా కదిలిస్తుంది. అతనుచేసే కళాసృష్టి వీటన్నిటినీ ఏకం చేస్తుంది.

ఒక్కొక్కసారి ఒక పెద్ద రాజకీయ సంఘటన ప్రపంచం అంతటా చెలరేగినప్పుడు కవులలో కలిగే ప్రతి కియ షెర్లాక్ హోమ్స్ గమనించిన కుక్క ప్రవర్తనని గుర్తుకి తెస్తుంది.

— ఇంకా దేనిని గురించయినా నాకు చెప్పాలనుకుంటున్నావా?

— రాత్రి కుక్కకి సంబంధించిన సంఘటనని గురించి మాత్రమే...

— కుక్క రాత్రి ఏమీ చెయ్యలేదే !

— అదే విశేషం.

ఈ శతాబ్దంలోకెల్లా పెద్ద విశేషం అనుకోదగినది — కుక్క రాత్రిపూట మొరగకుండా ఉండిపోయిన సందర్భం—పాశ్చాత్య కమ్యూనిస్టులు స్టాలిన్ వామపక్షంవారికి చేసిన ద్రోహంపట్ల క్రమంగా కనిపించిన అప్రియమే అనుకుంటాను. రష్యా ప్రజలు తిరగబడి తమ భూస్వాములని, జార్‌నీ తొలగించి అధికారం ఇకమీదట బీదల చేతులలో ఉంటుందని చాటినప్పుడు ప్రపంచంలోని ప్రతిదేశంలోని యువకులూ, ఉదారస్వభావులూ వెంటనే రష్యా ప్రేమలోపడిపోయారు. ఆ తర్వాత రష్యానుంచి వార్తలు బయటపడటం మొదలుపెట్టినప్పుడు నిజంగానే ప్రజాదరణ పొందిన విప్లవం మొదటి దశ ముగిసి, తమ ఉద్యమానికి అంకితం అయిపోయిన కొందరు నిర్దాక్షిణ్య విప్లవకారుల కూటమి దేశంలో అధికారాన్ని చేజిక్కించుకున్నారని తెలియటం మొదలుపెట్టినప్పుడు; ఒకప్పుడు కొరడా దెబ్బలు తిన్న రష్యా ప్రజలు ఇప్పుడు స్కార్పియన్ (ఒకరకం చిత్రవధచేసే సాధనం) దెబ్బలు తింటున్నారని తెలియటం ప్రారంభం అయినప్పుడు ఈ ఉదార యువజనమే ఇటువంటి వార్తలని విప్లవ వ్యతిరేక ప్రచారపు ఎదురు దెబ్బగా నిరసించారకోండి. క్రమంముగా కాలం గడిచింది. ఉదార యువజనం యౌవనంకాస్త తరిగిపోయింది. వారి ఔదార్యంకూడా కాస్త తగ్గి ఉండవచ్చు కాని వారికి రష్యా అంటే నమ్మకం తగ్గలేదు. ఈ నమ్మకం స్టాలిన్‌తో ముడిపడిన నమ్మకం. స్టాలినే రష్యా, రష్యాయే విప్లవం-అతను ఎలాగ తప్పుచెయ్యగలడు ?

కొన్ని కడుపు కదిలే ఉదంతాలు వారిచేత ఈ వైఖరిని వదులు

కునేట్లు చేశాయి. కొందరు 1939 నాజీ-సోవియట్ ఒప్పందంతో తప్పుకున్నారు; మరికొందరు సోవియట్ యూనియన్ కిందఉన్న జర్మనీ భాగంలో యుద్ధం అనంతరం స్వేచ్ఛగా ఎన్నికలు జరగలేదని, తూర్పు యూరోపు సామ్రాజ్యం తయారయినదనీ తప్పుకున్నారు; వీరందరికన్నా ఎక్కువమంది 1956 లో హంగేరి చితకకొట్టబడిన తరువాత దూరమయ్యారు. కొందరు అసలు దూరమే కాలేదనుకోండి. ఇప్పటికీ స్టాలిన్ తప్పు చెయ్య లేనివాడనే సిద్ధాంతాన్ని వదులుకోని గట్టి 'స్టాలినిస్టు'లు ఉన్నారు. స్టాలిన్ చంపినా, ద్రోహం చేసినా ఇవి రెండూ తప్పుకాకపోగా ఒప్పు అయి తీరుతాయని వారి సిద్ధాంతం. 1956 లో కవి హ్యూగ్ మెక్‌డయార్మిడ్ ఈ దృష్టితోనే తిరిగి కమ్యూనిస్టు పార్టీలో చేరాడని మనం అనుకోవాలి. కొన్ని సంవత్సరాల పాటు పార్టీ బయట ఉండిపోయిన ఇతను 'ఈ వదిలి వెళ్లిపోయే వాళ్లంతా మెతకవాళ్ళు, వాళ్ళుపోవటం పార్టీకి మంచిది' అన్నాడు.

ఉండిపోయినవాళ్ల వైఖరులు స్పష్టంగానే ఉన్నాయి; మరి వదిలివెళ్లిపోయిన వాళ్ల సంగతేమిటి? వాళ్ల అంతరంగాలలో ఎటువంటి పెనుగులాటలు, ఆవేదనలు, ప్రశ్నలు, తీర్మానాలు చెలరేగాయి? వాళ్లలో కవులయిన వాళ్లు ఈ వస్తువుని తమ కవిత్వంలో ఎందుకు వాడుకోలేదు? నేను ఎన్నో పద్యకావ్యాలని చదివే ఉండకపోవచ్చు కాని 1930, 40, 50 ప్రాంతాలలో రాసిన ఏంతో కవిత్వాన్ని చదివాను. రాసిన వారిలో ఎందరో సోషలిస్టులు ఉన్నారు. అయినా అతి పవిత్ర నాయకుడు స్టాలిన్‌పట్ల విశ్వాసాన్ని ఉపసంహరించుకున్న ఆవేదనని గురించి ఒక్క పద్యాన్నికూడా చదవలేదు.

ఇది ఎంత విశేషమయిన పరిస్థితో సుమారు ఒకటిన్నర శతాబ్దంకింద జరిగిన ఒక సంఘటనల క్రమంతో దీనిని పోల్చిచూస్తే తెలుస్తుంది. ఫ్రాన్సు ప్రజలు తమ రాజులకీ, ప్రభువులకీ ఎదురు తిరిగి వారిని తీసివేసినప్పుడు; విప్లవయుత మయిన ప్రజాస్వామ్యాన్ని ప్రకటించినప్పుడు; ప్రతిదేశంలోనూ ఉదారస్వభావంకల యువతరం ఫ్రాన్సు ప్రేమలో మునిగిపోయింది. విప్లవ సమాజంనుంచి నెపోలియన్ నాయకత్వం కింద "మహాసైన్యం" ఉదయించింది. అప్పటికే ప్రతి దేశంలోనూ కొందరు, 'నెపోలియనే ఫ్రాన్సు, ఫ్రాన్సే విప్లవం — అందుచేత నెపోలియన్‌ది తప్పు అనటానికి వీలులేదు" అని నమ్మిన వాళ్లు ఉన్నారు.

చివరికి వాటర్‌లూ యుద్ధంలో నెపోలియన్ ఓడిపోయాడు. ఇంగ్లీషు వారిలో అధిక సంఖ్యాకులు సంతోషించారు. "నెపోలియన్ యుద్ధం బాధలు తీరాయికదా," అని వాళ్లు అనుకున్నారు. ఇది బ్రిటన్ విజయం అనుకున్నారు. కాని, నెపోలియన్ అంటే విస్మయం పోగొట్టుకోలేని అభ్యుదయ వాదులకి ఇదొక విషాద దినంగా తోచింది. వాళ్లు, ముందు తనమీద, తరువాత లేహంట్ విలియం హజ్లిట్‌ల మీద ఎటువంటి భిన్నమయిన ప్రభావాలు కనిపించాయో బెంజమిన్ రాబర్ట్ హేడెన్ తన డయిరీలో వర్ణించాడు:

"నేను మళ్ళీ స్కాట్‌ల ఇంటికి పరిగెత్తుకుని వెళ్ళాను. వాళ్ళు అప్పటికే నిద్రకి ఉపక్రమిస్తున్నారు, కాని నేను తలుపుతట్టి లేపాను. 'డ్యూక్ నెపోలియన్‌ని ఓడించాడు, మూటఏభయి ఫిరంగులని తీసేసుకున్నాడు, పారిస్ మీదకి దండెత్తి వెడుతున్నాడు;' అని చెప్పాను. స్కాట్ ప్రశ్నలు వెయ్యటం మొదలు పెట్టాడు. 'ఈ ప్రశ్నలు చాలు; నేను చెప్పింది నిజం,' అన్నాను. ఇద్దరం కలిసి 'హుర్రా!' అన్నాము.

"నేను ఇంటికి వెళ్ళి పడు కున్నాను. లేచి పని మొదలు పెట్టాను. శామ్మన్స్ నా మాడల్‌గా పని చేసేవాడు. (హేడెన్ చిత్రకారుడు. అతని బొమ్మలకి నమూనాగా నుంచునే మాడెల్ శామ్మన్స్ అన్న మాట: సం) అతను రెండవ లైఫ్‌గార్డ్స్‌లో కార్పోరల్‌గా పనిచేస్తున్నాడు. మా పని చేసుకుందామనుకున్నాము గాని అతను యుద్ధంలో తన రెజిమెంట్ ఏమి చేస్తుందో అన్న ఆదుర్దాలోపడి స్థిరంగా ఉండలేక పోయాడు. నేనూ మంచి వేడిలో ఉన్నానేమో శామ్మన్స్‌ని వెళ్ళిపొమ్మని చెప్పాను. వెళ్ళినవాడు మర్నాడు సాయంకాలానికి కాని మళ్ళీ కనిపించ లేదు. వచ్చిన వాడు మాటల నిషాలో ఉన్నాడు. నేను గెజెట్ చదివి పడు కున్నాను. రాత్రి కలలో నేనూయుద్ధం చేశాను. ఆవేశంలోనే మేలుకుని 'గెజెట్'ని ఒకసారి చదివాను. 'కూరియర్' (పత్రిక)కి ఒక నెల చందాకట్టాను. పత్రికలు అమ్మే అంగడికి వెళ్ళి నీరసం వచ్చే దాకా పత్రికలన్నిటినీ చదివాను. 'మన దేశం ప్రయత్నాలు మహత్తరమయినవికావూ?' అనుకున్నాను. 'ఇటువంటి వైభవాలకి నా చిత్రకళ వైభవం కూడా చేరితే ఇది ప్రపంచంలోకెల్లా గొప్పదేశం అవుతుంది. దేవుడు నాకు అంత ఆయుస్సు ఇవ్వాలి!'

"జూన్ 25 : గెజెట్‌ని మళ్ళీ చదివాను. ఇప్పుడు అదంతా నోటికి వచ్చేసిందినాకు. హంట్ (కవి)తో భోజనం చేశాను. ఈ వార్త అతనితో చెప్పి అతన్ని కంగారు పెట్టకుండా అపుకోగలిగినందుకు నన్నునేనే అభినందించుకున్నాను. అతను కొంతసేపు మాట్లాడకుండానే ఉండిపోయగాడు కాని ఎప్పుడో అప్పుడు దాని ప్రసక్తి రాక తప్పదు, కనుక, 'ఇది చాలా భయంకర మయిన యుద్ధం హేడన్' అన్నాడు, ఔదార్యాన్ని పటిస్తూ. 'ఎంతో గొప్ప యుద్ధం హంట్.' 'అవునవును, నిజమే.' ఒక చర్చ తప్పలేదు మాకు.

అయినా హంట్ ఈ ప్రశ్నని న్యాయమయిన దృష్టితో, ఉదార మయిన దృష్టితో చూడగలిగాడు. హజ్లిట్ సంగతే వేరు. నెపోలియన్ పరాజయం అతన్ని ఎంతకలవరపెట్టిందో చెప్తేనమ్మటం కష్టం. అతని మనస్సు, శరీరమూ రెండూ కుంగి పోయినట్లు కనిపించాయి. స్నానంచెయ్యకుండా, గడ్డంగీసుకోకుండా తిరిగాడు. పగటిపూట అంతా తాగే వుండేవాడు రాత్రి సంగతి చెప్పనే అక్కర లేదు. ఇలాగ నాలుగు వారాలు గడిచాయి. చివరికి మత్తులో నుంచి లేచినట్లు లేచి మద్యపానీయాలు పుచ్చుకోవటం పూర్తిగా మానేశాడు."

హజ్లిట్ నెపోలియన్ జీవిత కథని పెద్ద గ్రంథంగా రాశాడు.

ఒక రకంగా తాము ఫ్రాన్స్‌లో అద్వైత భావాన్ని ఏర్పరచుకున్నారు. తన ఆరాధ్య దైవం వినాశనాన్ని అతను భరించలేకపోయాడు. అతను

భావనాశక్తి కల రచయితకాదు. అందుకని, అతనిలో చెలరేగిన సంచలనం వర్ణన, ఆవేదనల వర్ణన ఏదీలేదు. కాని, అతని కథ మరొక గొప్పకవి కథకి "బాక్ గ్రవుండ్" గా ఉపయోగపడింది. వర్డ్స్‌వర్త్ తను సహించిన ఆవేదనని వర్ణించాడు: అతను ఒక యువకుడుగా ఫ్రాన్సుని పర్యటించాడు· అవి విప్లవంయొక్క ప్రారంభ దశరోజులు, విప్లవం ఆదర్శాల నిషా అధికంగా ఉండేరోజులు. ప్రతి కేఫ్ (కఫే) లోనూ, ప్రతి ఊరి సెంటరులోనూ ఆవేశపూరితమయిన చర్చలు జరిగేవి. ఎక్కడచూసినా కొత్త భావాలు వెలిసేవి. 'మానవ స్వభావం మళ్ళీ జన్మిస్తోంది,' అనిపించేది. విప్లవం జరిగిన ఫ్రాన్సు దేశం నెపోలియన్ పయికివచ్చిన ఫ్రాన్సుదేశం అయింది. ఆ దేశం యొక్క శక్తి ఎక్కువ కావటం మొదలయింది. వర్డ్స్‌వర్త్ ఒక గాఢమయిన ఆవేదనకి లోనయ్యాడు. అతను ఒక పల్లెటూరు అబ్బాయి. తన వాతావరణం, పరిసరాలలో వేళ్ళు పాతుకుపోయిన వాడు. అటువంటి వాడిలో తనదేశంతో యుద్ధంచేసే విదేశాన్ని బలపరచగలిగే మార్పుఅంత సులభంగా రాదు. వియత్నాం తరంలాగ అతను తనదేశస్తులని చంపే సైనికులపట్ల హర్షాన్ని తెలిపే ధ్వనులు చెయ్యలేదు.

... I, who with the breeze
Had play'd, a green leaf on the blessed tree
Of my beloved country; nor had wish'd
For happier fortune than to wither there,
Now from my pleasant station was cut off,
And toss'd about in whirlwinds. I rejoiced,
Yea, afterwards, truth most painful to record!
Exulted in the triumph of my soul
When Englishmen by thousands were o'erthrown,
Left without glory on the Field, or driven,
Brave hearts, to shameful flight. It was a grief,
Grief call it not, 'twas anything but that,
A conflict of sensations without name,
Of which he only who may love the sight
Of a Village Steeple as I do can judge
When in the Congregation, bending all
To their great Father, prayers were offer'd up,
Or praises for our Country's Victories,
And 'mid the simple worshippers, perchance,
I only, like an uninvited Guest
Whom no one own'd sat silent, shall I add,
Fed on the day of vengeance yet to come?

వర్డ్స్‌వర్త్ వర్ణించిన ఫ్రాన్సు బీభత్సాలతో నిండిన ఫ్రాన్సు అప్పుడు దానిని ఒక రక్తదాహం ఆవరించిఉంది. 'కొందరి నేరాలు ఎందరి ఉన్మాదంగానో మారిపోయాయి' అతని వర్ణనలలో విషాదం ధ్వనిస్తుంది. వాటిని చదివిన వారికి ప్రజావ్యవహారాలలో కవిత్వానికి వ్యతిరేకమయినదంటూ, భావనకి వ్యతిరేకమయినదంటూ ఏదీ ఉండదని అవి గుర్తు చేస్తాయి. కావలసింది ఒకటే. ఒకటి, అంటే పూర్తిగా ఒకటే. అది ఎల్లకాలాలకి కావలసింది. అది ఏమిటి, అంటే సమాధానం—ఒక కవి ఒక పరిస్థితికి పూర్తిగా స్వంతమయి పోవాలి. అది అతని వేళ్ళలోకి చొచ్చుకుపోయి మళ్ళీ కొత్త ఆకుగా చిగిరించాలి. "బిర్నామ్ వుడ్స్" కొమ్మల ప్రదర్శనలు పనికిరావు·

ఒక కావ్యం ప్రజలందరికీ సంబంధించిన పరిస్థితిని గురించి చెప్తుందనుకోండి; అప్పుడు అది ఆ పరిస్థితిని తన రూపకాలలోకీ, తన లయలోకీ, తన పద నిర్మాణంలోకీ పిల్చుకోవాలి. 'ప్రెల్యూడ్' (కావ్యం)లో వర్డ్స్‌వర్త్ తన విప్లవ రాజకీయాల అనుభవాన్ని తన కావ్యంలో ఒక భాగం చెయ్యగలిగాడు. వర్డ్స్‌వర్త్ తను పర్వతాల మధ్య, నగరాలమధ్య అనుభవించిన వంటరితనాన్ని సహజంగా వర్ణిస్తాడు. ప్రెల్యూడ్ కావ్యంయొక్క ధ్వని, గమనంకూడా ఈ వంటరితనం అంత సహజంగానూ ఉంటాయి. జాన్ క్రో రాన్సమ్ తన "కాప్టెన్ కార్పెంటర్"లో ఇటువంటి విజయాన్నే సాధించాడు అతనిది వేరేరంగం అయినప్పటికి. ఇది అసలు ఒక ప్రసంగం. దానిని వ్యాసంగా మార్చి రాశాను. బయటికి చదవగలిగితే "కాప్టెన్ కార్పెంటర్" పద్య కావ్యాన్ని పూర్తిగా చదివేవాడిని. కాని, అచ్చులో ఈపని చెయ్యటం అనవసరం. 1920 లో ప్రచురింపబడిన ఈ పద్యకావ్యం బాగా ప్రసిద్ధం అయిపోయింది; లారా రైడింగ్, రాబర్ట్ గ్రేవ్స్‌లు తమ 'సర్వే ఆఫ్ మోడర్న్ పొయెట్రీ' లో దానిని పూర్తిగా ఉదాహరించారు. 'ఆక్స్‌ఫర్డ్ బుక్ ఆఫ్ అమెరికన్ వెర్స్' వంటి సంకలనాలలో అది కనిపిస్తుంది. అచ్చు అయిన రాన్సమ్ పద్య కావ్యాల సంకలనంలోఉంది. అట్లాంటిక్ సముద్రం ఇరువయిపులా ఎవరికయినా దానిని చదవాలని అనిపిస్తే తేలికగా చదువుకోవచ్చు. కాని రాన్‌సమ్ రాసిన కొన్ని మాటలని ఇక్కడ ఉదాహరిస్తాను—కేవలం మీకు గుర్తుచెయ్యటానికే; కాప్టెన్ కార్పెంటర్, "rose up in his prime, put on his pistols and went riding out." కార్పెంటర్ డాన్ క్విక్సోట్ వంటివాడు. ఎప్పుడుచూసినా గుర్రం ఎక్కి యుద్ధానికి వెళ్ళిపోతూఉంటాడు. ప్రతిసారీ తనని తేలికగా ఓడించే ప్రత్యర్ధిని ఎదురుకుంటాడు. ఒక "pretty lady" కత్తితో అతని ముక్కు కోసేస్తుంది. తరువాత వచ్చేవాడు.

a stranger rogue
That looked unchristian but be that as may
The captain did not wait upon prologue

ఈ అపరిచితుడు కాప్టెన్ కాళ్ళు విరగకొడతాడు. శాటాన్ (Satan) భార్య అతని చేతులు కొరికివేస్తుంది; ఇంకెవరో అతని చెవులు కొరికివేస్తారు; ఆ తరువాత అతని కళ్ళుపోతాయి; చివరికి—

I heard him asking in the grimmest tone
If any enemy yet there was to fight?
"To any adversery it is tame
If he risk to be wounded by my tongue
Or burnt in two beneath my red heart's flame
Such are the perils he is last among."

చివరికి అతని అతిహీన ప్రత్యర్థి అతని దేహాన్ని కోసి గుండెని బయటికి తీస్తాడు; "The neatest knave that ever was seen stepping in perfume from his lady's bower."

పద్యకావ్యం ముగింపు కదిల్చివేసేట్లుగా ఉంటుంది. కవి కాప్టెన్ కార్పెంటర్‌ని గురించి ఆక్రోశిస్తాడు. అతని శత్రువులని శపిస్తాడు. పద్య పంక్తులలో జాలితోగూడిన విషాదం ప్రతిధ్వనిస్తుంది.

I would not Knock old fellows in the dust
But there lay Captain Carpenter on his back
His weapons were the old heart in his bust
And a blade shook between rotten teeth alack.

ఈ పద్యకావ్యం జాలిని ప్రసరిస్తుంది. తలవంకించే వ్యంగాన్ని కూడా ప్రసరిస్తుంది. కాప్టెన్ కార్పెంటర్ ధైర్యశాలి, మంచివాడే కాని, అర్థంలేకుండా ప్రవర్తిస్తాడు. ఆత్మరక్షణకోసం అతను కీ ఇచ్చే బొమ్మలాగ కదిలి వెళ్ళిపోతాడు. ("అపరిచిత దుర్మార్గుడు, అ-క్రైస్తవుడు" కాకపోవచ్చు. కాప్టెన్ కార్పెంటర్ ఈ సంగతి నిర్ధారణ చేసుకోకుండానే యుద్ధానికి దిగుతాడు.) అతను ఉండే ప్రపంచమే అతనికి అర్థంకాదు; తక్కిన పాత్రలు ఏ నియమాలనీ పాటించరు—డాన్ క్విక్జోట్ ప్రత్యర్థులలాగే. శాటాన్ భార్య "should have made off like a hind" కాని "the bitch bit off his arms at the elbows." ఇక్కడ "Hind" గమనించదగినమాట. ఆమె హరిణిలాగ తత్తరపాటుతో వేగంగా పారిపోవలసింది, పరిచారికలాగ అణిగి ఉండవలసింది (Hind అంటె "farm servant" అనే అర్థం ఉంది); రెండూ చెయ్యదు. జాన్ క్రో రాన్సమ్ అమెరికా దక్షిణాదికి చెందిన కవి. ఇతని భావాలమీద వ్యవసాయం ప్రభావం అధికంగా ఉంటుంది. అతను దక్షిణాది సాహిత్య సాంఘిక సంప్రదాయాలమీద విశ్వాసం కలవాడు. ఈ సమాచారం మనకి తెలియగానే రాన్సమ్ పద్యకావ్యం అమెరికా దక్షిణాదిని గురించి రాసినది అని వెంటనే అర్థం అవుతుంది; అది అమెరికా అంతర్యుద్ధం. దాని పర్యవసానాలని గురించి అని అర్థం అవుతుంది. దక్షిణాది సద్గుణాలని అర్థం చేసుకోలేని (పంచుకొనటంమాట అలాగఉంచి) శత్రువులు ఎందుకు గెలిచితీరాలో తెలుస్తుంది. దక్షిణాది సహజంగానే ఓడిపోవలసిన ప్రత్యర్థి; ఎందుకంటే అది పాతబడిపోయినది, నేర్చుకో గలిగిన శక్తి కోల్పోయినదీ, కొంత వికటమయినదీ.

బయటనుంచి వచ్చే కొంత అతిముఖ్యమయిన సమాచారం ఎంత తేడా తీసుకురాగలదో తెలిపే పద్యకావ్యాలలో ఇదొకటి అని ఇక్కడ గమనించవచ్చు. రాన్సమ్‌కి వేటితో సంబంధాలు ఉండేవో అంతగా తెలియని పాఠకుడికి దక్షిణాది వస్తువు ఏదో ఉన్నట్లు అనిపించదు—పద్య కావ్యంయొక్క చిత్రం అలాగే కనిపించినప్పటికీ, దాని మానసిక ధాటి అంతగానే ఉన్నప్పటికీ. అసలు రాన్సమ్‌కి సంబంధించిన "దక్షిణాది-గుణం" బాగా ప్రజారంగానికి చెందినదే కదా! అల్లెన్ టేట్, కారొలీన్ గార్డన్, రాబర్ట్ పెన్ వారెన్‌లతోబాటు అతనూ నాష్‌విల్ (టెనెసీ రాష్ట్రం)కి చెందిన ఫ్యూగిటివ్ గ్రూప్‌తో సంబంధం కలవాడేకదా? "ఐ'ల్ టేక్ మై స్టాండ్" అనే శీర్షికతో వెలువడిన వ్యాస సంపుటిలో అతని వ్యాసమూ ఉంది. ఈ వ్యాసాలు వ్యవసాయ దృష్టిని తెలుపుతాయికదా? రాన్సమ్స్ బాక్‌గ్రౌండ్ లేక పృష్ఠభూమి తెలియకుండా అతని రచనలు చదవటం ఆడెన్, యేట్సు షెంకోల బాక్‌గ్రౌండ్‌లు తెలుసుకోకుండా వారి పద్యకావ్యాలని చదివినట్లే ఉంటుంది.

అమెరికా దక్షిణ ప్రాంతం చరిత్ర, అక్కడి సమాజంగురించి "కాప్టెన్ కార్పెంటర్" కనబరిచేదృష్టి రాన్సమ్‌కి నిజంగా ఉన్న దృష్టేనా అని సందేహించవలసిన అవసరం నాకు కనిపించటంలేదు. అతనివంటి దక్షిణాది వాడికి ఇటువంటి దృష్టే ఉంటుందని ఎవరయినా అనుకుంటారు. (బహుశ అది ఒక వర్ణజాతి మనిషి దృష్టి కాకపోవచ్చు.) పద్యకావ్యంలోని కథ ద్వారానే కాక దాని నిర్మాణంద్వారా కూడా ఇది ఏటువంటిదో తెలుస్తుంది. భాషకొంచెం చీకిపోయిన వేషాన్ని ధరించి ఉంటుంది. అది "tricked in antique ruff and bonnet"గా తోస్తుంది. "knave, rout (assembly అనేఅర్థంలో) enow" వంటి మాటలు పుష్కలంగా ఉంటాయి. ప్రతి పద్యం చివర మాత్రమే ఒక ఫుల్‌స్టాప్ ఉంటుంది. వేరే పంక్చుయేషన్ (Punctuation) ఉండదు. ఈ పద్ధతి కూడా ఒక బ్ర

కథని, ఒక "జానపద గేయకథ"ని స్ఫురింపచేస్తుంది. [ఈ సంగతిని రైడింగ్, గ్రేవ్స్‌లు చెప్పారు.] దీని భాష పురుగులు కొట్టేసి, వంగిపోయిన సోఫాని జ్ఞాపకం చేస్తుంది; దక్షిణాది ఇలాగే ఉంటుందని ఈ పద్యకావ్యం చెప్తోందన్న మాట. అయితే, ఈ సోఫాని ఎప్పుడో ఒక మంచిపనివాడు ఒక అందమయిన ఇంటి దర్జాకి సరిపోయేట్లు చేసి ఉంటాడు కనుక, ఇంట్లో వాళ్ళందరికీ అదంతా ఇష్టం కాబట్టి, ఆ సోఫాని ముక్కలుచేసి పొయిలో పెట్టటం విచారం కలిగించక మానదు. నీతికథ, రూపకం, భాషతీరు, లయ-ఇవన్నీ కలిసి తమ "క్విక్సోట్ గుణం"తో, వెలిసిపోయిన షోకుతో ఒక సాంఘిక, చారిత్రిక ప్రకటనని చేస్తాయి.

ఈ ప్రకటన తక్కిన ప్రకటనలన్నిటిలాగే ఒక 'వర్గం' యొక్క దృక్పథంతో చేసినదే. కాగితంమీద కలంపెట్టటం సంగతి అటుంచి, మనం నోరు తెరవగానే మన సాంఘికవర్గం ఏమిటో తెలిసిపోతుంది. మన పెంపకం, విద్యాభ్యాసం బయటపడిపోతాయి. పయిన చూచాయగా అనవే అన్నాను కదా రాన్సమ్ దృష్టి ఒక నల్లజాతి మనిషిది కాలేదనీ, నిరుపేద వర్గానికిచెందిన తెల్లజాతి (poor white) దృష్టి కూడా కాలేదనీ.

మన సమాజం మీదుగా ఒక "ప్రజావాదం" అల వెడుతోంది. ఇది ఒక గమనించతగిన దృగ్విషయం. దీనిని తాపీగా వ్యాఖ్యానించాలి దీని గుణాలలో కొట్టవచ్చేట్టుగా కనిపించేది ఒకటి ఉంటుంది. అది ఏమిటంటే, (ఇది ఏ కళారూపాన్ని తీసుకున్నా కనిపిస్తుంది) అందరికీ లేనిది ఎవరికీ ఉండరాదన్న గుణం లేక సిద్ధాంతం, ఇతరులకి లేని హక్కులుఉంటే నేరంగా భావించటం. ఈమధ్యనే ఒకవార్తాపత్రిక లేఖల "కాలమ్"లో ఎవరో ఒకరు "ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం యూనియన్" ఒక "Private Privileged Club" అంటూ తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చగా చదివాను. ఈ యూనియన్‌నే ఎందరో రాజకీయ వాదులు ఒక ఉపయోగ కరమయిన శిక్షణా కేంద్రంగా పేర్కొన్నారు. పయికి రావాలనుకునే ఒక రాజకీయవాదికి ఈ యూనియన్ పనికివస్తుందా అన్న ప్రశ్నని అలాగఉంచి, ఆ ప్రశ్న పెడదారిని పట్టించేదా అన్న ప్రశ్నని అలాగేఉంచి (సమాధానం నాకు తెలీదు)- privilege అన్న భావాన్ని ఒక క్షణం పరిశీలించటంలో తప్పులేదనుకుంటాను. ఈ సంఘం లేక యూనియన్‌లో ప్రవేశం ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీకి చెందిన వాళ్ళకి ఎవరికయినా, ఒక చిన్న చందాకట్టటానికి సిద్ధంగా ఉండేవాళ్ళకి ఎవరికయినా దొరుకుతుంది. ప్రతి ఏడాదీ వేలకొద్దీ యువజనం ఇందులో సభ్యత్వానికి అర్హులు అవుతూఉంటారు. వాళ్ళకి ఈ అర్హత జీవితాంతం ఉంటుంది. ఇదే "privilege" అయితే దారినపోయే వాళ్ళు చేరగలిగినది ఏదయినా "ప్రివిలేజి" అవుతుంది. ప్రతిబడీ, విశ్వవిద్యాలయం, సైనికదళం, లాడ్జి, ట్రేడ్ యూనియన్. తన సభ్యత్వాన్ని పరిమితిగా గుర్తించే ప్రతి సంస్థా (కేవలం నిర్వహణ సౌకర్యం కోసమే అవుగాక) "ప్రివిలేజి" ఆరోపణకి గురికాకూడదా? కావచ్చు. కాని ఆక్స్‌ఫర్డ్ యూనియన్ సొసయిటీనిమాత్రం తిట్టిపొయ్యాలి. ఎందుకు? "ఆక్స్‌ఫర్డ్" అనేమాట "ప్రివిలేజి" అన్నమాట వంటి ధ్వనినే కలిగి ఉన్నది కాబట్టే కావచ్చు, కన్సర్వేటివ్ (సోషలిస్టు కూడా) రాజకీయ వాదులు దానికి రుణపడి ఉన్నట్లు అంగీకరిస్తారు కాబట్టే కావచ్చు.

"పెన్నీకి మూడుసారు విసరచ్చు!" అనే ఈ "ఆంట్‌శాలీ" ఆట ఇకవాలు కాని, ఒక ముఖ్యమయిన గాలి ఎటు వీస్తోందో ఈ గడ్డిపరక తెలుపుతుంది. ఈ గాలినిచూసి భయపడే యువ కవులు తమ పనిని నిజంగా వృత్తి చేసుకునే వాళ్ళకి ఉండవలసిన శ్రద్ధతో అనుశీలించుకోలేక పోతున్నారు. వాళ్ళని ఒక భయం పట్టుకుంటుంది. బూతుమాట, వీధి మొగ-వీటిని స్ఫురింపచేసే ధ్వనిఉంది. అది యథాలాపంగా, సుపరిచితంగా ఉన్నట్లు తోస్తుంది. అది రచయితకి ప్రియమయినది కూడా. అందుకే వెనక్కి!-పోనీ ముందుకి, లేకపోతే పక్కకి!-జానపద దేశ్యానికి వెళ్ళిపోదాము! జానపదకళపట్ల ఆసక్తి అనేది సానుభూతి కలది; అది ఫలవంతమూకావచ్చు. అయితే, దాని కింద ఒక అసత్యాన్ని, నటించాలనిపింపచేసే ఒక భావ ప్రేరేపణని పసికట్టవచ్చు. "అభివృద్ధి చెందిన" దేశాలలో జానపదకళమీద భక్తి స్టీమ్ ఇంజన్‌మీద (కొందరు ప్రదర్శించే) భక్తివంటిది. అది స్మృతి మధురమయినదీ, పాతకాలం నాటిదీ, నిపాపమయినదీ, కరుణతో కూడినదీ, ఒక జ్ఞాపకానికి జీవంపోసి దాని వెచ్చదనాన్ని వాడుకోవాలని చూసేదీను. జానపద సంగీతం కచ్చేరీలు, నలుగురు పోగయి చదువుకునే శ్లాంగ్ (slang) కవిత్వం సభలు – ఇవి రెండూ ఆస్మృతి మాధుర్యాన్ని చవిచూడటమే ప్రధానోద్దేశంగా కలవి. ఇదొక పాపం అవి కాదు. అది పరిస్థితిని స్వచ్ఛమయిన దృష్టితో చూడకుండా అడ్డుపడినప్పుడే ఒక ఇబ్బంది అవుతుంది. ఇక ఉన్న పరిస్థితి ఏమిటి, అంటే జానపద దేశ్యం చచ్చిపోయింది. ప్రజా బాహుళ్యం చదివే పత్రికలు, వినే రేడియో-వీటిసంగతి సరేసరి. టెలివిషన్ రాగానే జానపదకళ గుండెలో బాకు దిగినట్లే. మనం జానపద దేశ్యం అంటూ ఆ చచ్చిన నిముకలగూడుమీద పూనికతో మాంసాన్ని, చర్మాన్ని కప్పబోతే మనమీద మనమే ఒక శిక్ష విధించుకుంటున్నాము. ఈ శిక్ష మూలాధారం లేని కళ రూపం ధరిస్తుంది.

ఒక కవి తను అధిక ప్రభావాన్ని ప్రదర్శించే స్థాయిలో పని చెయ్యాలని అనుకున్నప్పుడు, తన భావనాశక్తిని ఏటువంటిదో తెలుసుకోవాలని అనుకున్నప్పుడు, వీలయినంతమందితో తన భావాలని పంచుకోవాలని అనుకున్నప్పుడు – అతను ప్రపంచం అంతటా పెంపొందిన ఆధునిక కవిత్వపు సంపదని అనుశీలించి ప్రయోగిస్తాడు. ప్రజా

వాడికి "కష్టంగాఉండే" ఆధునిక కవి అంటే గిట్టదు. ఈ కష్టంగాఉండే కవి రచన అర్థంకాదు అని కొందరు అంటారు. చివరికి "taux-naif" కవికన్నా, నిజంగానే "naif" గా రాసే కవి కన్నా కష్టంగారాసే కవికే ఎక్కువ ప్రజాదరణ లభిస్తుంది.

ఈవాదానికి పూర్తిగా సహేతుకమయిన ప్రతివాదం ఒకటి లేక పోలేదు. ఆధునిక కళలు అధిక ప్రజలకి అందుబాటులో ఉన్నాయి, అవి బూర్జువా దేశ్యం కలిగి బూర్జువా ఆడియన్స్‌ని ఉద్దేశించి రాసినవి కాబట్టే ఇది వీలవుతుంది. కచేరీలకి వెడదామనుకునేవాళ్ళు, పుస్తకాలు కొందామనుకునేవాళ్ళు, చిత్రకళ ప్రదర్శనలకి వెడదామను కునేవాళ్ళు — వీరిలో అధిక సంఖ్యాకులు మధ్య తరగతి వాళ్ళే అయి ఉంటారు. వాళ్ళు సహజంగా మధ్యతరగతి కళాకారుడినే గమనిస్తారు. వీళ్ళే విదేశాలకి వెళ్ళగలరు, విదేశభాషలని చదువుకోగలరు కాబట్టి బూర్జువా కళాకారుడు పెద్ద అంతర్జాతీయ పాఠక-ప్రేక్షక సందోహాన్ని ఉద్దేశించి ఏమయినా చెప్పగలడు. పెద్దనిధులమీద పెత్తనం చెయ్యగలడు. ఇది కొన్నిప్పుడు ప్రయివేటుగా (మరికొన్నిప్పుడు ప్రజల ధనం మళ్ళింపులో) పెత్తనం చెయ్యగలిగి నప్పుడు వీలవుతుంది. మన సమాజం నిర్మాణాన్ని మనం మార్చుకున్న తరువాత ఇదంతా మారిపోతుందని మనకి హామీ ఇస్తారు.

తథాస్తు. బాగా మారిపోయిన సమాజంలో బాగా మారిపోయిన కళ చెలామణి అవుతుంది-న్యాయం, తీరిక, ఉత్పాదనశక్తి నిర్వచనాలు కూడా బాగా మారిపోయి చెలామణి అయినట్లే. అప్పుడు సంతోషం, విషాదం గుణాలు కూడా మారిపోతాయేమో! "హిప్పీ జంగిల్"లో ఇవి ఇప్పటికే మారిపోయాయి. కాని-జొనాథన్ స్విఫ్ట్ కాలానికే బాగా వాడుకలోకి వచ్చిన ఒక మాటని వాడాలంటే-మనం శుభ్రంగా తయారయ్యేదాకా మన మురికి నీటిని పారబోసుకోవద్దు! (స్విఫ్ట్ ఈ మాటని ముందువిన్నాడు. విని అచ్చులోకి ఎక్కించాడు. "బూర్జువా" అన్న పేరు తగిలించటం తేలిక అయినంతమాత్రాన ఇంకా ఆరోగ్యంగా ఉన్నదీ, ఫలవంతమయినదీ అయిన ఒక కళా సంప్రదాయాన్ని వదులుకోవటం విషాదకరమయిన పొరపాటే అవుతుంది. ఒక బూర్జువా వ్యక్తి కళపట్ల అభిరుచి చూపించి దాని కోసం కాలం, ప్రయాసని వెచ్చించినట్లుగా ఒక చేతిపని చేసే కార్మికుడు వెచ్చించకపోవటం విచారకరమే కావచ్చు. కాని, బూర్జువా కళని వదులుకుని మరింక దేనిమీదో ధనం, ప్రయాసలని వెచ్చించేదాకా అతన్ని హేళన చెయ్యటంవల్ల పరిస్థితి మెరుగుపడదు. ఈ విధంగా రంగం "సిద్ధం" కావచ్చు. అయితే, ఏ రంగం?

అసలు చివరికి ఇదంతా ముఖ్యమా అని ప్రశ్నించుకోవాలి. బండచేతులవాళ్ళు కొందరు కళని తీసుకుని, దానిని పొట్లం కట్టి, తూకంవేసి కొలిచి, తమకి పనికివచ్చే ఆకారం వచ్చేట్లు దాన్ని వంచి ఆ తరువాత ఇంకొక ఆకారం, ఇంకా మరొక ఆకారం వచ్చేట్లువంచి, చివరికి విసిగిపోయి విరిగిన మిగతా ఆటబొమ్మలతో బాటే దానిని అవతల పారవెయ్యకుండా చూసేందుకు మనం ఎందుకని ఇంత కష్టపడాలి? తీసుకుంటానని వాళ్ళు అంటూ ఉంటే దానిని వాళ్ళకే ఎందుకని ఇచ్చెయ్యకూడదు?

ఇచ్చెయ్య కూడదు. ఎందుకంటే, కళ (అంటే భావనయొక్క స్వేచ్ఛా ప్రవృత్తి) ఒకటే మనకి మిగిలి ఉంది. మన జాతి సాధించిన పూర్తి విజయాలలో ఇదొక్కటే అని వేలెత్తి చూపించవచ్చు. మన సాధనలు చాలామట్టుకు ప్రాణం నిలబెట్టుకోవటమనే విషయానికి సంబంధించినవే. బ్రతకటం ఒకటే కాదు, మనం మన తలలు ఎత్తి మనకి ఏదో విలువ ఉందని చెప్పదలుచుకుంటే మనకి కళతప్ప ఏమి మిగులుతుంది? తక్కినదంతా అపజయమే, లేదా రాజీయే. శాస్త్రాలు చదువుకున్నవాళ్ళు సంవత్సరాలపాటు కష్టపడి మళ్ళీ, మళ్ళీ కొత్త విజ్ఞానాన్ని సంపాదించుకుంటారు. వారి విజ్ఞాన-ఆర్జన ఇంకా ఇంకా క్రూరమయిన అస్త్రాల నిర్మాణానికి ఉపయోగపడే సాంకేతిక నైపుణ్యంలో మునిగిపోతుంది. ముప్పయి లక్షలమంది మామూలు రొట్టె కూడా లేకుండా మాడుతూ ఉంటే ముగ్గురిని చంద్రుడిమీదకి దింపేందుకు ఈ సాంకేతిక నైపుణ్యం తోడుపడుతుంది. రాజకీయ వాదులు తయారుచేసే అధికార-నిర్మాణాలు సరిగ్గా అధిక సంఖ్యాక వర్గం అనిపించుకునేవాళ్ళకి మాత్రమే భద్రత, సంతృప్తిని ఇస్తాయి. ప్రజలకి సుఖం, న్యాయం కల్పించటమే ప్రభుత్వంయొక్క లక్ష్యం అయినట్లయితే తక్కిన వాటన్నిటికన్నా కృతార్థమయిన ప్రభుత్వం అరవయి శాతం అపజయం పొందినదే అవుతుంది. భూతలంమీద అధిక భాగంలో ప్రభుత్వం అనేది రక్తసిక్తమయిన బీభత్సానికీ, దుర్వినియోగానికీ మారుపేరు.

పోనీ అంతర్జీవితాన్ని తీసుకుందామంటే దాని పరిస్థితీ అలాగే ఉంది. "మిస్టిక్" (mystic)లని నెత్తిమీద పెట్టుకోవచ్చు కాని వాళ్ళు తమ ఉద్వతానుభూతిని ఇతరులకి ఇచ్చెయ్యలేరు. మహాత్ములు అకళంకులు కారు. వాళ్ళ లోపాలే వాళ్ళని పీడిస్తూ ఉంటాయి. ఈ జీవితం కావాలనుకునిచేసే ప్రయత్నం ఏదీ నెగ్గలేదు. కొందరు తమ ఆదర్శం నెరవేరటానికి వ్యక్తిగత సంబంధాన్ని ఆధారం చేసుకుంటారు; మొదటి ద్రోహంతో పాడిఅయిపోతారు-చెట్ల ఆకులు రాలటం ఎంత తథ్యమో ద్రోహం అనేది జరగటమూ అంత తథ్యమే కదా! కళారంగంలో మాత్రమే మానవుడు అపజయానికీ, లేమికి అతీతుడు కాగలుగుతున్నాడు. ఒక గొప్ప చిత్రపటాన్ని చూసినప్పుడే, ఒక గొప్ప సంగీతం "సింఫనీ"ని విన్నప్పుడే, ఒక గొప్ప నాటకాన్ని చూసినప్పుడే, ఒక గొప్ప నవల లేకపోతే పద్యకావ్యాన్ని చదివినప్పుడే

మనం ఖండనలేని మానవ ఉద్ఘాటన సమక్షంలో ఉండగలుగుతున్నాము. అప్పుడే అపజయంలేని మానవ విజయం, మచ్చలేని మానవ వైభవం సమక్షంలో ఉండగలుగుతున్నాము; ఖండన, అపజయం, మచ్చ—ఇవన్నీ ఆ సర్వస్వంలోనే ఇమిడిపోయి దానిలో ఒక అంతర్భాగం అయిపోవటంవల్లనే కావచ్చు—ఆ సర్వస్వంతో బాటే పయికి లేవటం చేత, మన వైభవంలోనే మన మచ్చల ప్రతిబింబాలని మనం చూడ గలగటం వల్లనే కావచ్చు. ఏమయితేనేమి చివరికి మనల్ని మనమే ప్రశాంతతతో, కృతజ్ఞతతో స్వీకరించగలుగుతాము. మనం పూర్తిగా సాధించిన వైభవాలు, మనకి మిగిలిన వైభవాలు కళయొక్క వైభవాలే. వాటిని చవకచేసి, వాటిని కమిటీలముందు, మిలిటరీ మైదానాలలోకి తీసుకు రావాలని ఎప్పుడూ కోరుకునే వాళ్ళకి, వాటిని సాధనాలుగా వాడాలనీ, వాటికి చిక్కాలు వెయ్యాలనీ, వాటిని క్రమశిక్షణకి లోనుచేసి పనికివచ్చే ముక్కలుగా కొయ్యాలనీ కోరుకునే వాళ్ళకి మనం ఇవ్వగలిగిన సమాధానం ఒకటే. అది కొన్ని వందల సంవత్సరాలుగా వస్తున్న సమాధానమే. అది తప్ప వేరే సమాధానమూలేదు. 'Love's Labour Lost' చివరిమాటలలో అది ఇమిడి ఉంది.

"The words of Mercury are harsh after the songs of Apollo; you that way, we this way."

— ఎన్ కౌంటర్ మాసపత్రిక సౌజన్యంతో

[అనువాదకుడి మనవి: రచయిత ఉదాహరించిన ఇంగ్లీషు కావ్యాలలోని భాగాలని తెలుగు చెయ్యటానికి నేను ప్రయత్నించలేదు. రెండు ఫ్రెంచి మాటలని అలాగే వదిలివేశాను. ఒకటి రెండు ఇంగ్లీషు మాటలనికూడా అనువాదంకోసం ప్రయత్నించకుండా ఊరుకున్నాను. అవసరం లేకపోయినా కొన్ని "నోట్స్" ఇవ్వాలని అనిపించింది — 1. బెంజిమిన్ రాబర్ట్ హేడెన్ ఒక బ్రిటిష్ చిత్రకారుడు 2. బిర్నామ్‌వుడ్స్—మేక్బెత్ నాటకంలో వస్తుంది! 3. షెర్లాక్ హోమ్స్ సుప్రసిద్ధ డిటెక్టివ్ అని వేరే చెప్పక్కర్లేదు. 4. అపాలో సంగీతం, కవిత్వాల దేవుడు; మెర్క్యురీ వాక్ చాతుర్యం, నేర్పరితనం, వ్యాపారం, దొంగతనాల దేవుడు. దేవుళ్ళ వార్తాహరుడు. 5. రచయిత జాన్‌వేన్ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో పొయిట్రీ ప్రొఫెసర్‌గా ఉంటున్నారు. 6. డ్రాకో క్రీ. పూ. 620కి చెందిన ఒక ఏథెన్ శాసకుడు. అతను తయారుచేసిన చట్టాలు తీవ్రంగా ఉండేవిట... 7. డ్రాగన్ అనే 'భయంకరమృగా''నికి తెలుగు ఏమిటి?]

# నువ్వోసారి నవ్వు

శ్రీ టి. రాఘవేంద్రరావు

నువ్వోసారి నవ్వు
కొత్త పువ్వు
నెత్తావులు
విరజిమ్ముతోంది
పాత చంద్రుడు
కొత్త వెన్నెలలు
కురిపిస్తున్నాడు

అటు చూడు
నీలి గగనం కింద
విద్యుద్దీప కాంతిలో
పచ్చని ఆకులమధ్య
ఎర్ర గన్నేరు పూలు
పచ్చని జీవితంలో
ఎర్రని జ్ఞాపకాలు.

మరి నవ్వవా నువ్వు
మరచి పోయావా నవ్వు
మేలిమి బంగారంగా
మాలిమి శృంగారంగా
గడిపిన పాత జీవితం
మళ్ళీ మళ్ళీ స్వాగతార్హం.

అందుకే నవ్వాలి
ఆనందంగా నవ్వాలి
కొత్త నీరు వచ్చినట్లు
మెత్తని ఇసుక మెరిసినట్లు
నువ్వోసారి నవ్వు

# పంచపాత్ర

## కే ఎ స్వీ

### 4

### (గత సంచిక తరువాయి)

ఎదురు చూడని మలుపేంకాకపోయినా-మలుపు మలుపే!

ఆలోచిస్తున్నాను నేను.

కైక కథలో కొత్తదనం ఏమీలేదు. కథలో లేకపోతేనేం?—కథనంలో కొత్తదనం తీసుకురావొచ్చుగా!? ఏమో! ఆ నమ్మకం కూడా లేదు. కైక కథని కైక చెప్పినదానికంటే మెరుగ్గా నేను చెప్పలేను.

అదీగాక - ఇంకో ముఖ్యమైన విషయముంది—

"ఏవిటాలోచిస్తున్నారు? నాకథ నవలగా రాసెయ్యండి — మీకు మంచి పేరొస్తుంది, స్త్రీ పాఠకులు మిమ్మల్ని మెచ్చుకుంటారు" అంది కైక.

సరిగ్గా అదే పాయింటు నేను ఆలోచిస్తున్నదికూడా.

"వూహుం-" అన్నాను. "లేదు, కథ మీరు చెప్పినట్టు గనక రాస్తే-స్త్రీపాఠకులకి నేను చెడ్డయిపోతాను. కట్నం ఏగెయ్యడానికి కైక తండ్రి ప్రయోగించిన లౌక్యవజ్ఞ ఈ ప్రేమకథ (?) లో చాలా ఎబ్బెట్టుగా కనిపిస్తుంది. కైకనుగురించి నా అనుమానాలు నాకున్నాయి. గోపీసుందరాన్నిగానీ, యస్. గోపాలాన్నిగానీ ఆమె ప్రేమించనట్టు కనిపించదు. కనీసం అలా నటించనుకూడా నటించదు! తండ్రి పథకానికి సరిపడేంతగా ఆమె నటించగలిగిందేమో గాని, ఆ నటనలో కొంచెం సిన్సియారిటీని, రంగరించివుంటే—ఆమె గోపీ సుందరాన్నో, యస్. గోపాలాన్నో తప్పకుండా దక్కించుకునే వుండేది-"

మూతి ముడుచుకుంది కైక-"తప్పంతా కైకదేనంటారా?"—

"అనను. అసలు తప్పు ఎవ్వరిదీకాదేమో! అందరూ స్వార్థం చూసుకున్నవాళ్ళే! స్వంతలాభం కొంత మానమన్నారు, అంతా మానమనలేదు. కైక ఎవ్వర్నీ నిందించకూడదు. కైకనూ ఎవ్వరూ నిందించకూడదు. ఈ కథలో విలన్ ఎవరంటే-సమాజం. సమాజం అల్లిన ఆర్థిక విషవలయం—"

కళ్ళలో వింత వెలుగుతో నవ్వింది కైక- "అవును, కైక కథలో విలన్ సాంఘిక దురన్యాయమే! వరకట్నం అనే పెనుభూతం నీడ కైక జీవితంమీదపడింది. కైకతండ్రి కట్నం ఇవ్వలేదు. గోపీసుందరం—వొచ్చే చక్కటి కట్నాన్ని పోగొట్టుకుని కైకను చేసుకోలేదు. కట్నం లేకుండా మంచి మొగుణ్ణి కొట్టేసిన చెల్లెళ్ళినిచూసి కైక జెలసీ దంష్ట్రల్లో చిక్కుకోకుండావుండదు. ఇట్లాంటి కైకల్ని యస్. గోపాలాలు గమనిస్తూవుంటారు. కైకల గతాల్ని వెదికి వెలికి తీస్తూ వుంటారు. ఏమాత్రం వీలున్నా—ఖతం! ప్లాను వేస్తారు. పరోపకారి పాపన్నలు దొంగ వుత్తరాలు రాస్తారు. తెలివుందనుకున్న కైకలు తెలివిగానే ఖెడ్డాల్లో పడతారు. కొన్నిపూలు కేవలం వాసన చూడ్డానికే అనుకుంటారు యస్. గోపాలాలు. కట్నం ఇస్తేమాత్రం ఆ పూలనే హృదయ మందిరంలో అమర్చుకుంటారు. కట్నం ఇవ్వలేమంటే మాత్రం—"సారీ, ఏమనుకోకు—" అని పెంటపోగు మీదికి విసిరి పారేస్తారు—"

ఆవేశంతో చెప్పుకుపోతోంది కైక.

కుర్చీలోంచి ఎప్పుడు లేచిందో లేచింది. నాటకీయంగా వొక వారమంచి వొకవారకి గదిలో మువ్‌మెంట్స్ తీసుకుంటోంది.

గమ్మున వింటున్నాను—

—"ఎంతోమంది వున్నారిలాంటి కైకలు. అందం వుందనుకుని—కేవలం అందంతోనే మంచి మొగుళ్ళని—అందమైన మొగుళ్ళని కొట్టెయ్యొచ్చుననుకునే అమాయకురాళ్ళు. రోజూ అద్దంలోకి చూసుకోవడం వీళ్ళ కిష్టమేగాని—నిష్కల్మషంగా తమ హృదయాల్లోకి చూసుకోవడం వీళ్ళకి సుతారామూ నయించదు. వీళ్ళంతకి వీళ్ళు తెలుసుకోరు, వీళ్ళ కెవరూ చెప్పలేరు. చెప్పగలిగింది మీలాటి రచయితలే! మీరూ వీళ్ళ గురించి రాయకపోతే ఎలా?—" అంది కైక ఉద్రేకంగా.

"అవును. మీరు చెప్పింది నిజమే! కాని, ఏంచెయ్యడం? అలారాస్తే మా రచనలు అచ్చవ్వు—" అన్నాను బెరుగ్గా.

"ఏం? ఎందుకు అచ్చవ్వు? వొక రాధాగోపీల ప్రణయం గురించి పదహారున్నర పేజీల నాన్సెన్సు రాయండి, అచ్చవుతుంది.

ఇంకో మధుబాల విషాద ప్రేమ గురించి మూడు వారాలకి సరిపడేంత చెత్త పదహారు పేలికల్లో, ఆరో, ఏడో యాక్సిడెంట్లతో చివర్లో పశ్చాత్తాపం జోడించి రాయండి, అచ్చవుతుంది. ఒక నవలంతా ప్రేమలేఖలే రాసినా అచ్చవుతాయి. సంవత్సరం పైగా నడిచే సీరియల్స్లో మూడువందలా అరవై ముద్దులూ అంతకు కొన్ని ఎక్కువే ద్వంద్వార్థాల డైలాగులూ వుంటాయి, అదీ అచ్చవుతుంది. రాసినంత బూతూ రాసి చివరన కొంచెం ఫిలాసఫీ వెలిగించేస్తే చాలు, తెలుగు నవలల్లో మీరు తీసుకొచ్చిన విప్లవం గురించీ, మీ శైలీరమ్యత గురించీ పాఠకులూ, విమర్శకులూ, మూడోతరగతి రచయిత (త్రు)లూ కూడా కలబడి ఎగబడి మిమ్మల్ని పొగిడేస్తారు. ఆ చెత్తరాతలూ ఆ చెత్త మీద ఈ చెత్తరాతలూ-అన్నీ అచ్చవుతాయి! అంతేగాని, మధ్య తరగతి ఆడపిల్ల కట్నంకోసం ప్రేమనటించిందన్నా, ప్రేమ నటించలేక జీవితంలో దగా పడిందన్నా-వూహూఁ-ఈ నిజాలు రాయకూడదా? రాస్తే స్త్రీ లే సింపతీ చూపించరా? అందువల్ల వీటిని అచ్చువెయ్యరా? మరయితే స్త్రీలు తమంతట తాము తెలుసుకోక-మీలాంటివాళ్ళు చెప్పక-ఇంకెలాసార్? ఆడా మగా మధ్య ఆర్థిక కారణాలవల్ల ఈ దోపిడీ ఇలా నిరంతరం జరగాల్సిందేనా? చెప్పండి జవాబు-అలా కిమ్మనకుండా కూచుంటారేం?—"

మాట్లాడి మాట్లాడి రొప్పుతూ నిల్చుంది కైక.

ఏం మాట్లాడాలి? ఏమని జవాబు చెప్పాలి?

ఆలోచిస్తూనే వున్నాను.

నా భంగిమ చూసి ఏమనుకుందో ఏమో-మెత్తబడి దగ్గిరకొచ్చింది కైక. "ఆవేశంగా మాట్లాడుంటే-అయామ్ రియల్లీ వెరీ సారీ—"

గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

కైక వృదేకంలా ఎండ పగలబడి కాస్తోంది.

"నే వెళ్తాను—" అంది కైక.

ఎక్కడికని నే అడగలేదు.

"నామీద నవలరాస్తే నేనెంతో సంతోషిస్తాను—"

"ఆలోచిస్తాను—"

"నిజానికి నామీద రాస్తే-ఈ తరం ఆడపిల్లలమీద రాసినట్టు—"

"ప్రయత్నిస్తాను—"

గల్లుమని నవ్వింది కైక. వొచ్చేప్పు డెలా నవ్విందో అలానే

రామాయణంలో కైకదాకా ఎందుకు? కైక కథలోని కైక నా ఎదురుగా వుండంటేనే నమ్మబుద్ధవలేదు. గోపీసుందరంవల్లా యస్. గోపాలంవల్లా మోసపోయిన ఆ కైక-ఈవిడేనా?—

"ప్రయత్నిస్తాను—" అని గొణుక్కుంటూనే వున్నాను.

"ప్రయత్నంలో లోపం వుండకూడదు. ఆపైన సంగతి మీ వంతుకాదు. మరి నే వెళ్తాను. బెస్ లక్!—"

నిష్క్రమించింది కైక.

ఆమె నవ్వు నా గదిలో ఇంకా ప్రతిధ్వనిస్తూనే వుంది. ఆ నవ్వులోని నిగూఢ విషాదం నా మనసుకు గుచ్చుకుంటూనే వుంది.

"ఆడా మగా మధ్య ఆర్థిక కారణాలవల్ల ఈ దోపిడీ ఇలా నిరంతరం జరగాల్సిందేనా? —"

జవాబులేని కైక ప్రశ్న పదే పదే గుర్తుకొస్తోంది......

మధ్యాహ్న భోజనం ముగించేను. వక్కపొడి నములుతూ సిగిరెట్టు తాగుతూ వాలుకుర్చీలో వాలి నా పాత్రల గురించి ఆలోచిస్తున్నాను. అంతలో—

"సంపేత్తాడు బాబో!—నన్ను సంపేత్తాడు—" అని కేక వినిపించింది.

తిరిగి చూసేను.

"నన్నియ్యాల సంపేతాడు-సంపేతాడు-" అని నా గదిలోకి సరాసరి పరుగెత్తుకొచ్చేస్తోందొక స్త్రీ.

"ఎవరమ్మా నువ్వు?—"

"బాబుగారూ! మీరే రచ్చించాల!......"

"అరె ఎందుకలా భయపడుతున్నావు? ఏం జరిగింది? "

"నన్నింక బతకనీడు బాబూ! ఇయ్యాలతే నేనాకరు-నెన్నస్తే బయింలేదు—ఈణ్ణికూడా బతకనీడు దొంగ సచ్చినాడు—" చంకలో వున్న మూడేళ్ళ కుర్రాణ్ణి చూపించింది ఆ స్త్రీ.

"చంపుతాడు చంపుతాడంటావ్!—ఎవరు నిన్ను చంపేది?—"

"ఆడే బాబూ—ఆడే—ఆ దొంగ సచ్చినాడే!..."

ఆమె భర్త (నాటుగా చెప్తే మొగుడు) ఆమెని కొట్టి చంపడానికి సిద్ధమైనట్టూ, ఆమె భయపడుతున్నట్టూ అర్థమైంది.

మేము నీ పాత్రలం అని చెప్పకుంటూ పాత్రలు ప్రవేశిం

చ్చు. ఆ మాట చెప్పకుండా ప్రవేశించే వాళ్ళుకూడా పాత్రలు కావొచ్చు. ''సంపేత్తాడు—అడు సంపేత్తాడు-'' అంటూ ప్రవేశించిన ఈ స్త్రీ నా పాత్ర కావొచ్చా?

ఆవిడ నాపాత్ర కావడమే కాదు, ఆమెను గురించి రాసే రచయితని నేవవుతానా ?

''మరేం భయంలేదు. ఇక్కడికొచ్చి నిన్నెవరూ చంపలేరు — నీ మొగుడైనాసరే-'' అన్నాను అభయమిస్తున్నట్టుగా. ఆలుమగల విషయాలమధ్య జోక్యం కలుగజేసుకోవడం తప్పని నాకు తెలుసు, అయినా-నా కాబోయే పాత్రే కదా అనే మొండిధైర్యంతో ఆమాట అన్నాను -

ఆమాటతో ఆమెకు ఎంతో కొంత ధైర్యం వొచ్చినట్టుంది. ''నువ్విట్టా కూసోరా—'' అంటూ చంకలోని కుర్రాణ్ణి నా మేజామీద కూలేసింది. వాడిమటుకు వాడు ఆనందంగానే నవ్వుతున్నాడు. ''సంపుతాట్ట-సంపుతాడు-ఎట్టా సంపుతాడో సంపనీ-'' అంటోంది ఆమె—కిటికీగుండా వెలుపలికి చూస్తూ. ఇంకా గొణుక్కుంటోంది.

అప్పుడే ఆమెను కొంచెం పరీక్షగా చూసేను.

ముప్ఫై అయిదేళ్ళకి పైనే వుంటాయి. గడకర్రలాంటి శరీరం, రేగిపోయిన పొట్టి పీచుజుత్తు, దుమ్ముకొట్టుకున్న ముఖం, తీర్చి దిద్దినట్టు లేని బండముక్కు, పెదవులు కదిలిస్తే బలహీనమైన పలువరస బైటపడే వికృతపునోరు, గుంటల్లో కళ్ళు, పీక్కుపోయిన దవడలు. ఆ క్షణాన ఆమె అలాగే చచ్చిపోతే ఆశ్చర్యమేం లేదు. అసలు అంత వరకూ ఆమె బ్రతికి వుండడమే ఆశ్చర్యం !

అతి అభ్రభంగావున్న రంగు వెలిసిన పాతచీరలో, ఆమెది కాని రవికెలో—ఆమె ఘోరంగావుంది. ఏదో గొప్ప చిత్రకళా ప్రదర్శనానికి ఎవడో గొప్ప ఆర్టిస్టు అహోరాత్రాలూ శ్రమించి శక్తినంతా వుపయోగించి చిత్రించి పంపిన దారిద్ర్య ప్రతిరూపంలా వుందామె !

మేజామీద నల్లగా తారుముద్దలా కూచున్న ఆమె కొడుకు (కొడుకని తెలుస్తూనేవుంది) ఆమెను ఏమాత్రమూ పోలి లేడు. పెద్దయితే అతను కురుగ్గా వుంటాడని ఎందుకోగాని అనిపిస్తుంది. తల్లి అంత హీనస్థితిలో వుండగా తానుమాత్రం చిద్విలాసంగా నవ్వుతున్నాడు.

''నువ్వుకూడా అటు కూచోమ్మా !—'' అన్నాను.

గోడవారన నేలమీద చతికిలపడింది. ''ఆడైనా సస్తే బావుండిపోను-నా ప్రేణానికి హాయిగా వుంటుంది — సావడే — ఎదవ సచ్చినోడు—నన్ను సంపుతాట్ట-నన్ను—'' ఇంకా గొణుగుతూనేవుంది. తిడుతోంది. పళ్ళు కొరుకుతోంది ! మెటికలు విరుస్తోంది !

గమ్మున కూజాలోంచి నీళ్ళు అందించేను. గటగట మని గ్లాసెడూ తాగేసింది, ఇంకో మూడుసార్లు అందించేను, అన్నీతాగి ''పాలు బాబూ—'' అంది. ''వొరేసిట్టీ-నీల్లు తాగుతావ్రటా-'' అని అడిగింది కుర్రాణ్ణి.

కిలకిలా నవ్వేడు వాడు. వొద్దన్నట్టుగా రెండు చేతులూ వూపేడు. అడ్డంగా తలకూడా తిప్పేడు.

''ఆడికొద్దులే బాబూ !—'' అని చెప్పింది ఆమె నాకు.

సరే—నా పాత్రతో కొంత సంభాషణ జరపడానికి సిద్ధపడ్డాను నేను.

''చూడమ్మా ! నీ పేరేమిటి ?—''

''పేరేదైతేనేం బాబూ—ఈ దరిద్రబ్బతుక్కి—''

''అహఁ—పూరికినే-తెలుసుకుందామని-''

''పొన్నమ్మ—''

''మీరుంటున్నదెక్కడా ?—''

విస్మయంతో ఆమె నీరసపు కళ్ళుకూడా విచ్చుకున్నాయి.

''మీకు తెలవదేటి బాబూ—మనింటికి నాలుగో ఇంటి యెనకల గుడిసెల్లేవూ ? అణ్ణే మేముండేది—''

నేనుండేది మేడమీది గది. గదివిడిచి నేనెప్పుడో తప్ప బైట తిరగను. మా నాలుగో ఇంటి వెనకలెక్కడో గుడిసె లుంటాయని తెలుసుగాని-అందులో ఎక్కడో పొన్నమ్మ అనే నా పాత్ర వుంటుందని నేనూహించలేదు.

''మీ ఆయన—ఏం చేస్తాడు ?—'' అన్నాను.

''ఏటి సెయ్యడవేంటి బాబూ ?'' అంది పొన్నమ్మ.

పొన్నమ్మలాంటి వాళ్ళను ప్రశ్నించడంకూడా రాదు, నేనేం రచయితను ?

''మీ ఆయన—ఏంపని చేస్తాడూ అని ?—''

''ఆడికి యేరే పనేటి బాబూ — పొద్దస్తమానమూ నన్ను తన్నడమే-''

నవ్వు రానీకుండా జాగ్రత్తపడ్డాను. ''అదికాదు-పనంటే ''

''పనంటే ఇంకేటుందిబాబూ — సచ్చినాడికి [illegible] ప్రతిప[illegible] సీరయ్య బడ్డీకాడకెళ్ళి తాగి రావడమే ''

తాగడం-పెళ్ళాన్ని తన్నడం-ఈరెండూ పొన్నమ్మ మొగుడు చేసే పనులన్నమాట! మరి పొట్ట గడవడం?

"అది కాదు పొన్నమ్మా! తాగాలంటే డబ్బులు కావాలిగధా-మరి డబ్బు లెక్కణ్ణుంచొస్తాయి నీ మొగుడికి?-"

"డబ్బులికేం? రిచ్చాలాగతాడుగదా - దొంగసచ్చినోడు-" మెటికలు విరిచింది పొన్నమ్మ-"పెళ్ళాం ముండ వొండిపెడతానంటే పబ్బిడుగాని - రూపాలకి రూపాలు తగలేసి తాగొస్తాడు - తాగొచ్చి వొణ్ణం యెట్టమని-రొయ్యపులుసొయ్యమని-తంతాడు. నస్తేపోను-ఏడాపోను-సచ్చినోడు-నా బిడ్డల్తో నేను ముస్టెత్తుకుంటూ బతికేత్తాను-" ఆవేశంవల్లా దుఃఖంవల్లా పొన్నమ్మ కళ్ళలో గిరున నీళ్ళు తిరిగేయి. చప్పున లేచి మేజా అంచువెంట ప్రాకుతూన్న కొడుకుని అందుకుని, తన పీల్చుకుపోయిన గుండెలకేసి అదుముకుంది. "నా బతుక్కి దేవుడు బిడ్డల్నెందు కియ్యాల? ఈళ్ళు లేకపోతే నేనే బాయిలోనో దూకి సల్లంగా సచ్చిపోదును-"

"ఇంకా వున్నారా పొన్నమ్మా నీకు పిల్లలు?-"

"వుండారు బాబూ-వుండారు-ఇంకా ఇద్దరుండారు గుడిసెలో-ఆళ్ళని తంతూంటాడు మాయసచ్చినోడు-మీ యమ్మని పిల్చుకు రండి-నాకు వొణ్ణమెట్టమనండి-నాకు రొయ్యపులుసొయ్యమనండి-అని బాదేత్తా వుంటాడు-ఎప్పుడు సచ్చిపోతాడో ఆడు-ఆడి సేతులిరిగిపోనూ-ఆడికి పెద్దరోగం రానూ-"

పొన్నమ్మమీద ఏమైనా రాయొచ్చా? అని ఆలోచిస్తున్నానేను.

పొన్నమ్మ-పీడిత వర్గానికి చెందిన మనిషి.

పీడిత జనంమీద రాసిన కథలు తెలుగులో చాలా వున్నాయి. కథలూ వున్నాయి, పెద్దకథలూ వున్నాయి. కాని, అట్టడుగు జీవితాల్ని యథాతథంగా చిత్రించిన నవలల్ని వేళ్ళమీద లెక్కించవచ్చునేమో! పొన్నమ్మ జీవితాన్ని ఆధారంగా చేసుకుని నేనొక నవలరాస్తే దానికి మంచి గుర్తింపువచ్చే అవకాశాలు బాగానే వున్నాయి.

తిట్టిన తిట్టే తిడుతోంది మొగుణ్ణి పొన్నమ్మ. అంతలో చిట్టిగాడు ఆకలేస్తోందని కాబోలు-గునిసేడు. "ఆకలేత్తా వుందారా? ఏం పెట్టమంటావు నన్ను?-ఛస్-యాడవొద్దు-వూరుకో..." అని కొడుకుని గదమాయించి గుడ్లురిమి వాడు ఏడుపుముఖం పెట్టే పెట్టగానే మళ్ళీ గుండెల కదుముకుంది పొన్నమ్మ.

అల్మైరాలోంచి బిస్కెట్లపొట్లం తీసి పొన్నమ్మ చేతికిచ్చేను. ఇంకో గ్లాసుడు నీళ్ళు కూడా ఇచ్చేను. "తినిపించు పొన్నమ్మా! నువ్వు కూడా తిను-ఇంకా భోంచేసినట్టు కూడా లేదు నువ్వు-"

బిస్కెట్ల పొట్లం మొహమాటం లేకుండా అందుకుంది పొన్నమ్మ-"లేదు బాబూ-వణ్ణం యింకా తిన్లేదు. తిండేటి-ఈ పూటసలు వొండనేలేదు-"

"అదేం?-"

"రేత్తిరాడికి సెకండ్ సో ఖేరాలు బాగానే వొచ్చేయి బాబూ! తెల్లారిపోతుండగా గుడిసికొచ్చి తొంగున్నాడు. తెల్లారితే ఆడిదగ్గిర డబ్బులు నిలవ్వని నాకు తెలుసు. అందుకని-రిచ్చాడబ్బులు ఇచ్చెయ్యిరా-అన్నాను. పొద్దున్నే ఇత్తాన్లేయే - సత్తెప్రమానకంగా ఇత్తాను-అన్నాడాడు. నిద్దట్లో వుంటాడిప్పుడెందుకులే-పొద్దుట్నే నిజ్జంగా ఇత్తాడనుకున్నాను. పొద్దుట్నే లేసి సూసేకాడికి ఆడిపక్క కాలీగుంది. అప్పటికే పరారైపోయేడాడు......"

"పరారీయా?-అంటే?......"

"పీరయ్య కొట్టుకాడికి బాబూ...పొద్దుట్నే ముకం కూడా కడుక్కోకుండా-పెళ్ళాముకం కూడా సూడకుండా-సారా కొట్టు

కెళ్ళాడాడు. ఆ యెల్లడం యెల్లడం మద్దివాల కొచ్చి-కూడెళ్ళె నంజా—రొయ్యపులుసొయ్యే నంజా-అని నన్ను కొప్పట్టుకొక్కడ తాడు... ఈడ్చిడ్చి తంతాడు...వొద్దురా బగమంతుడా-ఈ బతు కొద్దు......''

ఏడ్చేందుకూడా శక్తిలేదు పొన్నమ్మకి.

మొగుడిచేత తన్నులు తినడానికి మాత్రం యెక్కణ్ణుంచొ స్తుంది శక్తి ?!

''నీకు అయిన వాళ్ళెవరూ లేరా పొన్నమ్మా?—'' అని అడిగేను.

ముక్కు చీదుకుంది పొన్నమ్మ. ఏదో చెప్పబోయింది. అంతలో ఇంకేదో గుర్తుకొచ్చినట్టు—వొక్కసారిగా గొల్లుమంది. ''నా కెవు రుండారు తండ్రీ!—ఎవురూలేరు—ఎవురూలేరు—వుంటే నేనిట్టా యెందుకుంటాను? నా కెవురూలేరెవురూ లేరు—'' ఏడుస్తూ రాగాలు తీస్తోంది.

బిక్కపోయి చూడడం మినహాయించి నేనేం చెయ్యగలను?

కదిలించడమే తప్పయింది.

కదిలించేసరికి ఆమె కన్నీళ్ళుగా కరిగిపోయింది.

''ఏడవకు పొన్నమ్మా!...అబ్బే!—చూడు—నీ కొడుకు జడును ంటున్నాడు—''

నిజంగానే చిట్టిగాడు కూడా ఏడుపుముఖం పెట్టేడు.

అతిప్రయత్నంమీద ఏడుపుని నిగ్రహించుకుంది పొన్నమ్మ.

''నేను నిన్ను ఇంకేమీ అడగనులే పొన్నమ్మా!...నువ్వు అనవస రంగా బాధపడకు—'' అన్నాను.

అ మాటతో పొన్నమ్మలో నామీద కొంత ఆత్మీయతాభావం కలిగినట్టుంది—''అదేంటిటి బాబూ!...అట్టాగంటారూ?—'' అంది.

ఎందుకొచ్చిందోగాని పొన్నమ్మకు సడెన్‌గా వొక అనుమానం వొచ్చింది—''ఇంతకూ మీరేటిబాబూ—సేసేది—ఆపీసరుద్యోగమా?—''

''కాదు-పొన్నమ్మా!...నేనొక రచయితను—''

''అంటే ఆపీసు కెళ్ళావు గదా బాబూ?—''

రచయితకి ప్రపంచమే ఆఫీసు.

పొన్నమ్మకెలా చెప్పను ?

''రచయిత-అంటే కథలూ, నవలలూ రాస్తాను పొన్నమ్మా—''

''అప్పవత్తాలు రాసినట్టేనా బాబూ!-రాయడమంటే?—'' సరిపోయింది.

పొన్నమ్మ విచిత్రమైన పాత్రే!

రచయితంటేనే తెలీని పాత్ర!

''అప్పవత్తాలు కాదు పొన్నమ్మా!-కథలు—'' (నవల—అనే గొప్పమాట ఆమెముందు ప్రయోగించి లాభంలేదు!) ''కథలు తెలీదూ నీకు?—బజార్లో (వేళ్ళాడదీస్తారే—బొమ్మల పుస్తకాలు—అందులో వుంటాయి—అట్లాంటివి రాస్తాన్నేను—''

''కతలు—యేరే రాయడమెందుకు బాబో?-సెప్తే పోలా?—''

తెలివైన ప్రశ్నలు కూడా (!) వేస్తోంది పొన్నమ్మ. తెలి వైన ప్రశ్నలు అడిగించుకోవడం సుళువే. కాని, వాటికి జవాబులు చెప్పి వొప్పించే తెలివి వుండకపోతే?—

—''వూళ్ళో వొక్కొక్కర్నీ పిల్చి కథ చెప్పడమంటే కష్టం కదూ పొన్నమ్మా—పుస్తకాల్లో కథలు రాసేస్తే—ఎవరికి వాళ్ళే చదువు కుంటారు—''

ఈ వివరణ ఆమెకి నచ్చినట్టు లేదు. కథలు—చెప్పగా వినాలే గాని; రాయకూడదని ఆమె అభిప్రాయమేమో!

''పోనీ! నీమీద కథ రాయమంటావా పొన్నమ్మా!—'' అన్నాను వ్యవహారం వాప్పడం ఇష్టంలేక.

పొన్నమ్మ కళ్ళు విస్మయంతో విచ్చుకున్నాయి.

''నామీదా—కతా?—యేటిబాబూ—పరాసికాలు—నేనేం సీతమ్మో రినా? పూరిమిలమ్మనా? దరొవతినా?—'' అంది.

పొన్నమ్మతో వాదోపవాదాలకి దిగితే నేనెక్కడ తేలుతాను ?

''కథలు (నవలలని లాభంలేదు) ఎవరి మీదైనా రాయొచ్చులే పొన్నమ్మా—సినిమాల్లో ఎప్పుడూ చూళ్ళేదూ నువ్వు ?.....''

''నేను సినిమాలెక్కడ సూస్తాను బాబూ ... ... బిడ్డలకి కూడెట్టడానికే లేదు... ...''

మళ్ళీ ఏడుపు లంకించుకుంటుందేమోనని భయం వేసింది.

''అన్నట్టు—ఈవూరేనా పొన్నమ్మామీది ? లేకపోతే—నువ్వూ నీ మొగుడూ ఇంకెక్కణ్ణుంచన్నా వొచ్చి యిక్కడ జేరేరా ?—'' అన్నాను మాట మారుస్తూ—అలా అయినా పొన్నమ్మ తన కథ చెబు తుందేమోననే భావనతో.

నా అంచనా తప్పకాదు. పొన్నమ్మ తన కథ చెప్పింది. నిజాని కది కథకాదు. సాదా జీవితం. అందులో మలుపుల్లేవు, థ్రిల్ లేవు. వొళ్ళు గగుర్పొడిచే సన్నివేశాల్లేవు.

పల్లెటూరి మనిషే పొన్నమ్మ. తల్లి పురుట్లో పోయింది. తండ్రి రెండో పెళ్ళి చేసుకున్నాడు. ఆమె అమ్మవారుపోసి చచ్చిపోయింది. పొన్నమ్మకి పదమూడేళ్ళొచ్చినప్పుడు ఆమె తండ్రి ముచ్చటగా మూడోసారి పెళ్ళిచేసుకున్నాడు. ఈ లేటెస్టు పింతల్లి పొన్నమ్మను రాచి రంపాన పెట్టి, మొగుణ్ణి కొట్టి మొగసాలకెక్కి వొక మంచిరోజు చూసి ఎవరితోనో లేచిపోయింది. ఎటుపోయిందోగాని అటు తర్వాత ఆమె జాడలేదు. పొన్నమ్మ తండ్రికి పక్షవాతం వచ్చింది. పొలం పనిక్కూడా వెళ్ళలేకపోయేడు. కూలిడబ్బులు తెచ్చుకునే మార్గంలేదు. ఇంట్లో కూతురు జూస్తే పెద్దమనిషై కూచుంది.

ప్రక్క పల్లెలో హుషారైన కుర్రాడొకడుండేవాడు. వాడూ కూలిపని వాడే. అయితేనేం ? రోజన్తమానం రాజులా తిరిగేవాడు. వాడో దినం పొన్నమ్మని మొగిలి పొదల దగ్గిర చూసి మనసుపడ్డాడు. పొన్నమ్మ తండ్రితో మాట్లాడేడు. "పిల్లనిస్తావా – లేపోతే నన్ను వుసేసుకుని పావమంటావా ?–" అని అడిగి, ముసిలాడి చేత "సరే ఇస్తాను" అనిపించుకుని, ఇప్పించుకుని, పెళ్ళాంతో–మామగారితో–ఈ బస్తీలో కొత్తకాపరం పెట్టేడు.

"అప్పుడాడు దేవుళ్ళాంటోడు బాబూ – తాగేవోడు కాదు, నన్ను తన్నేవోడు కాదు. ఆకరికి బీడీ ముక్కకూడా ముటించేవోడు కాదు. నన్ను యెప్పుడూ "పొన్నా–యేయ్ పొన్నా–" అని పిలుత్తూ యెంతో యిదిగా నూసుకునేవోడు–"

అలనాటి తొలి సుఖాలు తలపుకొచ్చి పొన్నమ్మకళ్ళు చెమ్మగిల్లేయి. ఆమె గొంతు బొంగురుపోయింది. ఆమె మళ్ళీ ఇలా చెప్పింది–

"మొదట మొదట అన్నీ యిబ్బందులే బాబూ! కూసిని దినాలు వోటల్లో కప్పులు కడిగేవోడు. కూసిని దినాలు లారీలకాడ మూటలు మోసేవోడు. ఆకరికి అద్దికి రిక్సా తీసుకుని తొక్కడం మొదలెట్టేడాడు. నేనుకూడా ఏదన్నా పని సేసుకుంటానంటే–సెయ్యనిచ్చేవోడు కాదు. రేత్తిరీ పొగులూ రిక్సా లాగిలాగి ఆకరికి రిక్సా కొనేసినాడు. అప్పుడెంతో సుకంగా వుండేవాళ్ళం బాబూ! మా అయ్యకూడా మాతోటే వుండేవాడు... ..."

"అయితే నీ మొగుడికల్లాంటి వివరీతవుబుద్ధులెందుకు పుట్టేయి ? మీకసలు దెబ్బలాట లెలా ప్రారంభమయ్యేయి ?–"

"ఎట్టాగంటే ఏం సెప్పడం బాబూ! పోకిరీ సావాసాలు–పోకిరీసావాసాలు సేసి సెడిపోయినాడు బాబూ ఆడు–మెల్లింగ మెల్లింగ సారాయి తాగడం మొదలెట్టేసినాడు – ఆ మహమ్మారి పాలబడితే మల్లీ లేవడం యెక్కడ ?- అంతేబాబూ–ఆడు పోల్చి వట్టలేనట్టుగా మారిపోయినాడు–రోజా తాగొచ్చేసేవాడు, నన్ను తన్నేవోడు. మా అయ్యొచ్చి అడ్డం పడితే – అయ్యనికూడా తన్నేసేవోడు...వొకసారి మాటామాటాపెరిగి రగడ పెద్దదైపోయి – "కూతురింటికొచ్చి కూసుండి తిండానికి సిగ్గు లేదంటా దొంగనా కొడకా–" అని మా అయ్యని మెడబట్టి గుడిసిలోంచి గెంటి తలుపేసేసినాడు ఆడు. నేనెంత అరిచి మొత్తుకున్నా కూడా యినిపించుకోలేదు. మా అయ్య ఆసలే రోషమ్మనిషి. అవుమానం బరించనే బరించలేడు. అంత రేత్రిరేల – అంత నలిలో – యెట్టా యెక్కడికి యెల్లిపోయినాడో–యెల్లిపోయినాడు–బలే రోసమ్మనిషి- మా అయ్య ... ..."

వెక్కి వెక్కి ఏడుస్తోంది పొన్నమ్మ. తండ్రి గుర్తుకొచ్చేసరికి ఆమె ఆవేశం మరీ అదుపులేకుండా వుబికింది.

"పోస్ట్ !–" అని కేక.

తలుపు తీసేను

వొక బరువైన పార్శిల్ అందించి వెళ్ళిపోయేడు తపాలా బంట్రోతు.

ఏడుపునుంచి కొంత కొంతగా వూరడిల్లుతోంది పొన్నమ్మ. నేనామెను సమాదాయించే ప్రయత్నం చెయ్యలేదు. ఏడవొద్దంటే మరీ ఎక్కువేడుస్తారు ఆడవాళ్ళు!

పార్శిల్ మీద దస్తూరీ కొత్తగావుంది.

ఫ్రం అడ్రెస్ దగ్గర 'చంద్రకాంత్' అని మాత్రం రాసుంది.

ఎవరీ చంద్రకాంత్ ?

ఎంత ప్రయత్నించినా గుర్తు రాలేదు.

నా పరిచయస్థుల్లో చంద్రకాంత్ అని పేరు గలవాళ్ళెవ్వరూ లేరు.

అది నాకొచ్చిన పార్శిలేనా – తపాలా బంట్రోతు పొరబాటు పడలేదు గద-అనుకుంటూ 'టు' అడ్రెస్ పరీక్షగా చూసేను.

"శ్రీ కె. ఆనందరావు

రచయిత"

"రచయిత" అని మరీ అంత రమ్యంగా రాసివుంటే పార్శిల్ నాది కాదనుకోవడం ఎలా ? రచయిత-అని అడ్రెస్‌లో రాసిన ఈ

చం(ద కాంతుడెవరోగాని — నా మెడడుకి పనిపెట్టడానికే కంకణం కట్టుకున్న పాతకుడని—ఎందుకో అనిపించింది.

పార్శిల్లో ఏమున్నట్టింతకీ ?

విప్పి చూడబోతుండగా—అంతలో—

"అయితే మరినే నెల్తాబాబూ — మీకెన్నో పన్నుంటాయి—" అంది పొన్నమ్మ.

పొన్నమ్మమీద నవల రాసే వూహ వన్నింకా వొదల్లేదు.

అంతలో పొన్నమ్మనెలా వొదుల్తాన్నేను ?

పార్శిల్ టేబిల్ మీదపెట్టి — మళ్ళీ పొన్నమ్మకథ వింటానికి సిద్ధమయ్యేను. "ఆఁ—చెప్పు పొన్నమ్మా—ఆ తరువాత మీనాన్న మళ్ళీ ఎప్పుడూ కనిపించలేదా ?—"

ఏడుపు తేటపడిన కళ్ళని కొంగుతో వొత్తుకుని — మిగత కథంతా చెప్పింది పొన్నమ్మ.

కనిపించకేం ? పొన్నమ్మతండ్రి మళ్ళీ కనిపించేడు. కాని, వొకేసారి. అదే ఆఖరుసారి. వొకానొక సాయం(తంపూట ఫాయ్యాదుతూ పొన్నమ్మ వంట (పయత్నంలో వుండగా వాకిట్లోంచి "నా సిట్టితల్లీ పొన్నమ్మా !..." అని పిలుపు వినిపించిందిట. వెయ్యి జన్మలకైనా గుర్తుండే పిలుపు అది. గుమ్మంలోంచి దూసుకునొచ్చి తం(డిని కావలించుకుని వలవలా ఏడ్చేసిందిట పొన్నమ్మ. "యిన్నాళ్ళేడున్నావురో అయ్యా—యేఁవై పోయినావు—" అని రాగాలు తీసింది.

కూతురి (పశ్నలకి జవాబేమీ చెప్పకుండా విశ్శల్లంగా నవ్వేట్ట ముసిలాడు—"ఆకలేస్తాంది — బువ్వొండి పెడతావా — నాసిట్టితల్లీ పొన్నమ్మా—" అన్నాట్ట. సంబరంగా లోపలికెళ్ళి వంటచెయ్యడం సాగించింది పొన్నమ్మ. అక్కణ్ణుంచే ఆమె చెప్పే కబుర్లకి వూఁకొడుతున్నాడు ముసిలాడు. కాని, కొంత సేపటికి పొన్నమ్మ మొగుడు గుడిసెకి తిరిగొచ్చి-పొన్నమ్మ వల్ల వచ్చిందెవరో తెలుసుకుని — ముసిలాడంటే మునుపటి కోపం పోయిందిగనక — "లే—ముసిలోడా—బువ్వ తిని వూసులాడుకుందాం లే—" అని లేవగొడితే — ఎంతకీ లేవలేదట ముసిలాడు. ఇంకెక్కడ లేస్తాడు ? ఎలా లేస్తాడు ? కూతురి మాటలకి వూఁకొడుతూ వూఁకొడుతూ—ఎలా జారుకున్నాడో, ఎప్పుడు జారుకున్నాడో—ఈలోకంనుంచే నిష్క్రమించేడు... ... ...

"యెతుక్కుంటూ యెతుక్కుంటూవొచ్చి నా వాకిట్లోనే సచ్చిపోయినాడు బాబూ—మా అయ్య!...వణ్ణం వొండమన్నాడు గాని—తినే తిన్లేదు... యెల్లిపోయినాడు మా అయ్య ... 'నా సిట్టితల్లీ పొన్నమ్మా !-'అని కడసారికూడా పిల్సి అట్టానే యెల్లిపోయినాడు... యెతుక్కుంటూ నన్ను సూత్తాని కొచ్చినాడేగాని గుడిసిలోకి అడుగే యెట్టలేదు మా అయ్య...బలే రోసం మనిషి మా అయ్య ... ..."

"అయితే—పొన్నమ్మా !—నీ మొగుణ్ణిహ బాగుచేసే మార్గమే లేదా ?—నీ మొగుడు ఆ పాడు తాగుడు మానేస్తే బాగుపడతాడనుకుంటాను-"

కెరటంలా నవ్వింది పొన్నమ్మ, చీకటి కెరటంలా.

"ఆడూ బాగుపడ్డు—ఆడివల్ల నేనూ సుకపణ్ణు ... నావల్ల నా బిడ్డలూ బాగుపడరు...ఈ (బతుకు లిట్టా యెల్లమారాల్సిందే బాబూ ... ..."

"సరీగ్గా నడుచుకోవాలేగాని—మీ (బతుక్కేం పొన్నమ్మా!..."

"మీకు తెలవదుబాబూ!...మా బతుకు లింతే...మా బతుకు లింతే... ..."

గడియారం వరసగా ఆరుగంటలు కొట్టింది.

"గం టెంత బాబూ !..." అంది పొన్నమ్మ.

"ఆరయింది"—

"అయ్య బాబోయ్..." అంటూ లేచింది పొన్నమ్మ—"అయితే నేనెళ్ళిపోతాను బాబూ..."

"ఎక్కడికి ?"

"గుడిసికి—"

"ఎలా వెళ్తావ్ ? - నీ మొగుడు కైపులో..."

గల్లున నవ్వింది పొన్నమ్మ ... అంత స్వచ్ఛంగా ఆమె నవ్వుతుందని నాకు తెలీదు.

—"మరి నీ మొగుడు నిన్ను చంపేస్తాడని కదా—భయపడి ఇక్కడ దాక్కున్నావ్...ఇప్పుడేమీ అనడూ?—నిన్ను తన్నడూ?—"

నవ్వు కొనసాగించింది పొన్నమ్మ.—"తాగినప్పుడు తంతాడుగాని, మిగతాప్పుడు ఆడు దేవుడు బాబూ!...... సంపేత్తానంటాడు గాని నిజ్జంగా సంపుతాడేటి?—యె(రిదాన్నయి పారొచ్చి దాక్కున్నానుగాని మొగుడుసేతిలో సచ్చిపోటం కన్నా ఆడముండ కింకేం కావాల బాబూ... వొరే సిట్టీ—దా-పోదాం దా—బాబుగారికి దండంపెట్టరా—దండంపెట్టు అట్టా మిటకరిచ్చి సూత్తావేం? ... ... బిసకత్తులిత్తే మ్మాతం తింటావా?...యెల్లొత్తాం బాబూ..."

చిట్టితో గుమ్మం దగ్గిర కెళ్ళింది పొన్నమ్మ.

"పొన్నమ్మా నీమీద కథ రాయమంటావా—వొద్దా?"—

అగి తేరిపార జూసింది పొన్నమ్మ.

"నామీద-కతేంటి బాబూ?..."

"నీ బతుకుమీద..."

"మా అందరి బతుకులూ వొకటే బాబూ-ఆటిలో యింతే ముంది? ఆఁ - సరీగ్గా గ్యాపకానికొచ్చింది-సిలీమా అన్నావు గదా బాబూ...ఎప్పుడో ఆరేళ్ళకిముందు-ఆడికొక సాయింత్రం దేవకళా బుద్ధిపుట్టి నన్ను సిలీమాకి అట్టుకెలినాడు బాబూ...ఆ సిలీమా నా కిప్పుడు గ్యాపకానికొస్తా వుంది... పంట్లాలేసుకునే ఫాసన్ ఆడపిల్లలూ, కాలేజి సేలలూ...ఆ సిలీమా అంతా అవ్వే బాబూ... ఆఁ-ఆడా మొగా జట్లు జట్లుగా తోటల దగ్గిరా, యేటొడ్డునా జమాయించి పాడుతూ డ్యాన్సులు చేస్తారు బాబూ...ఇగో -రాస్తే- ఆ మాదిరి కతలు రాయి...అట్టాంటి పంట్లాలేసుకునే ఆడపిల్లల మీద కతలు రాయి...అంతేగాని...మా అనుమంటోల్లమీద కతలు రాస్తే మీకేటొత్తాది బాబూ...మీ మాదిరి గొప్పోల్లు కతలు రాయడానికి యీ రిపొన్నమ్మ - పొన్నమ్మ బతుకు - యేం పనికొస్తాది బాబూ!..."

పొన్నమ్మ ఆపాటి లెక్చెరిస్తుందని కూడా అంతవరకూ తెలీదు నాకు. అవాక్కయి చూస్తున్నాను.

"యేం సిట్టీ-పోదామా? పోదాం! ..వొత్తాం బాబూ!... మజ్జానం కూడా వొండలేదు......ఆకిల్తో కల్లు తిరిగి అట్టే తొంగుంటాడాడు...పొద్దుగూకిపోయింది...యెల్లి ఆడికి తానానికి యేణ్ణీల్లెట్టాల......"

చంకలో చిట్టిగాణ్ణి ఎగేసుకుంటూ గదిలోంచి నిష్క్రమించి మునిమాపు చీకట్లో కలిసిపోయింది పొన్నమ్మ.

వొక్క నిమిషం అలాగే నిలబడ్డాను.

అప్రయత్నంగానే నిట్టూర్చేను.

పొన్నమ్మను గురించిన ఆలోచనలు వొదలడంలేదు.

పొన్నమ్మ నా పాత్ర!

కాని, ఆమె మీద నేనేమైనా రాయగలనో లేదో ఇంకా తెలీదు.

రాయగలిగితే బాగుణ్ణని బలంగా వుంది. కాని, ఎలా? ఎలా? టీ తెప్పించుకుని (!) తాగేను.

మెదడు కొంచెం తేటపడింది.

సిగిరెట్టు వెలిగించి రెండు దమ్ములు పీల్చి టేబిల్ మీదికి "అరె!-" అనుకున్నాను.

పార్శిలు!

పొన్నమ్మతో నేను మాట్లాడుతూండగా వొచ్చిన పార్శిలు!

"అరె! దీని సంగతే మర్చిపోయేన్నేను-" అనుకుంటూ పార్శిల్ని చేతిలోకి తీసుకున్నాను. విప్పేను.

*(ఇంకా వుంది)*

# "సాహిత్యంలో సృజన" - ఒక చర్చ

శ్రీ సర్దేశాయి తిరుమలరావు

ఆగస్టు 1976 భారతి సంచికలో శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం (ఈ వ్యాసంలో తరవాత "ఆర్. ఎస్.") గారి "సాహిత్యంలో సృజన" ఆలోచన రేకెత్తించేదిగా ఉంది. దాన్నిగూర్చి ఆలోచింపగా కలిగిన భావాల్ని పొందుపరుస్తున్నాను.

"రచనా వ్యాసంగం యావత్తూ సాహిత్యం క్రిందే వస్తుంది" అనేది ఆర్. ఎస్. గారి మొదటి వాక్యం. శాస్త్రము సాహిత్యం క్రింద రాదు. భావయిత్రీశక్తి (Imagination) కల రచన మాత్రమే సాహిత్యం అవుతుంది. పోతన సరస్వతిని "భావాంబరవీధి విశ్రుత విహారిణి" అని ప్రార్థించింది ఈ శక్తినిమ్మనే. "కవిత్వం ఒకదాన్నే పూర్వం కళల్లో చేర్చారు. నేడు కవిత్వంతోబాటు కథ నవల, నాటకం సృజనాత్మక సాహిత్యం అని పిలువబడుచున్నవి" అని ఆర్. ఎస్. గారి సగమనం. సాహిత్యాన్ని కవిత్వంఅనీ, కథ నవల నాటకం అనీ రెండుగ విభజించినారు. ఒకజాతి పండును తియ్యనివి అనీ, పొడుగాటివి, వంకరవి, పుచ్చువి అనీ రెండు విభాగాలుచేస్తే ఉన్నంత తార్కికతఉంది సాహిత్య విభజనలో. అన్నీ కవిత్వాలే, సాహిత్యాలే. పంచతంత్రం (కథ), కాదంబరి (నవల), ఉత్తరరామ చరితం (నాటకం) అన్నీ కవిత్వాలని ప్రాచీనులే ఒప్పుకొన్నారు. కేవలం నాటకాలు వ్రాసిన భవభూతినీ, గద్యంలో నవల వ్రాసిన బాణభట్టునీ మహా కవులుగా పేర్కొనవచ్చును. "మొదటి ప్రకరణం లోనే కథానాయకుణ్ణి వర్ణించెయ్యడం కళకాదు" అనేది ఆర్. ఎస్. గారి రెండవ సిద్ధాంతం. ఉదాహరణంగా ఇట్లంటారు: "బాపిరాజు గారి నవలల్లోలాగ నాయకుడు స్ఫురద్రూపి, ఆజాను బాహుడు, అతనికి సంగీతం వచ్చు, కవిత్వం వ్రాస్తాడు, టెన్నిసు పందేలలో ఎప్పుడూ మొదటి బహుమానం గెల్చుకుంటాడు" అని నాయకుణ్ణి వర్ణించడం కళకాదు అని వారివాదం. ఈ విమర్శ బాపిరాజు "నారాయణరావు", "తుఫాను" నవలలపైన. నాయకుణ్ణి మొదటి ప్రకరణంలోనే వర్ణించడం బాపిరాజుగారి రచనాశిల్పం. అది ఒక టెక్నిక్. అది కళకాదని ఆర్. ఎస్. గారనుకొంటే, అది వారి అభిరుచికి నచ్చలేదని అర్థంకాని, బాపిరాజు రచన కళ కాకపోదు. పెద్దన, "మను చరిత్ర" లో ప్రవరాఖ్యుణ్ణి, రామకృష్ణుడు, "పాండురంగ మాహాత్మ్యం" లో పుండరీకుణ్ణి, శ్రీహర్షుడు (తెలుగులో శ్రీనాథుడు). "నైషధీయం"లో నలుణ్ణి, చేమకూర వేంకటకవి "విజయవిలాసం" లో అర్జునుణ్ణి, ప్రారంభంలోనే వర్ణించివేస్తారు. ప్రారంభంలోనే కథానాయకుని గుణగణాల్ని వర్ణించి, వానికి నిదర్శనంగా తర్వాతి ప్రకరణాలువ్రాసే టెక్నిక్కు ఇది అనుకోవచ్చును. ఆర్. ఎస్. గారు చెప్పిన పాత్రపోషణా పద్ధతి "ఉన్మీలన" పద్ధతి అనవచ్చును. ఇతర పద్ధతులూ లేక పోలేదు. "ఉదాహరణ" పద్ధతి "గతి తార్కిక" పద్ధతి, "తారతమ్య" పద్ధతి "స్వగత" పద్ధతి, ఇట్లా ఎన్నో ఉన్నవి. వేటి సొగసు వాటిదికాని అన్నీ కళలే.

సాహిత్యంలో సృజన అంటే ఏమిటో ఆర్. ఎస్. గారు ఇట్లు నిర్వచించినారు: "మాటలకందని సంశ్లి(క్లి?)ష్టమైన అనుభూతిని మాటలద్వారా అందజేసే ప్రయత్నమే – సాహిత్యంలో సృజన". సృజన, సాహిత్యంయొక్క స్వరూపమా స్వభావమా దీని వల్ల స్పష్టంకాదు. ఈ నిర్వచనం సాహిత్యానికే (అంటే కవిత్వమునకు) సరిపోవచ్చును కానీ, ఆ సాహిత్యాని కాపాదింపబడే "సృజన" అనే ధర్మాని కన్వయింపదు. అంటే ఆర్. ఎస్ గారి నిర్వచనాన్ని ఇట్లు పునర్నిర్వచింపవచ్చు. "మాటలకందని సంశ్లిష్టమైన అనుభూతిని మాటలద్వారా అందజేసే ప్రయత్నమే-సాహిత్యం". వాల్మీకి తన అనిర్వచనీయమైన అనుభూతిని "మానిషాద" శ్లోకంగా చెప్పినది కవిత్వమేకాని సాహిత్యంలోని సృజనముకాదు. కవిత్వం అంతా సృజనే (సృజన అనే పదాన్ని ఆర్. యస్.గారి అర్థంలోకాక నిఘంటు పరమైన అర్థంలో వాడుతున్నాను). సృజనకాని కవిత్వం కవిత్వం కాదు కాకిబంగారం బంగారం కానట్లు.

"నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అనే దాశరథి వాక్యం "దాని సృజనాత్మకతవల్లనే అంత ప్రచారం పొందగలిగింది. ఈ వాక్యానికి మామూలు అర్థం ఏమీలేదు" అని అంటారు ఆర్. ఎస్. గారు. మామూలు మాటల అర్థాలను సమన్వయించుకొని చూస్తే ఏమీ బోధపడదు, అని కూడ అన్నారువారు. తెలంగాణా అనగానే ప్రజలనీ, కోటి రత్నాలు అనగానే కోటిమంది రత్నాలవంటి మనుషులు అనీ, వీణ అనగానే వారు స్వేచ్ఛకోసం ఎలుగెత్తిన కంఠశ్రుతి అనీ బోధపరుచుకున్నప్పుడు, ఆ వాక్యంలోని సృజనాత్మకశక్తి మనల్ని తాకుతుంది అని వారు గ్రంథ గ్రంథిని విడమర్చి చెప్పిరి. దాశరథి చెప్పినది సాధారణ భావం. వాడింది "బేమామూలు" మాటలను అంటే మామూలు అర్థాన్ని మామూలుకాని మాటలలో చెప్పడం సృజనాత్మకత అని తేలుతుంది. మామూలు మాటల్లో, మహాను

భూతిని చెప్పే, తెచ్చే ఈ క్రింది సాహిత్యం సంగతేమిటి? అడవికి పోయే రాముని రథాన్ని చూస్తున్న దశరథుని వర్ణన చూడండి:

> ''తనసూను రథమటు తప్పకచూచి
> యదియుఁ గానక ధూళి నటు చూచి చూచి
> యదియుఁ గానక బయలటు చూచి చూచి''
>
> (రంగనాథ రామాయణము)

ప్రచారం రావడమే గొప్ప సాహిత్య లక్షణంకాదు. దాశరథి వాక్యం ప్రచారం పొందడానికి రాజకీయ కారణాలు, తత్కాలీన తెలంగాణా పరిస్థితులు దోహదం చేసినవి. దాశరథి కావ్యం (వాక్యం) నాటి ప్రజల పోరాటానికి ''నినాదం'' వంటిది. కాబట్టే ప్రచారం పొందింది. ఇక అర్థం అంటారా? మామూలు అర్థం లేదంటారు ఆర్. ఎస్. గారు. లేకేమి? స్పష్టంగానే ఉంది. ఉపమా అనీ, అతిశయోక్తి అనీ అలంకారాలు కలవు. వీనిని అక్షర గంధంలేని జానపదులు కూడా వాడుతుంటారు. ఈ అలంకారాలు ''నా తెలంగాణ...'' వాక్యంలో ఉన్నాయి. అలంకారాలతో చెప్పడమే సృజనాత్మకత అంటారా? నాకేమీ అభ్యంతరం లేదుకానీ, ఈ వాదాన్ని ప్రాచీనాలంకారికులు కూడా ఒప్పుకోలేదు. అలంకారం అలంకారం మాత్రమే, కావ్యాత్మ కాదుపో అని కొట్టివేసిరి. మాటల కందనిది ఒక బ్రహ్మపదార్థం మాత్రమే. తక్కినవన్నీ మాటల కందేవే. సృజన అంటే అదేదో వాగతీత ప్రక్రియ అనేవిధంగా నిర్వచించి, తర్వాత దానిని రసానికీ, ధ్వనికీ దిగజార్చిరి ఆర్. ఎస్. గారు. కవిత్వ రహస్యం తెలుసుకొనేందుకు అలంకారికుల వాదాలంత ప్రయోజనకారులు కావు. ప్రతి అలంకారిక సిద్ధాంతాన్ని విశ్లేషించండి. చాలా గమ్మత్తయిన విషయాలు బయలుపడతాయి. రససిద్ధాంతం వంటయింటినుంచి వచ్చింది. అలంకారవాదం దేహాభిమానం వలన వచ్చింది. ధ్వని, వక్రోక్తి, వాదాలు పగటి వేషగాండ్ల, విదూషకుల తత్వాలు. చమత్కార సిద్ధాంతం సర్కస్‌నుండీ మాజిక్‌నుండి దిగుమతైంది. ఔచిత్య విచారం డ్రిల్లుమాస్టరు ప్రవృత్తి కలది. అత్తపోరువంటిది. ఇవా కవిత్వ రహస్యాన్ని తెలిపేవి? ''ప్రతీయమానం పునరన్యదేవ, వస్త్వస్తి వాణీషు మహాకవీషు'' అనే ఆనంద వర్ధనుని ఒప్పుకోలే, ఆయన ధ్వని వాదాన్ని పరాస్తం చేస్తున్నది. కవిత్వంలో అంతుచిక్కని ఈ కిటుకునే Owen Barfield "that precarious element in poetry which has puzzled Critics and poets alike" అని చెబుతాడు.

రచయిత, అలంకారికుడు పాఠకుడు లేక విమర్శకుడు అనే ముగ్గురి కుండవలసిన సంబంధంగూర్చి ఆర్. ఎస్. గారు ''ఆలంకారికులు, పాఠకుడూ లేక విమర్శకుడూ కలిగి ఉండవలసిన దృష్టితోనే సాహిత్యంలో సృజనని తర్కించి, అభివర్ణించారే తప్ప, వాళ్ళు రచయిత దృక్పథంనుంచీ అంటే రచయిత వ్యక్తి వైశిష్ట్యంనుంచీ ఉద్భూతమైన సృజనశక్తి ఎలా అభివ్యక్తమవుతున్నదో విచారించే ప్రయత్నం చెయ్యలేదు'' అని సవ్యంగానే సూత్రీకరించిరి కాని బాపిరాజుగారి నవలా నాయక వర్ణనా భంగిమా విమర్శలో ఆర్. ఎస్.గారు చేయని ప్రయత్నం ఇదేనని నా అభియోగం. ''పాండురంగ మాహాత్మ్యం''లో హాస్యం పెట్టినాడని రామకృష్ణ కవినీ, గిరీశంకు శిక్ష విధించకుండా వదలి వేసినాడని గురజాడనూ విమర్శచేసేవారూ ఇదే ప్రమాదానికి లోనవుతూంటారు.

''కృష్ణపక్షం''ద్వారా కృష్ణశాస్త్రి, ''మహాప్రస్థానం''ద్వారా శ్రీ శ్రీ, ఆయా కవిత్వోద్యమాలకు రథసారథులు అయారంటే, ఆయా కావ్యాలలోని సృజనశక్తే అందుకు కారణం అని ఆర్. ఎస్. గారు ''కృష్ణపక్షం'', ''మహాప్రస్థానం'' మంచి కావ్యాలు ఎందుకంటే అందులో సృజన ఉంది. సృజనఅంటే ఏమిటి? మాటల కందని దాన్ని మాటల్లో చెప్పే ప్రయత్నం చేయడం! ఇది ఒక వలయంగా తయారయింది. ''కృష్ణపక్షం''లో సృజన లేదనీ, అటువంటి కవిత్వమే ప్రాచీన సంస్కృత కావ్యాల్లో ఉందనీ ''నేటికాలపు కవిత్వం''లో శ్రీ అక్కిరాజు ఉమాకాన్తం చెవినిల్లు గట్టుకొని పోరినారు. ''మహాప్రస్థానం''లో వ్యక్తమయింది నిజమైన మార్క్సిజం కాదనీ, శ్రీ శ్రీకి సరియైన అవగాహనలేదనీ, ''సృజన'' అనే సాహిత్య పత్రికలోనే కొన్నేళ్ళ క్రింద వాదోపవాదాలు జరిగాయి. ''కృష్ణపక్షం'', ''మహాప్రస్థానం''లలో ''నవీనత'' అనే గుణం ఉంది అని నా భావం. నవీనత అనేది సృజనవంటి నిగూఢతత్వం కాదు అది కృష్ణశాస్త్రి శ్రీ శ్రీల కావ్యాల్లో మాత్రమే ఉండేది కాదు. ప్రాచీనుల్లో నాచన సోముడు తాను నవీన గుణసనాథుడనని అన్నాడు. ఈ నవీన గుణాలు కల్గిన నాచనసోముని కవిత్వంకంటె అవిలేని ఎర్రాప్రెగ్గడ కవిత్వమే మిన్న అన్న అర్థంలో శ్రీ రాళ్ళపల్లివారు వ్రాసిరి. వీరితో శ్రీమతి యశోదా తిరుమలరెడ్డిగారు ఏకీభవింపలేదు. తిక్కన తాను ''ప్రాతవడ్డ మాటలు'' వాడనన్నాడు. అప్పటకవి క్రొత్తే అయినా, ఆయన వాడిన చాలా మాటలిప్పుడు ప్రాతబడ్డాయి. చేమకూరి వేంకటకవి ''విజయ విలాసా''రంభంలో వ్రాస్తూ అందులో ప్రతి పద్యంలోనూ ఏదో ఒక విశేషం ఉంటుందని మనలను హెచ్చరిస్తాడు. అయినా పాకంలో పడని అతని ''సారంగధర చరిత''తో పోలిస్తే ''విజయ విలాసం'' దిగదుడుపే. గీకుత్రాసద లక్షణాలు కల్గిన ఏకైక తెలుగు కావ్యం ''సారంగధర చరిత''. ఇదీ ''నవీనత'' అనే గుణంయొక్క పల్టీపరంపర. నేటి క్రొత్త రేపటి ప్రాత.

సామాజిక చైతన్యానికీ, సాహిత్యోద్యమానికి సంబంధం కలదంటూ ''సామాజిక చైతన్యంలో మార్పువచ్చినప్పుడు సాహిత్యంలో

అది ప్రతిఫలించేందుకు, ఆ చారిత్రాత్మక తరుణంలో వ్యక్తిగా రచయిత పడుతున్న ఆవేదన, పొందుతున్న అనుభూతి, ఒక సృజనాత్మక రచనగా అభివ్యక్తమైనపుడు సమాజం అతణ్ణి ఒక సాహిత్యోద్యమానికి రథసారథిగా నిలబెడుతుంది" అని ఆర్. ఎస్. గారు ఒక క్లిష్టమైన సిద్ధాంతము చేసినారు. కృష్ణశాస్త్రి "కృష్ణపక్షం"లో అభివ్యక్తమయిన అనుభూతికీ, ఆనాటి సాంఘిక పరిస్థితులకూ ఏలాటి సంబంధం కన్పించదు. శ్రీశ్రీలో స్యరియలిస్టు ఛాయలుపోయి, మార్క్సిస్టు వీచికలు వచ్చేటప్పటికి, అంటే "మహాప్రస్థానం" లోని కీలక రచనలుద్భవించే సమయంలోని సంఘాన్ని, అనగా 1930లు పరిశీలిస్తే అప్పుడు దేశం సుభిక్షంగా ఉండేదని తెలుస్తుంది. అది "అర్థభాస్కరోదయ" కాలం. రూజువెల్టు న్యూడీల్ అనే క్రొత్త ఆర్థిక విధానం భారతదేశంపైకూడా ప్రభావం పరపింది. ఏలాంటి సాంఘికపు టొత్తిడులు లేకనే కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ ఆనాడు అంచక్కనిరచనల్ని చేసిరే. నేడు ప్రపంచమూ, భారతదేశం అట్టుడికినట్లుడుకుచున్నా కృష్ణశాస్త్రి, శ్రీశ్రీలు ఏమీ వ్రాయడంలేదే? నేడు వారి కావేదనలేదా? అనుభూతి రాలేదా? సృజనపోయిందా? ఫలానా సంఘపరిస్థితులుండేకారణం వల్ల నేమహాకావ్యంరాదు. మహాకవిఉండినందువల్లే మహా కావ్యంవస్తుంది. "ఒకసారి ఒక ఉద్యమానికి నాయకత్వం లభించిందని, మరోసారి మరో ఉద్యమానికికూడా నాయకత్వం వహించే ప్రయత్నంచేసే ముసలి పెళ్లికొడుకుల నేమనాలి?" అనే ఆర్. ఎస్. గారి చెణుకు. ఇతఃపూర్వం అభ్యుదయ కవిత్వోద్యమానికి నాయకత్వం వహించినాడని ఈయనచేతనే పొగడ్త నందిన శ్రీశ్రీ పైనకాదనుకొంటాను. శ్రీశ్రీ గత కొన్నేళ్లనుండి "విప్లవకవిత్వం" అనే ఉద్యమంలోఉండే సంగతి అందరికీ తెలిసిందే. సాంఘిక పరిస్థితులు మారినప్పుల్లా, రచయితయొక్క అనుభూతీ మారవచ్చుననే విషయాన్ని ఆర్. ఎస్. గారు ఒప్పుకోరన్నమాట.

ఆర్. ఎస్. గారు తమ వ్యాసం చివరిపేరాలో సృజనకూ (Creativity), మౌలికత (Originality) కూ ముడిపెట్టారు. ఇంతకుముందులేని ఒక వస్తువును ఇప్పుడు చెయ్యడం సృజన. అన్నీ కుండలు ఒకేమాదిరివున్నా అన్నీ సృజనలే. మౌలికత అంటే, ఇంతకు ముందులేని వస్తువును క్రొత్తమాదిరి చెయ్యడం. కుండమూతి పందిమూతివలె తీర్చడం వంటిది. కవితను సృజించే వాడు మౌలికతను సంతరించుకోవలెననే విషయంలో విప్రతిపత్తి పోలేదు. అట్లాని వారి కతకూ వల్లమాలిన ప్రాముఖ్యం ఇయ్యరాదు. కళ అంతా అనుకరణే (Mimesis) అనేది అరిస్టాటిలు సిద్ధాంతాల్లో ఒకటి. నూటికి నూరుపాళ్లు మౌలికత ఎచ్చటూ వుండదు — ప్రకృతిలోగానీ, కళలో గానీ. "ఇంకా కనిపెట్టబడని గ్రంథచౌర్యమే మౌలికత" అని ఒక వికట విమర్శకుడన్న దాన్లో సత్యం లేకపోలేదు. ఉర్దూ కవిశేఖరుడని ప్రసిద్ధి పొందిన గాలిబ్, ఆకాలపు నిర్భాగ్యుడూ అప్రసిద్ధుడూ అయిన ఒక మహాకవిని కాపీకొట్టినాడని ఇటీవల, హంసరాజ్ రహబర్ అనే విమర్శకుని పరిశోధన తెల్పుతున్నది. పురాతన కవీశ్వరులేగని త్రోవలేదని, పద్నాల్గవ-పదహైదవ శతాబ్దపు వాడైన సంకుసాల నరసింహకవి చెప్పాడు. నేటికవి నిన్నటికవి బుజాలపై కూర్చొని వుంటాడు. "లిలిపి నాతనికంటె నితడె ఘనుడు" ఈ అర్థంలోనే బెర్నార్డ్‌షా తాను షేక్సుపియరు కంటె గొప్ప రచయితను అన్నాడు. మరి కవులు వ్రాస్తూనే వుంటారే ఎందుకూ అనే ప్రశ్నవేసికొని సంకుసాల నరసింహకవి, ఆమనిరాగా కోకిల ఎందుకు కూస్తుంది అని ప్రతి ప్రశ్నవేస్తాడు. కూయడం దాని నైజం కాబట్టి కూస్తుంది. వేయేండ్లకింద కోయిలకూడా ఇట్లేకూసివుండునని ఇప్పటి కోయిల కూయక మానుతుందా? నేటి T. B. Aldrich కూడా ఇట్లే అంటాడు.

**No bird has ever uttered a note**
**That was not in some first bird's throat**
**Since Eden's freshness and man's fall**
**No rose has been original.**

దీనివల్ల తేలేదేమంటే "సృజన" అనే మాటల కందని పదార్థం కానీ, "మౌలికత" అనే ఇంకా కనిపెట్టబడని "పాతచింతకాయ పచ్చడిత్వము" గానీ సాహిత్యం (కవిత్వం) యొక్క నిజమైన ధర్మాలు కావూ అని. మరి ఏ గుణంచేత, "పిల్లవాళ్లను ఆటనుండీ, ముసలి వాళ్లను చలికాచుకొనే కుంపటి మూలనుండీ" కవిత్వం ఆకర్షిస్తుందో, అకట్టుకొంటుందో, ("He cometh with a tale which holdeth children from play and old men from the Chimney corner" - Philip Sidney), ఆ కిటుకును కనిపెట్టేందుకు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారి బోలు విమర్శకాగ్రేసరులు ఇంకొంచెం లోతుగా అన్వేషిస్తారని మనవి చేస్తున్నాను.

# విజయనగర స్థాపనకు ప్రేరకులు శ్రీమత్ కాశీ విలాస క్రియాశక్తి దేవులా?

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

కర్నాటక విశ్వ విద్యాలయ ఆధ్వర్యంలో ఏర్పాటుచేయబడిన వ్యాసంగ విస్తరణోపన్యాస పరంపరలో భాగంగ, శ్రీ శాంతరసగారు 'బళ్ళారి జిల్లెయ శివ శరణరు' (బళ్ళారిజిల్లా శివ శరణులు) అన్న విషయముపై ఉపన్యసించారు. వారి ఉపన్యాస పాఠమును, విశ్వవిద్యాలయంవారు తమ ఉపన్యాస గ్రంథమాల సంఖ్య 18గ నవంబర్ 1975లో ప్రచురించినారు. ఆ పాఠములో, 'శ్రీమత్ కాశీవిలాస క్రియాశక్తి దేవరు' (క్రీ. శ. 1336)ను గురించి శ్రీ శాంతరసగారి అభిప్రాయము లిట్లున్నవి:

"శ్రీమత్ కాశీ విలాస క్రియాశక్తిదేవరు" విజయనగర సామ్రాజ్య స్థాపకులైన సంగమవంశరాజుల కులగురువు. రాజగురువు, సామ్రాజ్యస్థాపనకు మూల ప్రేరకులు" హరిహర, బుక్క అతని సోదరులకు తన తపశ్శక్తిచేత, రాజనీతి నైపుణ్యముచేత పలువిధముల సహాయమును అందజేసినాడు. గంగాదేవి తన 'మధురా విజయము'లో అతనిని భక్తితో స్తుతిస్తూ:

"అసాధారణ సార్వజ్ఞం విలసత్పూర్వమంగలమ్
క్రియాశక్తి గురుం వందే త్రిలోచన మివాపరం"

అని నమస్కరించింది

ఇతనిని గురించిన పెక్కు శాసనములున్నవి. సొరబ శాసన (ఎపిగ్రాఫియా కర్నాటిక సం. VIII నం. 375) శికారిపురం తాలూకా హొరోముచ్చళ్ళి అగ్రహారమందలి కన్నడ శాసనము (కన్నడ శాసన గ్రంథ నం 2 శాసన సంఖ్య 281) హరిహర శాసనము (ఎపిగ్రాఫియా కర్నాటిక సం IX నం. 23) చెన్నరాయపట్టణము తాలూకా హారికేరి (ఎపిగ్రాఫియా కర్నాటిక నం 256) శాసనాలలో ఇతనిని మార్గ దర్శకుడని, గురువనీ వర్ణింపబడింది. హొరోముచ్చళ్ళి శాసనములో యితడు మాధవ మంత్రికి, నిజేష్టలింగమును యిచ్చినట్లు చెప్పబడింది.

ఈ రీతిగ క్రియాశక్తి, విజయనగర సామ్రాజ్యస్థాపకులకు కులగురువై, రాజగురువై, సామ్రాజ్య స్థాపనకు ప్రేరకులైనట్లు శాసనములు నిరూపించుచున్నవి. వాస్తవమిట్లుండ విద్యారణ్యులే కులగురువులని, అతడే సామ్రాజ్యస్థాపనకు ప్రేరకులని చెప్పటము, వ్రాయటము చారిత్రక సత్యమునకు దూరముకదా? విద్యారణ్యులు ప్రేరకులుకారు, వారు రాజగురువుకారు అన్న విషయం నిరూపింపబడి చాలకాలమైనది డా॥ పి. బి. దేశాయి మరియు డా॥ సాలెటోర్ మున్నగు చారిత్రకులు ఈ విషయమును ఆధార పూర్వకంగా నిర్ణయించినారు. శాసన, కావ్య, ఇతిహాసములేవీ విద్యారణ్యులు రాజగురువైనట్లు, సామ్రాజ్య స్థాపనకు తోడ్పడినట్లు పేర్కొనలేదు. సామ్రాజ్యస్థాపనాకాలములో అతడచట లేనేలేడు. డా॥ పి. బి. దేశాయ్ గారిట్లన్నారు: "విజయనగర సామ్రాజ్య స్థాపనాకాలమున క్రీ. శ. 1336 తర్వాత రెండు దశాబ్దాల అనంతరం, విద్యారణ్యుల వారికి విజయనగరముతో సంబంధ మేర్పడినట్లు దాఖలాలున్నవి".[1] "పాశుపతి పంథమునకు చెందిన కాశీ విలాస క్రియాశక్తి రాజగురువై యుండెను. మరియు మొదటి బుక్కరాయునికి సలహాదారుడై యుండెను".[2] డా॥ సాలెటోర్‌గారి అభిప్రాయమిట్లున్నది: "రాజధాని నిర్మాణములో విద్యారణ్యుల సహాయపడినట్లున్న కట్టుకథ, కుక్క కుందేలు కథ మున్నగునవి తర్వాతకాలమున కల్పితములని కొట్టివేయ వచ్చును. అతని పాండిత్యము, ప్రఖ్యాతి మున్నగువాటి ప్రభావముల కారణంగా అతనికీకథలను జోడించినట్లు భావింపవచ్చును."[3]

"విజయనగరమునకు విద్యా నగరమని నామకరణమొనర్చిన విషయము నిజముకాదు. దానిని 1531 తర్వాతనే విద్యానగరమని పేర్కొన్నారు."[4] విజయసంకేత కారణముగ విజయనగరమని పిలువబడింది. హరి హరుని కాలమునకు (హుక్కరాయలు) విజయ నగరమనలే లేదు. దీనిని బుక్కరాయలు క్రీ. శ. 1368లో నిర్మింప ప్రారంభించెను. రెండవ హరిహరరాయల కాలములో (క్రీ.శ. 1378)లో పూర్తి అయినది. రెండవ హరిహరరాయల కాలములో, విజయ నగర నిర్మాణము పూర్తి అయ్యే సమయములో విద్యారణ్యులు విజయ

నగరమునకు వచ్చినట్లు తెలియుచున్నది. అదే అతని ప్రథమ సందర్శనము. సామ్రాజ్యస్థాపనాకాలమున అతడక్కడలేడు అతని తోడ్పాటులేదు. "... ... స్థాపకులతో విద్యారణ్యులకు అన్యోన్య సంబంధముండినట్లు యీకథలన్నీ పేర్కొంటున్నవి. కాని శాసనములు, సమకాలీన ఆధారాలు యీ నమ్మకాన్ని త్రోసివేస్తున్నవి. సామ్రాజ్యస్థాపకుల కులగురువు మొదటి క్రియాశక్తియే. విద్యారణ్యులుకారు."[4]

అసాధారణ పండితుడు, మహా ప్రతిభావంతుడు రాజకార్య నిపుణుడు, శాపానుగ్రహ శక్తియుతుడు అయిన క్రియాశక్తి దేవరు విజయనగర సామ్రాజ్య స్థాపకులకు రాజగురువై. రాజులకు, మంత్రులకు, దండనాయకులకు మార్గదర్శియై యుండినట్లు శాసనములు కావ్యములు నిరూపించుచున్నవి.

### అధోజ్ఞాపికలు

* వీరశైవ. సం॥ IV నం. 4 పేజీలు 27-30. డా॥ నందీమఠగారి వ్యాసం.

1 "ఏహిస్టరీ ఆఫ్ కర్నాటక" పుట 326.

2 అదే పుట 344.

3 సోషల్ అండ్ పొలిటికల్ లైఫ్ ఇన్ ద విజయ నగర్ ఎంపైర్ - పుటలు 110, 112, 26.

శ్రీ శాంతరసగారి అభిప్రాయాలపై చారిత్రకులు తమ భావాలను వివరించవలసినదిగ కోరుచున్నాను. 'శ్రీమత్ కాశీ విలాస క్రియాశక్తి దేవరు' ను గురించి వారు వ్రాసిన విషయాలను యధాతథంగా అనువదించినాము.

# పరబ్రహ్మమూర్తి

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

కవితామ్నాయ రహస్యముల్ తెలియగా కాక్షించి నావేని పా
మ్మవని నీవెవనిం దలంపక తదేకాసక్తితో చేరుమా
కవిసమ్రాట్టగు విశ్వనాథు ప్రతిభాగంభీర వారాన్నిధిన్
శివకోటీర ధురీతురీయ వచన శ్రీ సన్నిధిన్ బెన్నిధిన్.

ఎవని యాకృతిమించు హిమశైల శిఖరమై
కవులలో పుడమి మానవులలోన
ఎవని భారతి వెలు నేకైక దీపమై
జగములం దాగామి యుగములందు

ఎవని మన్గడ యొప్పు శ్రవణ పీయూషమై
కథలలో సూరి వాక్ సుధలలోన
ఎవని స్థానము గాలు నవనవోన్మేషమై
ఋషులయందఖిలానిమిషులయందు

అతడు కవియును ఋషియు దేవతయు గాడు
కవులు ఋషులును దేవతల్ కలిసి మెలిసి
మ్రొక్కు సాక్షాత్ పరబ్రహ్మమూర్తి గాక
విశ్వనాథుండు కేవలావిర్భవుండె.

# తిరుగుబాటు

**హిందీ మూలం : శ్రీమతి మెహరున్నీసా పర్వేజ్**

**అనువాదం : ఘట్టమరాజు అశ్వత్థనారాయణ**

తిరుగుబాటు ఎలా చేయాలో ఆమెకు అర్థం కావటం లేదు. సమస్యల పద్మవ్యూహం నుంచి బయటపడ్డం ఎలా? మనస్సును ఆవరించియున్న విషాద మేఘాలను తరిమివేయటం ఎలా? ఆఫీసునుంచి ప్రతిదినమూ వస్తూపోతూ వున్న త్రోవ మార్చివేయాలనీ, ఒకే రోడ్డు పై ఏళ్ళతరబడి రాకపోకలు సాగించి కాళ్ళు నొప్పిపెడుతున్నాయని అనుకొంటుంది. కాని ఎవరితో చెప్పుకొంటుంది. తన కూతురి ముఖం పై దినదినానికి కళాకాంతులు తరిగిపోతున్నా నిమ్మకు నీరెత్తినట్లున్న అమ్మా నాన్నలతో చెప్పుకోవాలా? తన కూతురి వయస్సుగల అమ్మాయిలు ఇద్దరు ముగ్గురు బిడ్డల తల్లులయినా, తన కూతురికి పెళ్ళి చేయకుండా, పిల్లలసంఖ్య పెంపొందిస్తున్న తండ్రితో చెప్పుకోవాలా?

తన బాధను తల్లిదండ్రులతో చెప్పుకోవాలని అనుకొంటుంది. కాని ధైర్యం చాలక వూరకుంటుంది. అయినా ఏ మొహం పెట్టుకొని చెప్పుకొంటుంది? అమ్మా నాన్న తనకు వరుణ్ణి వెదికి వెదికి వేసారి, పెళ్లిమాటే మరిచిపోయినట్లు మిన్నకుండిపోయారు. ఇప్పుడు ఇంటిల్లిపాదినీ తానే పోషిస్తున్నది.

ఆమె ఆఫీసు వరండాలో సైకిలును నిలిపింది. సైకిలుకు తాళంవేసి, తాళం చెవిని పర్సులో వేసుకొంది.

"గుడ్ మార్నింగ్ మిస్ నీనా" లోపలికి వెళ్ళగానే తుమ్మమొద్దులాంటి మిస్టర్ నాయుడు జిరాఫీలాంటి గొంతును ఎగురవేసి 'గ్రీట్' చేశాడు. ఆమె ముఖం మాడ్చుకుంది. మిస్టర్ నాయుడంటే ఆమెకు వొళ్ళుమంట. ఆమె అతన్ని ఎంత దూరంగా వుంచాలని ప్రయత్నిస్తుందో, అతడు ఆమెకు అంత దగ్గరగా రావటానికి ప్రయత్నిస్తాడు. టైప్‌చేసి, చేసి ఆమె వ్రేళ్ళు బిగుసుకు పోయినప్పుడు, మిస్టర్ నాయుడు ఫైళ్లమధ్యనుంచి తలఎత్తి "మిస్ నీనా నాకు కొన్ని పేపర్లు ఇవ్వండి. నేను టైప్ చేసిపెడ్తాను" అని అన్నప్పుడు ఆమె చేతివ్రేళ్లలో విద్యుత్తు ప్రవహించినట్లయి టకటకా టైపు చేసుకుపోతుంది.

ఆమె కుర్చీలో కూర్చుండిపోతుంది. ఆఫీసులో రోజూవుండే హడావిడే. నమస్తే, గుడ్‌మార్నింగ్‌లు చేసి ఆమె చేతులు పడిపోతుంటాయి.

ఆమె ఎదుట మిస్. పాండే కూర్చునే సీటు ఈరోజు ఖాళీగా వుంది. ఆమె కూర్చుని పదిహేను నిముషాలు అయిందో లేదో ప్యూను వచ్చి "అయ్యగారు రమ్మంటున్నా"రని వచ్చి పిల్చాడు. ఆమె బితుకు బితుకు మంటూ ఆఫీసరు రూములోకి వెళ్లింది. గంపెడు ఫైళ్ళతో తిరిగి వచ్చింది. మిస్. పాండే లీవులో వెళ్లినందున ఆమె పనంతా ఈమే చేయాల్సి వచ్చింది.

మిస్. పాండేకు పెళ్ళా? నల్లగా, పొట్టిగా, తనకంటే చిన్నది. అదిసరే, ఆమెను 'పెళ్లిచేసుకోబోతున్న మహానుభావుడెవరబ్బా? ఎవరో ఆమె చెంప చెళ్ళుమనిపించినట్లయింది. ఆమె ఫైళ్ళన్నీ టేబిల్ పై కుక్కి, నిశ్శబ్దంగా మిస్. పాండే ఖాళీ సీటును ఉరిమి చూసింది. అందరికీ పెళ్లిళ్ల అవుతున్నాయి. మిస్ పాండే కంటే ముందు మిస్ రాయ్, ఆమెకంటే ముందు మిస్ కపూర్......ఇలా పెళ్లి చేసుకొని ఎంతమంది ఎదుటిసీటు వదిలి పోయారని? కాని ఆమె మాత్రం ఎన్నో ఏళ్లనుంచీ అదే సీటులోనే కదలకుండా వుండిపోయింది గుదిబండలా.

"మిస్ పాండే పెళ్లిచేసుకుంటున్న విషయం మీకు తెలుసా?" గారపళ్ళు బయటికిపెట్టి నాయుడు అడిగాడు.

ఆమె చాలాసేపు టైపు చెయ్యక ఊరకే కూర్చుండిపోయింది. ఏమైనాసరే, తను ఉద్యోగం మానేస్తుంది. ఆఖరికి అమ్మా నాన్న నన్ను మనిషిగా భావించారా లేక మానోమ్మాకో అనుకొన్నారా? తనకుఏం తక్కువైందని? తనకంటే అధ్వాన్నంగావున్నఎంతమందిఅమ్మాయిలకు పెళ్లిళ్ళు జరగటంలేదు? వారందరికంటే బాగున్నా తను అలాగే వుండిపోయింది. ఒక్కలోపం ఏమిటంటే తన ఆర్థిక పరిస్థితి బాగా లేదు. కాని ఇది తన తప్పా? లేక కనిపెంచిన తల్లిదండ్రుల తప్పా? వారినుంచే కదా తనకు పెళ్లి కాకుండాపోయింది? అయినా అమ్మా నాన్నలకు గంపెడంతమంది పిల్లలు ఎందుకు? తాను ప్రతినెలా ఒకటవ తేదీ జీతమంతా అమ్మా నాన్నల చేతుల్లో పోస్తుందికదా? అందుకు ప్రతిఫలమా ఇది?

ఉమ పుట్టినప్పుడు ఆమెకు రవంతకూడా ఆనందం కలగ లేదు. పైగా దుఃఖం కలిగింది. మిడ్‌వైఫ్ వచ్చి తనకు కాన్పు చేసి పోవాల్సింది. కాన్పూ గట్రా అంతా అమ్మ చూసుకోవాల్సింది. కాని జరిగిందేమిటి?

ఆమె కళ్లల్లో నీరు తిరిగింది. ఆమె ఆరోజు అన్నం తిన కుండానే ఆఫీసుకు వచ్చేసింది. ఆ ద్వేషం వల్లనే ఏమో, ఒక్క రోజైనా ఆమె ఉమను ఎత్తుకోలేదు. ఆఫీసునుంచి ఇంటికి రాగానే వరండాలో నాన్నగారు ఉమను ఎత్తుకొని తిప్పుతూకాని, ఆడిస్తూ కాని కనపడితేచాలు ఆమెకు వొళ్ళు కంపరమెత్తేది. నాన్నగారికి సిగ్గూ లజ్జా వుంటే కదా?

అమ్మకు మళ్ళా వేవిళ్ళు ప్రారంభమయినట్లున్నాయి. ఆరోజు ప్రిస్క్రిప్షను చేతిలో పెట్టి, ఈ మాత్రలు ఆస్పత్రిలో లేవట షాపులో కొనుక్కుని రమ్మనింది అమ్మ.

ఆమె ఉలిక్కిపడి అమ్మవైపు చూసింది. "అమ్మా, నీకేం జబ్బు?" అని కంగారుగా అడిగింది. అమ్మ తలవంచుకుంది. అనుకోకుండానే ఆమె చూపు అమ్మ కడుపువైపు మళ్లింది. ఆమె చీటీ తీసుకుంది. మందులషాపు ఆఫీసునుంచి ఇంటికి వచ్చేదారిలోనే వున్నా, ఆమె మందులు కొనలేదు. చీటీ బ్యాగ్‌లోనే వుండిపోయింది. ప్రతిరోజూ సాయంకాలం అమ్మ మందులు తెచ్చావా అని అడిగేది. "స్టాకు లేదట. త్వరలో వస్తుందట" అని తాను బదులు చెప్పేది.

అమ్మకు కాన్పు కాకుండా విరుగుడుమందు ఇప్పిస్తామా లేదా పిల్లలు కాకుండా ఆపరేషను చేయిద్దామా? ఎన్నో ఆలోచనలు ఆమె తలలో పుట్టాయి. కాని ఆమె ఆచరణలో పెట్టలేకపోయింది. అమ్మానాన్న ఏమనుకొంటారో అని వూరకుండిపోయింది. మందుల చీటీ పర్సులోనే వుండిపోయింది. మందులు తినకుండానే అమ్మ పండంటి బాబును కనింది.

ఈరోజు ఆమె కొద్దిసేపుకూడా పనిచేయలేకపోయింది. మాను తున్న గాయాన్ని రేపింది మిస్. పాండే పెళ్లిచేసుకుంటున్నకబురు. కష్టాలకు కాపురం అయిన తన జీవితాన్ని తల్చుకుంటూ, బాధపడుతూ కూర్చుండిపోయింది. తోటి క్లర్కులు ఈమె దేన్నిగురించి ఆలోచిస్తున్నదో వూహించుకొని తమలో తాము నవ్వుకొంటూ మాట్లాడు కొంటున్నారు. అందరి అవహేళనాపూర్వకమయిన చూపులకు తట్టుకొనలేక తలనొప్పి నెపంతో లీవ్‌పెట్టి ఇంటికి వచ్చింది. సైకిల్‌పై

ఇంటికి వచ్చేటప్పుడు బ్యాగులోని రాజీనామాచీటీ తన్ను వెక్కిరిస్తున్నట్లనిపించింది.

సైకిల్‌ను గోడకు ఆనించి ఇంట్లోకి వచ్చింది. అమ్మ మధ్య రూములో కుట్టుమిషనుముందు కూర్చొని ఇంటిబట్టలు కుట్టుతూ కనపడింది. చంటివాడు ఆమె వీపుమీద గునుస్తూ కనపడ్డాడు.

"ఈరోజు రెండుగంటలకే వచ్చేశావేం ?" అమ్మ అడిగింది. ఆమె బదులు మాట్లాడక తలుపుదగ్గర జోళ్ళు వదిలి మంచంమీద కుప్పగా కూలబడింది. అమ్మ ఆశ్చర్యంగా ఆమెవైపే చూస్తూ వుండిపోయింది. చెల్లెండ్రిద్దరూ మధ్యాహ్నపు భోజనానికని ఇంటికివచ్చారు. వంటింటి వాకిలి దగ్గర నేలపై కూర్చొని చల్లారిన అన్నం తింటున్నారు. పెరట్లో గంపెడు పాత్రలు పడివున్నాయి. అంట్లపై ఈగలు ముసిరి వున్నాయి. పనిమనిషి రాలేదు కామోసు ! అమ్మకు ఆసరాగా వుంటుందని ఏడురూపాయల నెలజీతంమీద పని మనిషిని పెట్టింది తానే. అందువల్ల లంచ్ టైములో తాను టిఫిను మానేసి, టీ నీళ్ళతోనే కడుపు నింపుకోవాల్సి వచ్చింది. పెరట్లోని పాదుల్లో పూల మొక్కలు, ఆకుకూరలు, కూరగాయలు మత్తుగా జోగుతున్నాయి. మొక్కలపట్ల శ్రద్ధ కనపరచేది ఒక్క ఉమానే. తనకీవిషయాల్లో శ్రద్ధా—ఆసక్తులు లేవు. ఒకప్పుడు వుండేవేమో. కాని ఇప్పుడు తెల్ల కాగితంలా నిర్వికారంగా,నిర్లిప్తంగా వుంటున్నది. పెరట్లో ఒకమూల కొత్తగా కట్టిన పొయ్యిమీద పిచ్చుకలు ఎగురుతున్నాయి. ఎదురుగా వున్న అల్మారాలో నాన్నగారు వాడిన మందుసీసాలు గడిచిపోయిన ఏళ్ళను జ్ఞప్తికి తెస్తున్నాయి.

ఆమె ఎవ్వరినైనా ప్రేమించి వుండకూడదా? ఎంతోమంది యువతులు ప్రేమించి, ప్రియులతో పారిపోతుంటారు గదా! అలా ఆమె కూడా ఎందుకు లేచిపోకూడదు? కాని మంచిరోజులు వస్తాయనే ఆశతో బంగారు భవిష్యత్తుకోసం ఎదురు చూస్తున్నది. మంత్ర ఘోషలతో, అందమైన యువకునితో అగ్నిసాక్షిగా పెళ్ళి కాగలదని కలలు కంటున్నది. మనుష్యుడు ఎంత అమాయకుడు! లేకపోతే ఇలాంటి పిచ్చి పిచ్చి కోరికల పందిరి నీడలో జీవిస్తావని కలలు కంటాడా?

"అమ్మాయ్! రేషను గోధుమలు కూడా నిండుకున్నాయి." చిన్నతమ్మునికి నిక్కరు తొడిగిస్తూ అమ్మ అంది.

ఈ రోజుల్లో రేషను షాపునుంచి గోధుమలు తేవాలంటే మాటలా? రాయదుర్గం చేంతాడులాంటి 'క్యూ' వుంటుంది. ఒకసారి 'క్యూ'లో నిలబడి నిలబడి నాన్నగారు తెలివితప్పి పడిపోయారు. అప్పటినుంచి రెండో తమ్ముని వెంటతీసుకొని ఆమే షాపు కెళ్తుంది. జరిగిపోయిన రోజుల్ని తల్చుకుంటే ఆశ్చర్యం కల్గుతుంది. ఒకప్పుడు ఆమెకూడా అందరిలాగే నవ్వుతూ పేలుతూ కాలం గడిపేది. కాని నేడు గంపెడు సంసారాన్ని ఆదిశేషుడిలా తలపై మోస్తున్నది. ఎంత మంచి రోజులవి!! పాతరోజులు తిరిగివస్తే ఎంత బాగుండును!!

ఈ రోజుల్లో చిన్న పట్టణాల్లో కూడా పెద్ద ఇళ్ళు దొరకటం కష్టమయిపోయింది. మూడుగదుల చిన్న ఇంటిలో ఎంతో కష్టంతో ఆమె తనకని ఒక రూమును ఏర్పాటు చేసికొంది. లేకపోతే మిగతా రెండు రూముల్లో ఊపిరాడక, పిల్లలుచేసే గలీజు, రొష్టుకు తట్టుకోలేక నరకయాతన పడేది. తనకని ప్రత్యేకమైన గది వున్నా, అది పేరుకు మాత్రమే. ఆ గదినిండా ఇంటిసామానులు నింపేశారు. తరతరాలుగా బాడుగ ఇళ్ళలో బ్రతికే వారిని చూస్తుంటే ధనికులు లంకాపట్నంలాంటి ఇళ్ళను ఎలా కట్టిస్తారో బోధపడటంలేదు. సొంత ఇల్లు కట్టుకొనడమంటే మాటలా?

ఆమె తన ఉక్రోషమంతా పిల్లలపై చూపిస్తుంది. ఆ రోజు తన చలువ చీరతో ఉమా ఎంగిలిచెయ్యి తుడుచుకొంది. అది చూసి తాను ఉమాను చచ్చేలా బాదింది.

నాన్నగారి పింఛను 50 రూపాయలు. తన జీతం 150 రూపాయలు. మొత్తం 200 రూపాయలతో ఈ సంసారం ఎలా ఈదుక వస్తుందో ఆ భగవంతునికే ఎరుక! ఆమె ఎప్పుడైనా రుసరుసలాడుతుంటే నాన్నగారు ఎక్కడైనా ట్యూషను కుదుర్చుకుంటారు. జీవితమనే పాఠశాలలో ఎంతో వెనుకబడిన నాన్నగారు ఇతరులకు పాఠాలు చెప్పి వారిని ముందుకు తేగలరా? ఇంటిఖర్చులు ఎంతో తగ్గించుకున్నా ధరలు ఆకాశాన్ని అంటుతుంటే ఏమి చెయ్యాలో పాలుపోవటంలేదు.

సాయంకాలంపూట షికారుకు పొయ్యేవారిని, షాపింగు చేసే వారిని తాను అట్టే చూస్తూ వుండిపోతుంది. ధరలు మండిపోతున్న ఈ రోజుల్లో వాకింగు పోవటానికి, షాపింగు చెయ్యటానికి వీరికి డబ్బెక్కడినుంచి వస్తుందబ్బా? తనకుగాను రోజూ పావులీటరు పాలు తీసుకుందామని ఆరు నెలలనుంచి ఆలోచిస్తున్నది. ఇటీవల ఆఫీసువేళలో అప్పుడప్పుడు నీరసంతో కళ్ళు తిరుగుతుంటాయి. స్పృహ తప్పుతుందేమోననే భయం కలుగుతుంటుంది. కాని పిల్లలు తనవైపు ఆశతో చూస్తూవుంటే చెట్టంతతాను పాలుత్రాగగలదా ? తనకంటే పిల్లలకు పాలు ముఖ్యంకాదా?

"అమ్మా టీ చేయ్యటానికి పాలున్నాయా ?"

"ఎందుకు?"

"తల నొప్పిగా వుంది. కాస టీ నీళ్ల పెట్టేద్దూ."

"పాలు లేవమ్మాయ్. గుక్కెడు పాలతో ఇంతమందికి పొద్దున టీ వెయ్యాలంటేనా కష్టంగా వుంది."

తల్లి మాటలు విని తలనొప్పి ఇంకా ఎక్కువైంది. ఒక కప్పు టీ నీళ్లకు కూడా తాను నోచుకోలేదా? ఎందుకీ కుక్కబతుకు? అందరూ కలిసి ఏ నుయ్యో గొయ్యో చూసుకొంటే బాగుంటుంది. దేవుడు ధనికులుగానూ పుట్టించక, పేదవాళ్లగానూ పుట్టించక మధ్యతరగతి వాళ్లగా ఎందుకు పుట్టించాడో? త్రిశంకు స్వర్గంలాంటి జీవితం!

అమ్మా నాన్న మొదట్లో రోజూ రాత్రిపూట తన పెళ్లిమాట మాట్లాడేవారు. ఈమధ్య ఆ వూసే ఎత్తడంలేదు. తాను జీవిత మంతా వీళ్ళకు వెట్టిచాకిరీ చెయ్యాల్సిందేనా?

నాన్నగారు వచ్చి, వరండాలో కుర్చీలో కూర్చొని సేద తీర్చు కుంటున్నారులా వుంది. బాబు నాన్న కాళ్లదగ్గిర ఆడుకుంటున్నాడు. ఆమెకు తండ్రి తండ్రిలా కాక శత్రువులాగా కనపడ్డాడు. లేకపోతే ఈడొచ్చిన కూతురు గుండెలమీద కుంపటిలాగా కూర్చుని వుండగా, నిమ్మకు నీరెత్తినట్లు కూర్చుంటాడా? వీళ్లకోసం తన జీవితం నాశనం చేసికోవాలా? వీళ్లేమనుకుంటున్నారో? ఈరోజు వీళ్లకు తన రాజీనామా కాగితం చూపించి, రేపు ఆఫీసరు కిచ్చేయాలి. అప్పుడు తెలిసివస్తుంది వీరికి! నాయుడు చూడటానికి నల్లగావున్నా మంచి వాడు. ఒకవేళ అతన్నే పెళ్లాడి అతనితోపాటు అమ్మానాన్నలవద్దకు వచ్చి ఆశీర్వదించండని అడిగితే? అప్పుడు వాళ్లకు చెంపమీద కొట్టి నట్లవుతుంది.

"యవ్వనం దాటిపోతుంటే, ఇక ఈ అమ్మాయికి పెళ్లి అయినట్లే! కూతురు వయస్సు ముదిరి ముసలిదవుతుంటే, తాము యవ్వనవంతులుగా తయారవుతున్నట్లుంది వీళ్లవాలకం చూస్తుంటే. బుద్ధి లేకపోతేసరి! ఈడొచ్చిన అమ్మాయిని ఇంట్లో పెట్టుకొని ఇంకా పిల్లల్ని కంటున్నారు! ఇలా ఇరుగుపొరుగువాళ్లు అంటుంటే వింటు న్నప్పుడు తన గుండెలపై సమ్మెటతో బాదినట్లవుతుంది.

ఆరోజు ఉమను పిల్చుకొని తాను బజారు కెళ్లింది. అక్కడ పాత స్నేహితురాలు కనపడింది. మాట్లాడుతూ, ఉన్నట్లుండి ఉమనుచూసి లాలనగా "నీకూతురు చాలా అందంగా ఉందేవ్" అంది. దానికి ఏం సమాధానం చెప్పాలో తనకు తోచకపోయింది. ఆరోజంతా బాధపడింది.

"అక్కా! చూడు. నా ఫ్రాకు ఎలా చిరిగిపోయిందో!" చెల్లెలు ఆమెతో చెప్పింది. అప్పుడామె కోపంతో గద్దించి "నన్నేం చేయమంటావే? వెళ్లి నాన్నతో చెప్పు." అంది. చెల్లెలు బిక్కు బిక్కుమంటూ వెళ్లిపోయింది. చెల్లెలి ఫ్రాకు చిరిగిపోతే తానేం చేయాలి? తానెటూ ఇల్లువదిలి పోతున్నదాయె.

పొద్దు వాలుతూంది. పిల్లలు లాంతరుచుట్టూ కూర్చుని చదువుకొంటున్నారు. అమ్మ దేవుని ఫోటోముందు నిలబడి హారతి ఇస్తున్నది. దేవుడు ఆమె పూజకు ప్రతిఫలంగా ఏమిస్తాడో? పిల్లల సైన్యాన్ని పంపాడు కాని, తనకుగాను ఒక భర్తను పంపాడా? ఒకవేళ అమ్మ తన కూతురికి భర్తకావాలని కోరుకుందో లేక తనకు ఇంకా పిల్లలు కావాలని వేడుకుందో? అమ్మ ఎప్పుడూ "పిల్లలంటే దేవుని ప్రసాదము" అని అంటూ వుంటుంది. ఇంకో చెల్లెలు రొట్టెలు చేస్తున్నది. వంటావార్పూ అదే చేస్తుంది.

పర్సులోని రాజీనామా కాగితం బయటికితీసి ఆమె నాన్నగారి వద్దకు వెళ్లాలను కొంటుంది. ఇంతలో నాన్నగారే ఆమె గదిలోకి వచ్చారు. నాన్నగారు ఎంతో వయస్సుమళ్లినవారిలా, అమాయకుళ్లా వచ్చి నిల్చున్నారు. కాళ్లకు చెప్పులుకూడా లేవు. చినిగిన బనియను. వణుకుతున్న కాళ్లతో దీనంగా కనపడ్డాడు.

నాన్నగారు మెల్లమెల్లగా ఆమెదగ్గరకువచ్చి, రెండు పిడికిళ్లు బిగించి, గుండెలపై పెట్టుకొని, కళ్లు క్రిందికిదించి నిలబడ్డారు.

"అమ్మడూ, కొత్త కళ్లద్దాలు తెచ్చుకున్నా ఏమీ ప్రయో జనం లేదని డాక్టరు గారన్నారు. ఆపరేషను చేయకపోతే చూపు పోతుందట......! నేను గుడ్డివాణ్ణయిపోతాను... అమ్మడూ నేను గుడ్డివాణ్ణయిపోతాను." నాన్నగారి కళ్లనించి నీళ్లు ఏకధారగా కారు తున్నాయి. అమ్మ శ్లోకాలు చదువుతున్నశబ్దం ఎక్కువైంది. ఆమె స్తంభించిపోయి నాన్నగారినే చూస్తూ వుండిపోయింది.

ఎదురుగా రెక్కలురాని పిచ్చుకపిల్ల అరుస్తూవున్నది. ఆమె చేతిలో రాజీనామా కాగితం నలిగి చిరిగిపోతుంది.

~~~~~~
~~~~~~

# శేషేంద్ర జాలం

## (పరిశీలనాత్మక విమర్శ)

### శ్రీ రామాచంద్రమౌళి

[రచయిత: ఆవంత్స సోమసుందర్. ప్రచురణ: కళాకేళి ప్రచురణ, పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా - 533450. **ప్రాప్తిస్థానం:** ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ 3237; రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్.]

ఇదివరలో బాలగంగాధరతిలక్ కవితా సమాలోచననూ, నారాయణ బాబు కవితపై సమగ్ర విమర్శా వ్యాసాలనూరాసి ప్రచురించి ఆధునిక కవితా పిపాసువులకు ఓ నిర్దిష్ట మార్గ దర్శనం చేసిన శ్రీ సోమసుందర్ యిప్పుడు అదే ఉద్దేశ్యంతో వర్తమాన తెలుగు కవితా చరిత్రపై ఓ నూతన ముద్రను వేసిన కవి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ వినూత్న కవితా వాల్లభ్యంపై రాసిన సుదీర్ఘ పరిశీలనాత్మక విమర్శ యీ గ్రంధం. యీ ప్రయత్నంలో శ్రీ శేషేంద్ర శర్మగారి నాలుగు కవితా సంపుటాలను ఓ పదహారు మంది ప్రఖ్యాత ఆంగ్ల సాహిత్య విమర్శకుల గ్రంధాల ఆసరాతో సమగ్రంగా విశ్లేషించేందుకు ప్రయత్నించారు శ్రీ సోమసుందర్. ఐతే శ్రీ శేషేంద్ర శర్మ కవిత యీ విమర్శకునిపై ఎంతో గాఢమైన ముద్రవేసి తన వైపుకు లాక్కునిపోయి, తనలో లీనం చేసుకుని దాదాపు విమర్శకుని తన పక్షాన చేర్చుకుని ఆ కోణంనుండే ఆలోచింపచేసింది. అందుకు ఉదాహరణగా...ఒకచోట అంటాడు—"శేషేంద్ర కవిత తమకు స్పష్టంగా అవగాహన కావడంలేదని అంటే అది వాళ్ళ కవితా సంస్కార దారిద్ర్యమే తప్ప అన్యం కాదు. దానికి విమర్శకుడు సహాయ పడలేడు" అని. యిందులో కవితా లక్షణాలనూ, ఆ కవిత్వ తత్వాలనూ శ్రీ సోమసుందర్ సోదాహరణంగా ఎన్నో మూల రహస్యాలతో సహా చర్చించి భూతద్దం క్రింద పెట్టి చూపించారు. తన సహజ భాషా పాటవంతో రచయిత యీ విషయాన్ని సులభ శైలిలో రచించిన తీరు ఎంతో బాగుంది.

యీ మధ్య ఆధునిక కవితారంగంలో ఓ నూతన సంవిధానాన్ని శ్రీ శేషేంద్రశర్మ ఆవిష్కరించిన మాటమాత్రం నిజం. అతను రాసిన ఎన్నో కవితల్లో కొన్నింటిని ఏ రసపిపాసయినా చదివి మధురానుభూతిలో తడిచి తాదాత్మ్యం పొందకపోడు.

"కండల కంఠానికి లొంగి
ఇక్కడ
ఆకాశం సూర్యుడ్ని అమ్ముకుంది
గుప్పెడు నక్షత్రాలకోసం—" (మరోదేవుడు)

"అక్షరాల పక్షులు ఎగిరిపోయాయి
అర్థాలుమాత్రం మిగిలి ఉన్నాయి
ఎడారిలో మైలు రాళ్ళలాగ—" (తుఫాను)

"వర్షం వెళ్ళిపోయింది
మబ్బుల రధాలెక్కి" (వాన)

...లాంటి భావప్రయోగాలు ఎంతో రంజకంగా ఉంటాయి ఎవరికైనా. యీ రకమైన నిర్గుణ పదచిత్రాలను (Abstract

mages)ను శ్రీ శర్మ పుంఖాను పుంఖాలుగా గాలిలోకి పకుల్లా ఎగిరేశారు.

ఐతే -

"మిణుగురు పురుగు
వెన్నెట్లో
చీకటి ప్రయాణాలు చేస్తూ-" (వక్రరేఖలు)

"పక్షిలేని తోటనించి
పొమ్మంటోంది
ఒక చంద్రుడ్నిస్తూ
నీ ఆత్మ చప్పరించడానికి
రమ్మంటోంది-" (పక్షిలేని తోట)

"యీ దేశం నా ప్రతిభకొక సమాధి. ఎంత
వడివడిగా నడిచినా సరే ఎప్పుడూ దూరం
అంతే-" (పువ్వులు-విశ్వబ్దాలు)

...లాంటి అస్తవ్యస్త కవితా పంక్తులు మాత్రం పాఠకుడిని కాస్త తిప్పలు పెట్టకపోవు. యిటువంటి శ్రీ శేషేంద్రశర్మగారి పద్యచరణాల జోలికి శ్రీ సోమసుందర్ పోలేదు. వారికి నచ్చిన వాటిని మెచ్చుకుంటూ, శ్లాఘిస్తూ అంబర వీధుల్లోకి వెళ్ళిపోయారు.

"A good critic must be an adept at experiencing without eccentricities, the state of mind relevent to the work of art he is judging" అంటాడు ప్రఖ్యాత సాహిత్య విమర్శకుడు I. A. RICHARDS. (The principles of literary criticism—P. 114).

'మండే సూర్యుడి' శక్తిమంతమైన ధ్వనివల్ల తెలుగు నేల మీద కలిగిన అశేష ప్రకంపనాల ప్రభావానికి ఎందరో ప్రముఖ కవులు కూడా లొంగి శ్రీ శర్మ కవిత్వాన్ని అనుకరించారని రూఢిగా చెబుతున్నారు శ్రీ సోమసుందర్.

ఉదా :—

శ్రీ శర్మగారి..."పూల నేత్రాలతో గాలి గుసగుసలాడుతోంది" అన్న కవితోక్తికి ప్రభావితుడై డా॥ సి. నారాయణరెడ్డి "పూలు గుసగుసలాడుతాయని యిప్పుడే తెలిసింది..." అని సినిమా పాటలో అనుకరించాడంటారు. యిందులో అనుకరించాల్సిన అసామాన్య భావ విశిష్టత ఏముందో అర్థంగాదు.

అలాగే..."నేను చెమట బిందువుని

కండల కొండల్లో ఉదయించే లోకబంధువుని-" అన్న వాక్యాలకు శ్రీమతి నాయని కృష్ణకుమారి కవితా వాక్యాలు
"నేను కాంతి బిందువును

అశాంతికి ఆత్మబంధువును" అనుకరణ పంక్తులుగా నిర్ధారించారు. (బిందువు, సింధువు, బంధువు...యివన్నీ యిదివరకు ఎందరో "రైమ్"కోసం వాడి వాడి నలిపిన పదాలు. వాటిలో అనుకరణేమిటి)

శ్రీ శేషేంద్రశర్మ తన పుస్తకంలో సృష్టించిన "హిమలేహ్యం" (ఐస్‌క్రీంకు బదులు) అన్న పదం మాత్రం ఒక సుందర ప్రతిష్ఠ.

"శ్రీ శేషేంద్రశర్మ కవిత యిరవయ్యోకటో శతాబ్దానికి ఉషస్సార" అంటున్నారు శ్రీ సోమసుందర్.

"నీ కవిత్వంలో రసాన్నికట్టి బంగారం చేయడంకోసం తడవులాట కనిపిస్తుంది నాకు" అన్నారు శ్రీశ్రీ శ్రీ శర్మగారి కవితల గురించి.

"గుంటూరు శేషేంద్రశర్మను కవిగా గుర్తించలేను" అంటున్నారు శ్రీ గోరా శాస్త్రి ('తరుణ' మాసపత్రిక. సెప్టెంబర్ 76)

యీ పరిస్థితిలో శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ కవిత గురించి సమగ్రావగాహనను కోరుకునే ప్రతివారూ యీ పుస్తకంను చదవాల్సిందే.

# కలగూరగంప

## నైషధ భారతి

మే నెల భారతిలో ప్రచురితమైన ఈ విషయమును పురస్కరించుకొని ఈ లేఖ వ్రాయుట యైనది. అందులో శ్రీహర్ష శ్రీనాథు లిద్దరును సరస్వతిని వర్ణించుటలో 'స్మరహరమయం', శైవమై, శివంబై, అనుశబ్దములు ప్రయోగించి కొంత అస్పష్టత కల్పించిరేగాని చింతామణీ మంత్రమున కధిదేవత సరస్వతియేగాని శైవమున కేమియు సంబంధములేదని అభిప్రాయము వెలిబుచ్చిరి. దానికి వారిచ్చిన సమాధానమొక్కటియె. మూలమున 'మే' అనియు అనువాదమున 'మదీయము' అనియు ఉన్నందున అది సరస్వతికి మాత్రమే అన్వయించును గాని యితరుల కన్వయింపదని.

కాని వారు త్వరపడి నారనియే తోచెడిని. మూల గ్రంథకర్త విదేయుడైన అనువాదకుడు ప్రదర్శించిన శబ్దములను శంకించగలిగిన అవకాశము పాఠకునికిలేదు. గ్రంథకర్త తన గ్రంథము నందంతను సరస్వతి శివమయమని చెప్పికొనియుండగా దానిని కాదనగలహక్కు వ్యాఖ్యాతకుగాని, అనువాదకునికిగాని, మరె పాఠకునికిగాని కలుగునా ? ఆయన భావమిదియని వ్యాఖ్యానింపగలమేగాని – ఆభావము వెలిబుచ్చి నందున అతడు దోషియనజాలము. అందువలన శ్రీహర్ష శ్రీనాథు లిద్దరును సరిగనే వక్కాణించిరి. అసలు నైషధ భారతి శైవ భారతి. ఇద్దరు గ్రంథకర్తలు ఆయుద్దేశ్యముతోనె స్పష్టముగ వ్రాసిరి.

ఇకపోగా సరస్వతి చింతామణి మంత్రాధి దేవత గాదనియు, శివుడేయైనను, మంత్రార్థము సరస్వతికేగాని శివునికి చెల్లదనియు నొక వాదము ప్రస్తావింపబడినది. దానికిగూడ సమాధానమున్నది. అసలు నైషధములో సరస్వతికొక ప్రత్యేక స్థానములేదు. ఉన్నదేదో గ్రంథకర్త గ్రంథ గ్రంధిగా శైవసరస్వతిగా పోతపోసినాడు నైషధ సరస్వతికిగల ఆంతరంగిక రూపమేమో శ్రీహర్షమహాకవి 10వ సర్గలో 74 నుండి 80వ శ్లోకము వరకు నిబంధించిచూపినదియు, ఆమె దర్శన సౌందర్యమునుగన వలవిగాని మల్లినాథాదులెట్లు తల్లడిల్లిరో ఇప్పటికే వ్యాఖ్యానరూపమున నిరూపితమయినది.

ఇక చింతామణి విషయమునకు వత్తము. అదికేవలము వాక్ పరిమితమేగాదు. దానికి రూపముగూడ నున్నది. దాక్షిణాత్య శిల్పములో గ్రంథగ్రంథులకు రూప నిర్మాణము లొనర్చిన కర్ణాటాంధ్ర శిల్పి తల్లజాల కైవాడములలో ఈ రూపములు స్పష్టముగ రూపదర్శన మొసంగుచున్నవి. ఐహోలె, హళె బీడు, సోమనాథపురము ఇత్యాది శిల్పకళాక్షేత్రములలో పరమశివమూర్తికి ఆయుదముగ 'చింతామణీ' నిర్మాణము చూడగలము. ఈ విషయము; ఆగమ, శిల్ప, తంత్ర, కళా విజ్ఞులకుగాని తెలియదు. నటరాజ శిల్పము గండరించుటలో చిదంబర శిల్పమున కెంత గాంభీర్య ముద్రగలదో కర్ణాట స్థాపత్య మనీషుల రూపకల్పనలో వంత లాలిత్యము నాయా శిల్పకళాక్షేత్రము లలో వెలసినది. ఆ వైభవములో 'చింతామణి' ఆయుధ విన్యాస మొకటి. శివుని కరపల్లవములో తాండవింపవలసిన చింతామణికి వాక్ రూపము సరస్వతియైనను ఆధారము శివమయమే! దీనిని సాహిత్యోపాసకులు గుర్తింపవలయును.

ఇంతవరకును ఆంధ్ర సాహిత్యమున శ్రీహర్ష శ్రీనాథ మహాకవుల మహాగ్రంథములపై వెలసిన విమర్శనా సర్వస్వములలో అగ్రేసరమైనది శ్రీమదాచార్య పెదపాటి నాగేశ్వరరావుగారి శ్రీనాథుని పంచప్రాణము లనియెడి గ్రంథరాజము. దానిలో వేద, వేదాంత, తంత్ర, ఆగమ, శిల్ప, సాహిత్య, మర్మము లెన్నియో వివరణ మొనరింపబడినవి. అంతియేగాక విశ్వ సాహిత్య మర్మములుగూడ ప్రస్తావింపబడినవి. అందులో ఈ శ్రీహర్ష శ్రీనాథ సరస్వతీ మర్మములు మల్లినాథుని వ్యవహారము తెలుగు పాఠకులకు రుచి చూపింపబడినవి. వేదశాస్త్ర విద్యాంసులగు శ్రీమదాచార్య పెదపాటి నాగేశ్వరరావుగారు త్వరలో తమ సంస్కృతాంధ్ర ఆంగ్ల వ్యాఖ్యలతో గూడిన నైషధ సంజీవని వెలువరించినచో ప్రాచ్యపాశ్చాత్య విద్వత్తల్లజులకెంతయో నుపకారకమగును. దీనికి ఆంధ్రులెల్లరు చేయూత నొసగి ఒక విశిష్ట గ్రంథమును ప్రపంచమునకందించి ధన్యు లగుదురుగాక!

—*శ్రీ బండి సత్యప్రసాద్*

## శ్రీ మరుపూరు - "తోటివాడు"

భారతి – సెప్టెంబరు 1976 – గ్రంథవిమర్శలు – "నిశ్శబ్ద తరంగాలు", "సుధాంశువులు" – శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి సమీక్ష–తత్సంబంధ చర్చ :

ఎల్లోరా తన నిశ్శబ్దతరంగాలు అనే వచన కవితా సంపుటిలో వచన కవితా ప్రక్రియనుగురించి తానై వ్రాసూ 10వ పేజీలో ఇట్లా అన్నారు: "...తోటివారి కన్నీరు, సాటివారి బాధలు...కవిని, రచయితని అభ్యుదయం వేపు చూడమంటాయి." ఈ వాక్యంలో తప్పు పట్టారు మరుపూరువారు. ఏమని ?

I "ఎల్లోరా 'తోటివాడు' అంటారు (10 పేజి). ఇది 'తోడి' పదం. తెమగులో తోటి అంటే పాకీ పనివాడే కాబట్టి, ఇది

ఈయన నోట ఎంత నానినా వాడి ఉండరాదు. కావలసినది శిష్ట వ్యావహారికంగాని, నింద్యగ్రామ్యంగాదు.'' ఇదీ రెడ్డిగారి ఆక్షేపం.

సమాధానం చెప్పవలసి వస్తున్నందుకు మన్నించాలి —

(1) ఎల్లోరా వ్రాసింది వ్యావహారిక భాషలో. ఆ భాషలో కొన్ని ప్రాంతీయపు పలుకుబళ్ళు, మాండలికాలు ఉన్నాయి. పత్రికలలో, రేడియోలలో, సినిమాలలో, నవలలలో, చాలా వచనగేయ కావ్యాలలో ఇట్టి భాష వాడబడుతున్నదే. ఈసందర్భంగా రెడ్డిగారు చెప్పే శిష్ట వ్యావహారికానికి, నింద్యగ్రామ్యానికీ ప్రసక్తిలేదు అసలు వ్యాకరణ శాస్త్రజ్ఞులు చెప్పేది నింద్యగ్రామ్యము, అనింద్య గ్రామ్యము మాత్రమే. శిష్టవ్యావహారిక మన్నది మధ్యవచ్చినమాట. శిష్ట వ్యావహారికమూ, అనింద్య గ్రామ్యమూ ఒక్కటి అనుకోవటం పొరపాటు. మాండలికం, ప్రాంతీయం అన్నదిగూడా వ్యాకరణానికి లోబడే రాలేదు. కాబట్టి యీ ప్రసక్తి అనవసరం. ''ప్రవాహినీ దేశ్యా'' అని ఆంధ్రశబ్ద చింతామణి అంటున్నది.

(2) ఇది ''తోడి'' పదం అన్నారు రెడ్డి. ఇక్కడ ఇది పదంకాదు. అపదం. అంటే ప్రత్యయం అన్నమాట. 'తోడ' అనేది తృతీయా విభక్తి ప్రత్యయం. చేత, తోడ, వలన లకు సమాసాలలో ఇత్వం వస్తుంది. కాబట్టి తోడన్ + వాడు లేక వారు — అన్నప్పుడు తోడివాడు, తోడివారు అనే రూపాలు సిద్ధిస్తాయి. ఇది శుద్ధమైన గ్రాంధిక భాషా మర్యాద. వ్యావహారిక భాషలో దీన్నే కండకుదవగా అనుసరించాలన్న సంకెళ్ళు ఎవరూ వెయ్యలేదు, రెడ్డిగారేదో జులుం చెలాయిస్తున్నారు తప్ప.

(3) గిడుగువారి 'బాల కవి శరణ్యము'ను రెడ్డిగార్ని చూడ మని కోరుతున్నాను:

'తోడివాడు' అనే మాటకు మారుగా నేడు 'తోటివాడు' అని లోకములో అంటున్నారు. శ్రీకృష్ణజన్మ ఖండములో శ్రీ గోపీనాథ కవిగారు అది ప్రయోగించినారు. శ్రీపాద వెంకటాచల కవిగారు కౌసల్యాపరిణయమనే ప్రబంధములో, (మా. ఆ. III, పు. 38)

సీ. గీ. మాటిమాటికి నముగులతోటి సూటి;
వాటిలంగ వాడు మాటల తేటతోడ......

అని ఎంత చక్కగా ప్రయోగించినారో చూడండి, అసాధువా అది? గ్రామ్యమా? తోడికోడలు అనడానికి మారుగా కొన్ని మండలాలవారు తోటికోడలంటున్నారు. రెండున్ను సాధువులే. (253 పే. 48వ అంశం.) అర్ధశతాబ్ది క్రితం కావ్యభాషలోనే సాధువుగా అంగీకరించిన దాన్ని ఇప్పుడు రెడ్డిగారు వ్యావహారికంలో తప్పంటున్నారు.

(4) దీపాలవారి భాగవత పాఠపరిశోధనము — 136 పేజి, ఆ అంశం (తోటి) గూడా చూడవలసి ఉన్నది:

తనతోటివాని ప్మృతికి — భాగవత (అకాడమీప్రతి), 9-236.
తోటివారని కొంచెపాటిగా జూడక — ముకుంద విలాసము.
సాటిరాగలవారె నీతోటి యోగ! — చాటువు.
పేటలోనువ్వు పెద్దలతోటి తిరుగు—''ఒకనాడు'' (విద్వాన్‌విశ్వం)

ఇట్లా గ్రాంథిక పద్య కావ్యాలలోనే 'తోటివాడు' ప్రయోగాలున్నాయి. రెడ్డిగారి ఆక్షేపం నిరాధారం.

(5) వావిళ్ల నిఘంటువులో తోటి శబ్దము తోడియను దాని యపభ్రంశ రూపము కాదగునని సూచించబడ్డది. వ్యవహారారూఢము కాబట్టి వారి దృష్టికి అపశబ్దముగా తోచినా నిఘంటువు కెక్కినది. ఆ నిఘంటువు గ్రాంధిక భాషకు ఏర్పడి వట్టిది.

తోటి శబ్దానికి తెనుగులోనేకాదు, తమిళంలోగూడా సాకీ వవివాడని అర్థమున్నది. అదొక్క అర్థమేకాదు తెనుగులో నిఘంటువు అందు వేడుక, మేలు అన్న అర్థాలుకూడా ఉన్నాయి. శ్రీ సూర్య రాయాంధ్ర నిఘంటువు, వావిళ్ల నిఘంటువు, ఆంధ్రశబ్దరత్నా కరము మొ॥నవి చూడగోరుతున్నాను.

(6) ''తోటివాడు'' అన్నమాటకు నానార్థాలున్నప్పుడు సందర్భాన్నిబట్టి అర్థం తీసుకుంటాము. ''శ్రీహరి లక్ష్మీప్రియుడు అన్నప్పుడు హరి అంటే కోతి అని ఎగతాళీ చేస్తారా, ఎంత సాగుబడి ఉంటేమాత్రం?

తోటివాడు అంటే తోడివాడు అని అర్థం చెప్పడంలో అన ర్థమూలేదు; అసందర్భమూకాదు.

(7) మరొక చిత్ర మేమిటంటే - మరుపూరు కోదండరామ రెడ్డిగారే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తరపున కూర్చిన 'మాండ లిక పదకోశము'లో ''తోటివాడు=సాటివాడు'' అనే అర్థంలో తెలంగాణ సర్కారు జిల్లాల వారు వాడతారని నిర్ణయించారు. నెల్లూరు, కర్నూలు జిల్లాలలో ఈ అర్థంలో వాడరట. కోనసీమకవి ఎల్లోరా వాడింది నింద్య గ్రామ్యమని, వాడి ఉండరాదని రెడ్డిగారు గిరిగీస్తున్నారు. కోన సీమకవి ఎల్లోరా రచన, అకాడమీ సభ్యులైన నెల్లూరి రెడ్డి విమర్శ కుల యెదాన పడుతుందని ఎవడనుకున్నాడు?

కావ్యాలలోవాడి నిఘంటువుల కెక్కినమాట మాండలిక మెట్లవుతుంది? మాండలిక పదకోశానికెక్కిన తర్వాతగూడా ఒక

మండలంలో తప్పు, మరొక మండలంలో ఒప్పు ఎట్లవుతుంది? ఏమిటి చాదస్తం?

అవునూ, నాకు తెలియక అడుగుతున్నాను, పాకీవారి కన్నీరు మాత్రం పనికిరాదా?

II "అప్పుడే అభ్యంగనం చేసిన యువతి కురులను సవరించుకొంటున్నట్లు (34 పే) అంటారు; అభ్యంగన మంటే చమురుతో తల అంటుకోవడం గాని స్నానం చెయ్యడంగాదే? వీటిని ఎవరైనా ఒక ఎలిమెంటరీ స్కూలు టీచరు సమర్థించవస్తే—నోరు మూయించడంకాదు (ఇది ఏల్చూరిగారి మహా ప్రయోగం) పళ్లూడ గొట్టుతారు." అన్నది రెడ్డిగారి మరొక అభియోగ భర్త్సన!

పళ్లూడ గొట్టుకొనే సంగతులెందుకుగాని — అవి నాగరికమైన వ్యవహారాలు కావుగద? మడవకట్టుగాళ్ల పని, మనకెందుకు? —విషయానికి వద్దాము. అభ్యంగము, అభ్యంగనము, అభ్యంజనము మూడూ పర్యాయపదాలు. తలంటు అని అర్థం. తలంటుకొని స్నానముచేయు అనికూడా దీనికే లక్షణార్థం. అందుకే బ్రౌను అభ్యంజన స్నానము, an oil bath అనే అర్థంకూడా పై మూడు రూపాలకూ ఉంచాడు. "అభ్యంజన మంగళాంగి! జడయల్లుదునా?" అన్న కరుణశ్రీ జంధ్యాలవారి ప్రయోగం ప్రసిద్ధం కద?

సమర్థన ఇప్పుడూ భాషాభిమానంతోనే గాని వ్యక్త్యభిమానంతో ఉండరాదనడానికి సిగ్గుపడుతున్నాను. సమర్థనీయ విషయం ఎవరు —ఏ యెలిమెంటరీస్కూలు టీచరు-సమర్థించినా తప్పులేదు. "తెలియనివన్ని తప్పులని దిట్టతనాన..." అకాడమీ సభ్యులంటేమాత్రం చెల్లుతుం దనుకుంటున్నారా? అకాడమీ విద్వాంసుల మని విర్రవీగే వారి పాండిత్యంకంటె గొప్ప పాండిత్యంగల ఎలిమెంటరీ స్కూలు టీచర్లు ఎంతోమందివున్నారని భారతికిగూడా తెలుసుననుకుంటాను.

III వాచవికి కొన్ని కమ్మటి ప్రయోగాలు — అంటూ రెడ్డిగారు "పుడమితల్లి పురిటి నొప్పులు (22 పే)" పేర్కొన్నారు. ఇదే ప్రయోగం ఈ కవే ఇంతకు ముందటి కావ్యం (రేపటి వసంతం)లో చేస్తే (15 పే) "పురిటి నొప్పులా కామునొప్పులా?" అని ఔచిత్య చర్చచేసి ఉన్నారు. ఇప్పుడు దరువు మార్చేశారు. వీరి మెచ్చుకోళ్లుగూడా అర్థం పర్థం లేనివి మరి!

IV ఏల్చూరి తాను వచన కవితా ప్రక్రియలో సుప్రసిద్ధులైన మరి కొందరు కవుల బంతిలో తానై తనపేరు చేర్చుకొన్నారని ఒక నింద. అందుకు రెడ్డిగారు, "ఈ స్వకుచ మర్దనం మంచి చేస్తు గాదు; ఇతరులు లేరా ఈ సంగతి చెప్పను?" అన్నారు. యువ కవి కియ్యదగిన ఉపదేశమే. కాని దాని ప్రక్కనే మరొక (సుధాంశువులు) పుస్తకాన్ని సమీక్షించే సందర్భంలో, "నాపొట్ట సామెతల పుట్ట అనిగదా తెలిసినవారు అనేది; కాబట్టే వీటి సంగతి నాకు బాగాతెలుసు." అని చెప్పుకొంటున్నారు. మరి యిదేమి చేస్తు? పరోపదేశ పాండిత్యమా? స్వవచో వ్యాఘాతమా? స్వకుచ మర్దనమా?

కీర్తి, ప్రచారం రెండూ ఒకటికావు. కీర్తి రమ్మంటేరాదు. ప్రచారం ప్రయత్నించినంత మేర రావచ్చు. సొంతడబ్బా వాయించుకుంటే, భజన రాయుళ్ల చేత దండోరా వేయించుకొంటే వచ్చేది ప్రచార రూపమైన అపకీర్తి. ఏల్చూరాది మంచిచేస్తుగాకపోతే రెడ్డిగారిదిగూడా ఆ గాటనే కట్టి వెయ్యబడుతుందని తెలియదా?

V మరుపూరు వారికి గ్రాంథికం తెలియదు. వ్యావహారికంరాదు. ప్రాంతీయాలు, పలుకుబళ్ళు, మాండలికాలు, మాటతీరులు — ఏమో తెలిసినట్లు పట్టి నటన. "సొంతానికి స్వంతం అని" అనకూడదట (సుధాంసువులు-సమీక్ష). ఇది స్పెలింగు తప్పట. దీన్ని నింద్య గ్రామ్యంకూడ ఒప్పుకోదట. ఈ విమర్శకు అర్థమేమిటో రెడ్డిగారే చెప్పాలి!

నింద్యగ్రామ్యమంటే నింద్యమైన గ్రామ్యభాష. అది దేన్నయినా ఒప్పుకుంటుంది. కాబట్టి అది (నింద్యగ్రామ్యం) వ్యాకర్తల చేత నిషేధించబడ్డది. దేన్నయినా ఒప్పుకొనే నింద్యగ్రామ్యం "స్వంతం" అనే మాటను ఒప్పుకోదట. అది అంతగా చెడిపోయిందని రెడ్డిగారు ఈసడిస్తున్నారు. నిజంగా రెడ్డిగారికి తెలుగుభాష తెలుసునా? ఒకటి రెండు నిఘంటువుల మొగమైనా చూచారా?

బ్రౌను సొంతము (1362 పు.), స్వంతము (1380 పు.) రెండూ ఇచ్చాడు. స్వకీయమైన అని అర్థం చెప్పాడు.

1. దాన్ని స్వంతానికి కొనుక్కొన్నాడు.
2. ఆయనే స్వంతముగా వచ్చినాడు.

అనే వాడుకలు చూపినాడు ఇందులో స్పెలింగు తప్పూలేదు; నింద్య గ్రామ్య ప్రసక్తిరాదు. ఇది శిష్టులువాడే వ్యావహారిక భాషలో ఉన్న మాటే. సుప్రసిద్ధ సాహిత్య పండిత పరిశోధకుడు ఆరుద్ర సవాలక్ష సార్లు 'స్వంతం' ఉపయోగించాడు తన సమగ్రాంధ్ర సాహిత్య సంపుటాల్లో. (మచ్చుకు చూస్తారా? XI సంపుటం II భాగం 82 పుట—"స్వంత గొంతుక") బ్రౌన్యంలో "స్వంతగాడు or సొంతగాడు" అనే రెండు మతుబర్థక తద్ధితాంత రూపాలుగూడా చూపబడ్డాయి. (1903 నాటి రెండవ ముద్రణ.)

ఇంక (ముఖ్యంగా "సుధాంశువులు"లో) పాటలో చుక్కలు పడని, ఒత్తులు పడని, అచ్చుతప్పుల క్రింద సర్దుకుపోదగిన వాటిని గూడా ఎత్తిచూపి స్పెలింగు తప్పులని తీర్పు చెప్పారు. మరీ పూర్ స్టేట్‌మెంట్స్.

VI. అధిక ప్రసంగం కాదనుకుంటే, ఏమిటీ దండగ రామాయణం అనుకోకుంటే ఒక్క మనవి చేస్తాను :

ఉలుపా అంటే కానుక. ఉపాయనము అంటే కానుక. మొదటిది తెలుగుపదం, వికృతి. రెండవది సంస్కృతపదం, ప్రకృతి. (పరస్పరం ప్రకృతి వికృతులు కావు) రెడ్డిగారు ఈ రెంటినీ కలిపి "ఉలుపాయనము" హైబ్రిడ్ శబ్దసృష్టి చేశారు! కానుక అనే అర్థము. "గుర్రము-అశ్వము" కలిపి "గుశ్వము" చేశాడట వెనకటికో పండితుడు!

నేను వారిని నిందించను.

వారి పాండిత్యాన్ని గుర్తించిన భారతి అదృష్టవంతురాలు!

— *శ్రీ బండ నాగరాజు*

## డచ్ సమాధులు ఒల్లాండురాజు దిబ్బలా ?

ఒకనాటి డాకిరేమిగా, జననాథగిరిగా, బెండపూడి అన్నమంత్రి కట్టించిన ద్వాదశమండపంలో కవిత్వం చెపుతో శ్రీనాథుడు విహరించిన దక్షవాటికగా ప్రసిద్ధి కెక్కిన చారిత్రక పుణ్యస్థలం నేటి ద్రాక్షారామం. ద్రాక్షారామము శివక్షేత్రం మాత్రమేకాక, ఒకప్పుడు పేరుగాంచిన డచ్-ప్రభుత్వపు స్థావరం. ఈవూరి సమీప ప్రాంతమైన బియ్యంపేటలో డచ్-ప్రభుత్వం ఫిరంగిగుళ్లను తయారుచేసే వారని చెపుతారు. గత శతాబ్దంలోనే, రాబర్టు సీవెల్ ఆర్కియలాజికల్ శాఖ తరఫున OLD TOMBS AND MONUMENTS IN MADRAS PRESIDENCY అన్న పుస్తకం ప్రచురించారు. ద్రాక్షారామంలోని డచ్ సమాధుల గురించిన రిపోర్టు సూవెల్ గ్రంథంలో వివరంగా వుంది.

సూవెల్ ప్రకటించిన రిపోర్టుయిది :

**Datchveram, otherwise known as Daksharama is in Ramachandrapuram Taluka. These two carved slabes are situated at a spot which still by the name of Ollandoo Dibba (ఒల్లాండు దిబ్బ) or Hollandar's Mound.**

1. 1673 A. D. HEIR ON DER LEYT BE GRAVEN JOANNEES CAULIER SYNADE OUDER COOPMAN ENTWEEDE PER SOON IN DEN HERE GERUST DEN 18 JANUARY A. D.1673.

2. 1728 A. D. HEIR ON DER RUST...DEPSYIER AN UYTREGT HUY SU ROW VAN JEAN JACVAS JAPAN ON DER COOPMAN ENOPPER HOOF DE SES OMPTIRS DAE TCHERAM IN DEN HERE GE RUST DEN A. D. 1728.

డచ్ భాష అక్షరాలేకాక, ఆ సమాధి రాళ్లపై అప్పటి డచ్-ప్రభుత్వపు అందమైన శిల్పాలు చెక్కబడి వున్నాయి. శాసనాలలో పేర్కొనబడ్డ A) కాలియర్ B) జీన్‌జాకస్ అనాటి డచ్ ప్రభుత్వపు ప్రముఖ వుద్యోగులై వుండాలి. ఏకారణంచేత ద్రాక్షారామములో చనిపోయారో వివరంగా మనకు తెలీదు.

విదేశీయులు కావడంచేత, ద్రాక్షారామాన్ని తాము చెక్కిన వ్రాతలలో డచ్-వరము అని చెక్కడం జరిగింది. ప్రస్తుతం ఈ రాతి పలకలు ఒక డాక్టరుగారి నర్సింగ్ హోమ్ ప్రక్కన వున్నాయి. ప్రాచీన శిధిలాల ప్రాముఖ్యత తెలియనందువల్ల, యిక్కడి ప్రజలు శిథిలాలువున్న స్థలాన్ని 'లా వెటరీ' గా వుపయోగించుకుంటున్నారు. చారిత్రక దృక్పధమంటే ఏమిటో తెలీని ప్రజలు ఒల్లాండురాజు (?) యీ రాతి పలకల్ని వేయించాడని మూఢంగా విశ్వసిస్తున్నారు.

ప్రాచీన శిల్పకళా సంపద మన సంస్కృతికి సోపానాలు. మన పురాతత్వశాఖవారు శ్రద్ధ తీసుకుని, రాతిపలకలుగల ఈ ప్రాంతాన్ని శుభ్రంగా వుంచడం, రాతిచెక్కడాల ప్రాముఖ్యతను చరిత్ర తెలీని గ్రామస్థులకు బోధించడంవంటి కార్యక్రమాలను చేపడితే సమంజసంగా వుంటుంది. ఒకప్పటి డచ్ ప్రభుత్వం వేయించిన రాతి పలకల్ని సంరక్షించవలసినదిగా, మన పురాతత్వశాఖ వారికి, భారతి పత్రిక ద్వారా మనవి చేసుకుంటున్నాను.

— *శ్రీ పాలెపు నరసింహం*

## వేమన-స్త్రీ ఒక సమీక్ష

'వేమన-స్త్రీ' అన్న శీర్షికతో ఆగష్టు 1976 భారతిలో శ్రీ పి. భారతిగారు వ్రాసిన వ్యాసములో వేమనను స్త్రీ ద్వేషిగా నిర్ణయించుచు కొన్ని యుదాహరణముల నొసగిరి. మన ప్రాచీనులు పెక్కు విషయములు చెప్పినను వానిలో నన్నింటిని సార్వజనీనమైనవి

గను, సార్వకాలికమై నవిగను, సార్వదేశికమ్మైనవిగను స్వీకరించవలసిన పనిలేదు. ఏ సందర్భమునకు ఏది అవసరమో దానిని మాత్రమే గ్రహించవలెను. 'అలస్యాదమృతం విషంభవేత్' అన్నారు. 'సహసా విదధీత న క్రియామ్' అని క్రియా శబ్ద గ్రహణములోనే పనిని త్వర పడి చేయవద్దని భారవి వాక్కు. మన యనుభవమున రెండును సిక్కువములని తెలిసికొనవచ్చును. ఏ సమయమున నేది స్వీకరించవలయు నన్నది వ్యక్తిపై నాధారపడియుండును. అట్లులే వేమన స్త్రీలపై నన్నివిధముల ద్వేషమున్నట్లు చెప్పిన విషయములను సార్వ స్త్రైణ విషయముగా స్వీకరించవలదు. అట్టి లక్షణములుగల స్త్రీలకే అది వర్తించును. స్త్రీ ప్రకృతి స్వరూపిణి యను విషయ మాయనకు తెలియదనుట హాస్యాస్పదము. ఇంతటితో వేమనను స్త్రీ ద్వేషిగా భావించినచో పెక్కుమంది యీ నిందకు పాత్రులగుదురు. ఆదిశంకరులు సైతము భజగోవింద స్తోత్రమున

యావత్పవనో నివసతి దేహే
తావత్ పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌ దేహాపాయే
భార్యాబిభ్యతి తస్మిన్ కాయే''

అని చెప్పిరి. లోకమునందలి భార్యలందరు నంతమాత్రమున ననురాగ రహితలు, కృతఘ్నులు నగుదురా. యత్కృతిమో తెలియరాని నీతి శాస్త్రమున ద్రౌపదీదేవివంటి పతివ్రత

''సుందరం పురుషం దృష్ట్వా భ్రాతరం పితరం సుతమ్,
యోని స్స్రవతి నారీణాం తథ్యమే బ్రూహి కేశవ
పంచమే పతయస్సంతి షహ్యాం షష్ఠోపి రోచతే,
పురుషాణా మభావేన సర్వా నార్యః పతివ్రతాః''

అని చెప్పినట్లు గలదు. దీనిని లోకమునందలి స్త్రీలకును వర్తింప జేసిన ఈ ప్రపంచమంతయు మృగసంకులమ్మైన భీకరారణ్యమ్మైపోదా.

ఇక కలిమి విషయమున స్త్రీ నింద చేసినాడని పేర్కొనిరి. దీనివలన ధనమునకుగల ప్రాముఖ్యమే ప్రధానముకాని స్త్రీ నిందకాదు. అట్లైనచో తల్లిదండ్రులు మొదలగువారుకూడ ఈ నిందకు పాత్రులే యగుదురు.

''మాతానిందతి నాభినందతి పితా భ్రాతాన సంభాషతే
భృత్యః కుప్యతి నాను గచ్ఛతి సుతః కాంతాపి నాలింగతే,
అర్థం ప్రార్థన శంకయా న కురుతే స్యాలాపమాత్రం సుహృత్
తస్మాదర్థము పార్జయస్వచ సఖే హ్యర్థస్య సర్వేవశాః''

అన్న దానిని సార్వజనీనమ్మైనదిగ స్వీకరించినచో లోకమున తలిదండ్రులు, సోదరులు, భార్యాపుత్రులు, స్నేహితులుండరుకదా.

స్త్రీని స్వేచ్ఛారహితగా వేమన వర్ణించినట్లు చెప్పిరి. ఇదియు మొదటినుండియు నున్నదే. 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అని యన్న ప్రాచీనులు ''కార్యేషు దాసి కరణేషుమంత్రీ......'' అని అన్నారు. స్త్రీకివ్వబడిన స్వాతంత్ర్యము సామాన్యమ్మైనదికాదు. ఎటొచ్చి దాని నామె సార్థకమొనరించుకొనవలెను. అందువలన వేమనచేసిన నింద దుష్టస్త్రీలకు వర్తించును గాని లోకమునందలి స్త్రీలందరకును వర్తించుననుట సమంజసముకాదు.

ఇక భారతిగారు ''స్త్రీల నవహేళన చేయుచు కవనమల్లిన కవులు మిక్కిలి తక్కువ. సుమతి శతకకారుడు గూడ వేమనవలె చక్కని పద్యములు చెప్పినను 'మహాకవి'యని యనిపించుకొనకపోవుట మన దురదృష్టము'' అని వ్రాసిరి. ఈ యభిప్రాయానుసారము సుమతి శతకకారుడు స్త్రీలను నిందించునట్టివాడు వీరికి ప్రీతిపాత్రుడనుట నిర్వివాదము. మరి యట్టి సుమతి శతకకర్తయే పలు సందర్భముల స్త్రీలను నిందించెను. చూడుడు—

అల్లుని మంచి తనంబును
గొల్లని సాహిత్య విద్య కోమలి నిజమున్.
బొల్లున దంచిన బియ్యము
తెల్లని కాకులును లేవు తెలియర సుమతీ.

గడనగల మగనిఁ జూచిన
నడుగఁకును మడుగులిడుదు రతివలు తమలో
గడనుడుగు మగనిఁ జూచిన
నడపీనుగు వచ్చెననుచు నగుదురు సుమతీ.

కోమలి విశ్వాసంబును
పాములతోఁ జెలిమియున్ను భామల వలపున్
వేముల తియ్యఁదనంబును
భూమీశుల నమ్మికలును బొంకుర సుమతీ.

కడుబలవంతుండైనను
బుడమిని ప్రాయంపుటాలిఁ బుట్టిన యింటన్
దడవుండ నిచ్చెనేనియుఁ
బడుపుగ నంగడికిఁ దానె పంపుట సుమతీ

ఇక స్త్రీలకు స్వేచ్ఛనివ్వవద్దనుచు ''మదిలోఁ గర్వించ నాలిఁ బెంచకు'' అని చెప్పినాడు.

గుణవతులైన స్త్రీలను వేమన మెచ్చిన సందర్భములును పెక్కులు గలవు. చూడుడు—

గుణవతైన భార్య గృహము చక్కగనుంచు
చీకటింట దివ్వె వెలగురీతి
దేవియున్న యిల్లు దేవాలయంబురా
విశ్వదాభిరామ వినురవేమ.

పతియొప్పిన సతి యొప్పును
పతిసతులేకమైన పరమపావన మందునే
నరపతి న్యాయమె మోక్షం
బతులిత పరమాత్మయైక్యమగురా వేమ.

తగిన కులజుడైన తనయెత్తు ధనమైన
భాగ్యపురుషుడేల పట్టనేర్చు
పరమసాధ్విచూడ పరులనంటదు సుమీ
విశ్వదాభిరామ వినురవేమ.

పరస్త్రీలను సోదరులవలె చూడవలెననెను
"పరకాంతా సోదరుడై......వేమా"

అందువలనను వేమనను ప్రత్యేకముగా కేవలము స్త్రీ ద్వేషి యనుట అసమంజసము. ఆయన లోకమును నిశితముగ పరిశీలించి తన యనుభవములను లోకశ్రేయోర్థము వెల్లడించినాడు. ఏదియైనను సంపూర్ణముగ నిర్దోషమైనది గాని, దోషదూషితమైనదిగాని లోకమున గుండనేరదు. ప్రాజ్ఞులైన వారందరి గుణదోషముల విచారించి కేవల గుణస్వీకారము మాత్రమే కావింతురు. వేమన కులభేదము నిరసించుచు చెప్పిన వాక్యములను గ్రహించి యాయనను అభ్యుదయ వాదిగా ఆధునికులు పేర్కొనుటలో దోషమేమియు లేదుకదా-

—శ్రీ తలముడిపి బాలసుబ్బయ్య

# లేఖలు

## ప్రజాస్వామ్యంలో న్యాయస్థానాలు

ప్రజాస్వామ్యంలో న్యాయస్థానాలకు ఒక ప్రత్యేక స్థానముంది. లిఖిత రాజ్యాంగంకల అన్ని ప్రజాస్వామ్య దేశాలు, న్యాయస్థానానికి, ప్రజా ప్రతినిధులచే చేయబడిన శాసనము, రాజ్యాంగ బద్ధమైవదా, కాదా, అన్న అంశాన్ని పరిశీలించే అధికారం యిచ్చాయి. మన రాజ్యాంగం లిఖితమైనప్పటికి, అమెరికా రాజ్యాంగంవలె సులభంగా మార్చడానికి వీలుకానట్టిదికాదు. మన రాజ్యాంగానికి అనేక సవరణలు చేయబడ్డాయి. పాతికేళ్ళలోనే, పాతికమించి సవరణలు చేయబడ్డాయి, అని విమర్శించే విమర్శకులు ఒక ముఖ్యమైన అంశాన్ని విస్మరిస్తారు. ఈ సవరణలు రాజ్యాంగాన్ని వమ్ముచేయడానికికాక, రాజ్యాంగం ఏ ఆశయాల సంసిద్ధికై రూపొందించబడిందో, ఆ ఆశయాల సంసిద్ధికోసం జరుపబడ్డాయి. పెక్కుసవరణలు ఆస్తిహక్కును సంకుచిత పరచడానికి పుద్దేశింపబడినవి.

ఈ సందర్భంగా న్యాయస్థానపు ధోరణిని నిష్పక్షపాతంగా పరిశీలించడం అవసరం. పైన పేర్కొన్నట్లు, న్యాయస్థానాలకు ప్రజా పతినిధులచే చేయబడిన చట్టములు రాజ్యాంగబద్ధమైనవా, కావా, అన్న అంశాన్ని పరిశీలించేహక్కు వున్నది. కానీ అన్ని చట్టాలను ఒకే విర్శత, సంకుచిత దృష్టితో గమనించి, సాంఘికాభివృద్ధి కోసం ఏర్పడిన పురోగమన చట్టాలనుకూడా రాజ్యాంగబద్ధం కావని తీర్పు యివ్వడంలోని ఔచిత్యం, సంశయాత్మం. ఈ ధోరణి ప్రజలలో ప్రస్తుత రాజ్యాంగంద్వారా సాంఘికాభివృద్ధి నెరవేరదని, అతివాద రాజకీయ ధోరణిని ప్రోత్సహింపజేసింది. ప్రజలలో నిగూఢంగా నక్సలైట్లపైనవున్న అభిమానానికి సుప్రీమ్‌కోర్టు తిరోగమన ధోరణి కొద్దిగా కారణం కావొచ్చు.

1950లో, చంపకం వర్సస్ స్టేట్ ఆఫ్ మద్రాసులో, వెనుకబడిన కులాలకు సీట్లు కేటాయించడం, రాజ్యాంగ విరుద్ధమన్నారు. వెనుకబడిన కులాల, విమ్మజాతుల సాంఘికాభివృద్ధి మన జాతీయ స్వాతంత్ర సంగ్రామంలో ముఖ్యమైన అంశం కదా! అటువంటి చారిత్రాత్మకమైన పోరాటాన్ని ఉపేక్షించి, కేవలం ప్రాథమిక హక్కులను దృష్టిలో వుంచుకొని సాంఘికాభివృద్ధికి దోహదమైన శాసనాలను కొట్టిపారేయడం ఏమంత ఔచిత్యం?

జమీందారీతనాన్ని రద్దుచేసినప్పుడు న్యాయస్థానాలు ఇదే వైఖరి నవలంభించాయి. ఆస్తిహక్కు ప్రాథమికహక్కు అని భావించారేకాని, రాజ్యాంగంలో పేర్కొన్న ఆదేశ సూత్రాలను గమనించలేదు. స్వర్గీయ నెహ్రూ "ప్రాథమిక హక్కులకు, ఆదేశ సూత్రాలకు ఘర్షణ ఏర్పడితే, ఆదేశ సూత్రాలదే పైచేయిగా వుండాలని" సెలవిచ్చారు.

కాని న్యాయనాలు ఆస్తిహక్కును ప్రాథమికంగా భావించి, ప్రభుత్వానికి అధిక ధననష్టం కలుగజేసాయి. ఏదైన ఆస్తిని ప్రభుత్వం జప్తుచేసినప్పుడు, నష్టపరిహార విషయంలో, మార్కెటు విలువకు తగినంత, యివ్వవలెనని, కోర్టు యిచ్చిన తీర్పును, వమ్ము చేయడానికి, రాజ్యాంగపు నాల్గవ సవరణ జరుపబడింది. ఆ సందర్భంగా ప్రసంగిస్తూ, స్వర్గీయ గోవింద్ వల్లభ్‌పంత్ సుప్రీమ్‌కోర్టు సంకుచిత ధోరణిని, సోదాహరణంగా వివరించారు.

(a) పశ్చిమ బెంగాల్‌లో, పాకిస్థాన్‌నుండి తరలివచ్చిన కాందిశీకులకై ప్రభుత్వం భూమిని జప్తుచేసుకొంది. ఈ భూమిని స్వంతందారు రెండవ ప్రపంచయుద్ధంలో అతి చౌకగా కొన్నారు. అయినప్పటికిని ప్రభుత్వం, ఆ ధరకు ఐదురెట్లు ఎక్కువ యివ్వడానికి సిద్ధపడింది. కాని కోర్టువారు, ప్రభుత్వ కష్టనష్టాలు గమనించక స్వంతదారులకు మార్కెటు ధరకు సరిఅయిన ధర చెల్లించాలని తీర్పు యిచ్చారు. వాస్తవానికి, నిరాశ్రయుల రాకవల్ల ధరలు హెచ్చిపోయాయి. అటువంటప్పుడు, ఒక మానవతా కార్యానికి, అతి చౌకలో కొన్న భూమికి, అతి ఎక్కువ ధర చెల్లించమనడం, న్యాయం కావొచ్చునేమో కానీ, ధర్మం కాజాలదు. అది సాంఘిక నేరం.

(b) బస్సు రూట్ల జాతీయకరణ విషయంలోకూడా న్యాయస్థానం ఈ మూఢవైఖరిని అవలంబించింది. బస్సురూట్లు జాతీయం చేయబడ్డాయి. కానీ బస్సు ఓనర్లు తమ బస్సులను యధేచ్ఛగా ఆరూట్లపై నడుపవచ్చు. వారి బస్సులు ప్రభుత్వం తీసుకోలేదు. అయినప్పటికి సుప్రీమ్‌కోర్టువారు, ఓనర్లు ఈ రూట్లను "వాడేవారు" కాబట్టి వారు దానికి స్వంతందార్లని, వారికి పూర్తి నష్టపరిహారం చెల్లించమని ఆదేశించింది.

ఈ సందర్భంగా శ్రీ పంత్ ఈలా అన్నారు: "ఉదాహరణానికి, ప్రభుత్వం ఒక వ్యక్తివద్దనున్న గంజాయివంటి వస్తువులు జప్తుచేసింది. ఈవ్యక్తి కోర్టులో తాను ఆ వస్తువులకు "స్వంతందారుని" బుజావుచేస్తే కోర్టువారు అతనికి పూర్తి నష్టపరిహారం చెల్లించమనవచ్చు!"

స్వర్గీయ సుబ్బారావుగారు గోలక్‌నాథ్ కేసులో, పార్లమెంటు ప్రాథమిక హక్కులను సంకుచిత పరచజాలదని సెలవిచ్చారు. ఇది వాస్తవానికి సాంఘికాభివృద్ధికి ఒక ఫుల్‌స్టాప్ వంటిది. ఇదే తీర్పును రిట్రాస్పెక్టివ్‌గా యిచ్చివుంటే, స్వతంత్రం వచ్చిన తర్వాత చేసిన సాంఘికాభివృద్ధి చట్టాలన్నీ (ఉదా: జమీందారీ రద్దు మొ॥) మూలబడివుండేవి. ఈ తీర్పు ననుసరించి పార్లమెంటు గుత్త వ్యాపార సంస్థలను, భూస్వాములను, స్మగ్లరులను ఏమీ చేయజాలదు. ఏ చట్టమైనా — స్మగ్లర్ల ఆస్తిని జప్తుచేయడం — రాజ్యాంగ బద్ధం కాదని కొట్టివేయవచ్చు. కాబట్టే సవరణలు అవసరమొచ్చాయి.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో పార్లమెంటు సర్వాధికారమైనది. శాసనాలు సాంఘికాభివృద్ధికై చేయబడినప్పుడు, న్యాయస్థానాలు కొంత ఉదారస్వభావాన్ని వ్యక్తపటిచడం అవసరం.

రాజ్యాంగం ప్రజల మేలుపై కొన్ని ఆశయాల సంసిద్ధికై రూపొందింపబడిందికాని, దాని ఆధారంగా సాంఘికాభివృద్ధిని కుంటుపటిచే స్వార్థపరులకు కాదు. ఈనగ్న సత్యాన్ని న్యాయస్థానాలు గుర్తిస్తే ఎంతోమేలు.

— డా॥ మురళీకృష్ణ

అక్టోబరు నెల భారతిలో 'సామాన్యుని సందేశము' పుస్తకము సమీక్షించిన మ. కో. రా. రె. గారు ఒకచోట "ఒక చెంప కొడితే రెండోచెంప త్రిప్పు" అన్న ఏసుక్రీస్తు వాక్యం నపుంసకవాదం అనడం భావ్యంకాదు. ఆ వాక్యం అన్న క్రీస్తు తన్ను హింసించిన వారిని చూచి జాలిపడి వారిపాప పరిహారార్థమై దేవుణ్ని ప్రార్థించాడట. అట్టి మహనీయుడు ఇంకొక చెంపకొట్టుమని శత్రువుకు చూపించుటలో అనంత అర్థముంది. అశక్తతవలన ఆమాట అన్నాడనుకోవడం భావ్యంకాదు. పరుషహృదయములను సంస్కరించుటలో ఎన్నోమార్గములు కలవు. అందులో ఇదో యత్నం. అది...కొందరి విషయంలో విఫలం కావచ్చు. అంత మాత్రాన ఆ వాక్యాన్ని నపుంసక వాదం అనడం నాకు భావ్యమనిపించుటలేదు.

— శ్రీ హెచ్. హరిశ్చంద్రారెడ్డి

1976 అక్టోబరు నెల భారతిలో ప్రకటితమైన "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" అను నా వ్యాసములో 51 వ పుటలో మొదటి కాలము 26 వ పంక్తిలోను, రెండవ కాలము ఆరవ పంక్తిలోను శ్రీ బి. ఎన్. రెడ్డి అను పదమునకు బదులు శ్రీ బి. ఎన్. శాస్త్రి అని, అదేపేజీలో రెండవ కాలము 21 వ పంక్తిలో శ్రీ రెడ్డి అను పదమునకు శ్రీ శాస్త్రి అని సవరించి చదువుకోవలెను. పొరపాటు దొరలినందులకు చింతిల్లుచున్నాను.

— శ్రీ వై. వి. రమణ

## ఒక సవరణ

అక్టోబరు 1976 భారతిలో నా వ్యాసము "అభిజ్ఞాన శాకున్తల నాటకము" (ఆంధ్రానువాదానుశీలనము) అను శీర్షికతో ప్రకటింపబడినది. అందు ఉదాహరణములుగా గొనబడిన శ్లోకాలలో మొదటిదైన—అంకము 5—శ్లో 22 :-

"స్త్రీణా మశిక్షిత పటుత్వ"మిత్యాది శ్లోకానికి నా అనువాదమును చూపునపుడు పొరపాటున ప్రస్తుత ముద్రిత పద్యము గ్రహింపబడినది.

భారతి—పుట 37— తే. గీ॥ అతివల......మొదలైనది— ఆ పద్యము చిఱుమార్పులతో క్రిందివిధముగా ఉండవలసినది.

ఈ ప్రమాదమునకు సహృదయులు నన్ను మన్నించగలరు:—

ఉండవలసిన పద్యమిట్లు :-

తే. గీ॥ స్త్రీల సహజ ప్రతిభ మానుషేతరలనె
దృశ్యముగ, బోధితలఁ జెప్పవేల? యాత్మ
జతతి యెగురుదా కితరద్విజ ప్రకర సు
పోషిత మొనర్చుఁ గద పరపుష్ట సమితి!

—శ్రీ మల్లాది సూర్యనారాయణమూర్తి

# గ్రంథ విమర్శలు

## భారతనారి : నాడు-నేడు :

[రచన : ఇల్లిందల సరస్వతీదేవి ; ప్రచురణ: యువభారతి: సాహితీ సాంస్కృతిక సంస్థ : 5, కింగ్స్‌వే, సికింద్రాబాద్-3]

సరసమైన ధరకు 'సరస'మైన సాహిత్యాన్ని అందించే ప్రయత్నంలో యువభారతి వెలువరించిన పుస్తకం ఇది.

తొలిమాటలో అధ్యక్షులు పేర్కొన్నట్లు శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు, ఆంధ్ర పాఠకలోకానికి చిరపరిచితులు. వేదకాల మాదిగా, ఈనాటివరకూ సమాజంలో స్త్రీ స్థితిగతులను విమర్శనాత్మకంగా పరిశీలించారు శ్రీమతి సరస్వతీదేవిగారు, ఈ వ్యాస సంపుటిలో.

వేదాలలో, ఉపనిషత్తులలో, స్మృతికాలంలో స్త్రీల పరిస్థితి స ప్రమాణంగా వివరించి, ఆ రోజులలో స్త్రీకి చాలా గౌరవ స్థానముండేదని నిర్ధారించారు. ఆ తరువాత మహమ్మదీయుల కాలంలో, ఆంగ్లేయుల పాలనలో, సంఘంలో వచ్చిన మార్పుల ననుసరించి సమాజం స్త్రీకిచ్చిన స్థానాన్ని పరిశీలిస్తూ, శ్రీ రాజారామమోహన రాయ్, శ్రీ వీరేశలింగం మొదలైనవారి సేవను కూడా పేర్కొన్నారు.

ఆ తరువాత స్వాతంత్ర్య సమరంలో స్త్రీలు నిర్వహించిన పాత్రను వివరించారు. స్వతంత్ర భారతంలో ప్రభుత్వం చట్టరీత్యా స్త్రీలకు కలిగించిన సదుపాయాలను తెలియజెప్పారు.

సాధించిన అభ్యుదయాన్ని సింహావలోకనంచేస్తూ ఆధునిక యువతి సుఖసంతోషాలతో జీవితం గడపటం లేదని తేల్చి, అందుకు కారణమైన ఆర్థిక, సాంఘిక పరిస్థితులను సమీక్షించి ఈనాటికీ పరిష్కరించుకోవలసిన సమస్యలెన్నో ఉన్నాయని ఎత్తి చూపారు. స్త్రీలైనా, పురుషులైనా, సమన్వయ దృక్పథంతో పరస్పరం సహకరించుకొన్నప్పుడే సుఖజీవితం గడపగలరని ముగించారు.

21-22వ పేజీలలో "స్త్రీలకు స్వాతంత్ర్యము కొన్ని విషయాలలో, కొన్ని సందర్భాలలో అంగీకరించలేదన్న అపవాదు ఒకటి ఉన్నది. వారు ఏ ఏ సందర్భాలలో ఎందుకు చెప్పారో వివరంగా తెలియదు. కొన్ని సూక్తులు మధ్యలో ఎవరయినా చేర్చినా చేర్చవచ్చు. వాటిని గురించి ఎంత పరిశోధన చేసినా, ఇప్పుడు తేలే విషయముకాదు. ఒకవేళ నిజమనుకున్నప్పటికీ అంతమాత్రంచేత ఆమెకు గౌరవం లేదనుకోవటం పొరపాటు-" అనే వాక్యాలు ఒకదానికొకటి పొందకుండా ఉన్నాయి. ప్రాచీనకాలంలో స్త్రీల నేమాత్రమూ చిన్నచూపు చూడలేదనినిరూపించే ఉద్దేశంతో, వ్రాసారా, రచయిత్రి ఈ వాక్యాలను ?

ఇవి కేవలం ఊకదంపుడు ఉపన్యాసాలు కావు. విషయ పరిజ్ఞానం నిండిన వివరణాత్మక వ్యాసాలు. ప్రతి విషయాన్నీ స్పష్టమూ ణంగా, సరళమైన శైలిలో పాఠకుల ముందుంచిన రచయిత్రి కృషి ప్రశంసనీయం.

ఈ పుస్తకంద్వారా అల్పమైన ధరకు అమూల్యమైన సాహిత్యాన్ని అందరికీ అందుబాటులోకి తేగలిగిన యువభారతి సంస్థ అభినందనీయం.

— ఆనంద

## సూర్యమల్ మిశ్రన్ (జీవితచరిత్ర)

[రచన : విష్ణుదత్‌శర్మ. పుటలు : 37. వెల : రు. 2-50. ప్రచురణ : కేంద్ర సాహిత్య అకాడమీ—న్యూఢిల్లీ,]

'భారతీయ సాహిత్య నిర్మాతలు' అనే శీర్షిక కింద కేంద్ర సాహిత్య అకాడమీ, భారతీయ భాషల్లోని వివిధ పురాతన—అధునాతన సాహితీ వేత్తలపై ఇంగ్లీషులో ఈనాటివరకు 33 జీవిత చరిత్రలను ప్రచురించింది. ప్రముఖ భారతీయ రచయితల జీవితం - సాహిత్యం గురించి సంక్షిప్తంగా వెలువడిన ఈ మొనోగ్రాఫ్‌లలో తెలుగు రచయితలుకూడా వున్నారు. డా. కట్టమంచి రామలింగారెడ్డి, పోతన్న, వేమనలపై ఈ వరుసక్రమంలోనే పుస్తకాలు వచ్చాయి.

ఆధునిక రాజస్థానీ సాహిత్య నిర్మాతగా ప్రసిద్ధిపొందిన సూర్యమల్ మిశ్రన్ 19 వ శతాబ్దానికి చెందిన కవి. వీరరసాన్ని పోషించిన మహాకవులలో ఒకరిగా ఆయన పేరు పొందారు. హిందీ భాషా ప్రాంతాలలో రాజస్థానీ సాహిత్యానికికూడా కొంత చరిత్రవుంది—ఆ సాహిత్య చరిత్రలో సూర్యమల్ మిశ్రన్‌కు ప్రముఖ స్థానముంది.

రాజస్థానీ రాజుల ఆస్థానాలలో 'భాట్', 'చారన్' అనేకవులు ప్రధానంగా ప్రబంధాల పక్కిలో కావ్యాలు రచించారు. వారిలో ముఖ్యంగా చారన్ కవులు ఒక చేతితో కత్తి,మరోచేతితో కలాన్ని అంతే వీరోచితంగా—ఉత్తేజితంగా ఉపయోగించారు. ప్రాకృతము, అపభ్రంశ

మనే హిందీ మాండలికాల్లో 'డింగల్' కావ్యమనే ప్రక్రియ రాజస్థానీ సాహిత్యానికి తలమానికమైంది. వీరరస ప్రధానమైన ఆ కావ్యాలలో నరపతి నాల్హా రచించిన ''బీసల్‌దేవ్ రాసో, ఛంద్ బర్దామీ మహా కావ్యం—''పృథ్వీరాజ్-రాసో'' ప్రముఖమైనవి. ఆ కోవలోకే సూర్యమల్ మిశన్ రచించిన 'వంశ భాస్కర్', 'వీర్‌సత్‌సయీ', 'బలవత్ విలాస్' అనే కావ్యాలు వస్తాయి. (సూర్యమల్ ఇతర కావ్యాలు —రామ్ రంజట్, ఛంద్ మయూఖ్. ధాతురూపావళీ, సతీరాసో)

రాజస్థాన్‌లోని 'బూందీ' రాజ్యంలో సూర్యమల్ పూర్వీకులు ఆస్థాన కవులుగావుండేవారు. 19వ శతాబ్దపు ప్రారంభంలో జన్మించిన సూర్యమల్ రాజాశ్రయంలో వుంటూనే బ్రిటీషు ఆధిపత్యాన్నికూడా చూసాడు – బూందీ రాజైన మహారావ్ రామ్‌సింగ్ దర్బార్‌లో సూర్యమల్ వంశపారంపర్యంగా వచ్చిన మహాకావ్య సాంప్రదాయాన్ని సుస్థిరం చేసాడు.

మహారావ్ రామ్‌సింగ్ ఒక బ్రాహ్మణ పండితుడు సంస్కృత 'మహాభారతాన్ని' గానంచేయగా విని ఉత్తేజితుడైనాడు. లోక భాషలో తమ వంశ చరిత్రను (చౌహాన్ అనే క్షత్రియుల) కూడా మహాభారత కావ్య పద్ధతిలో వ్రాయవలసిందని సూర్యమల్‌ను కోరాడు. ఆరు భాషల్లో వైదుష్యాన్ని ఆర్జించి 'మిశన్' అనే గౌరవ ప్రదమైన బిరుదును పొందిన సూర్యమల్ అంగీకరించాడు. ఆనాడు వ్యవహారంలో వున్న వివిధ ఛందస్సులలో ఉదాహరణకి— దోహా, వైతల్, పద్ధారీ, త్రిభంగీ, భుజంగీ, భుజంగ్ ప్రయాత్‌లలో సూర్యమల్ కావ్యాలు రచించాడు. వాటిలో మహాకావ్యంగా ప్రారంభమైన 'వంశ–భాస్కర్' అసంపూర్ణంగానే నిలిచిపోయింది. రాజాశ్రయాన్ని పొందినప్పటికి తన అభివ్యక్తి—స్వేచ్ఛనుమాత్రం ఆయన అమ్ముకోలేదు. ఫలితంగా మహారావ్ రామ్‌సింగ్ జీవితంలోని చీకటి తెరలను వర్ణించబూనుకునే సరికి రాజా అయిష్టతను వెల్లడించాడు. సూర్యమల్ తనకు కేవలం శ్లాఘించడం మాత్రమే సాధ్యంకాదని కావ్యరచనను విరమించాడు – తన ఆత్మగౌరవాన్ని నిలుపుకున్నాడు.

''తన కావ్యాలు అగ్నిజ్వాలలై ఒక్కొక్క పదాన్ని మండించి రసపుత్ర వీరులను జాగృతంచేసే శకలా''లని తన కవిత్వం గురించి స్వయంగా ఆత్మవిశ్వాసంతో వర్ణించుకున్నాడు సూర్యమల్. 'శత్రువు పాదాలకింద అణిగిన దేశంలో—జీవితానికి ఆనందమనేది లేదని' బ్రిటీషు ఆధిపత్యాన్ని బాహాటంగా ఖండించాడు. జీవితాంతం దేశభక్తి, వీరరస పోషణ, త్యాగమనే విలువలకే తన కావ్యాలలో చోటు ఇచ్చాడు.

''దారిద్ర్యాన్ని, దౌష్ట్యాన్ని
నిరంకుశత్వాన్ని నిరంతరం
దోపిడీకింద అనుభవించే దీనులకు
ఆశ్రయమిచ్చేవాళ్ళందరికి
నేను వంగి నమస్కరిస్తాను''

అని గుండెబలంతో చెప్పిన సూర్యమల్ మిశ్రన్ ఈనాటికి ఆదర్శకవి. ఆయన జీవితాన్ని–కావ్య ఇతివృత్తాన్ని ఇంగ్లీషుద్వారా ఇతర భాషీయులకు అందజేసిన విష్ణుదత్‌శర్మ అభినందనీయుడు.

— హంసవివేక్.

# పార్వతీ ప్రతీకారం

[పార్వతీ ప్రతీకారం రచయిత : మురయా. (ఆగష్టు 15 1975) (వెల పేర్కొనలేదు) పుటలు 216. ప్రతులకు దేశి ప్రచురణలు, నారాయణగుడా, హైదరాబాదు.]

''పార్వతీ ప్రతీకారం'' మురయా రచించిన తెలుగు నవల. నేడు పుంఖాను పుంఖాలుగా వస్తున్న సాంసారిక ప్రేమ ముచ్చట్లతో నిండిన నవల కాదిది. ఒక విశిష్టమైన కథాకథనంతో, దేశభక్తిపూరితమైన భావాల కల్పనతో, సహజమైనసన్నివేశాలతో కూడిన నవల.

నేటి విద్యార్థి జీవనం, సాంఘిక రాజకీయ పరిస్థితులు ఈ నవలలో బాగుగా ప్రతిబింబించాయి. ''సహృదయ సంవేదనము'' అన్న పేరుతో ఈ నవలకు మున్నుడి వ్రాసిన శ్రీ పోణంగి శ్రీ రామ అప్పారావు 'పార్వతీ ప్రతీకారం' ''భారత నారీమణి ప్రాణానికి ప్రాణం మానం''. ఆ మానభంగానికి ఒడిగట్టిన నరరూప రాక్షసులపై ప్రతీకారం తీర్చుకొన్నది పార్వతి అని ఈ నవలలోని సారాంశాన్ని వివరించారు. ఈ నవలలో వనజ, కామేశ్వరి, పార్వతి, మోహన్ ప్రధాన పాత్రలు. మోహన్, వనజ కామేశ్వరి కళాశాలలో విద్యార్థులుగాఉన్నదశలో కథ ప్రారంభం ఔతుంది. మోహన్ మొదటినుండి దేశభక్తి పూరితుడైన ఉన్నతాదర్శ ప్రియుడైన యువకుడు. కామేశ్వరి బీద కుటుంబానికి చెందినది. తన ఆర్థిక పరిస్థితులకు అసంతృప్తి చెందక వానికి తగినట్లే తన వేష భాషలు మలచుకొనేది. వనజ కలవారి బిడ్డ. మొదటలో నాజూకుగా వానికి తగిన వేషభాషలతో ఉండేది. మోహన్ చదువు సంధ్యలలో, ఆటపాటలలో, నడవడికలో ఉన్నతస్థాయిలో ఉండేవాడు. అందువలన వనజ, కామేశ్వరి అతనిపట్ల ఆకర్షించబడ్డారు. విద్యార్థి దశలోనే దేశభక్తిని పెంపొందించుకొన్నాడు. తన సత్ప్రవర్తనవల్ల వనజ కుటుంబంలోను, కామేశ్వరి కుటుంబంలోను అతనిపట్ల ఆప్యాయత పెరిగింది. వనజ తండ్రి జగన్నాథం అతని దేశభక్తికి విజ్ఞానానికి ముగ్ధుడౌతాడు. కామేశ్వరి తల్లి పంకజమ్మ అతని మంచితనాన్ని అవగాహన చేసికొంటుంది. మోహన్ జగన్నా

ధంతో రాజకీయాలు ముచ్చటిస్తున్నప్పుడు పంకజమ్మ గాన విద్వత్తును ప్రశంసిస్తాడు. కాని వనజ, కామేశ్వరుల మధ్య మోహన్‌పట్ల ఆసక్తి కొంత అసూయను కూడ రగుల్కొలుపుతుంది. మోహన్‌కు మాత్రము వారిద్దరిని నవనాగరికతయొక్క వెర్రి వ్యామోహాల పాలు కాకుండా సరిదిద్దాలనే సద్భావనమూ, అభిమానమే కాని వారిపట్ల ఇతరమైన ప్రేమలేదు. ఈ పరిస్థితులలో మోహన్ జీవితంలో పార్వతి సాక్షాత్కరిస్తుంది. అప్పటినుండి కథలో క్రొత్త మలుపు ప్రారంభమౌతుంది. పార్వతి మోహన్ తండ్రి కర్నల్ రావుగారి మేనకోడలు. మోహన్ ఆమెను పెండ్లి చేసుకోవాలనుకొన్నాడు. కాని కాశ్మీర్ యుద్ధ సంఘటనలలో దుర్మార్గులు ఆమె శీలం దోచుకొన్నారు. అందువలన తాను వివాహానికి అనర్హురాలనని నిశ్చయించుకొని తనకు మానభంగమూ, భారతదేశానికి ముప్పు కలిగించిన శత్రు దురంతకులను నాశనం చేసి, ప్రతీకారం తీర్చుకోడానికి దీక్షపూనింది. దానికి కావలసిన శక్తిసాధనలు సంపాదించడానికి కఠోర తపస్సుచేసినది. రణ వైజ్ఞానిక తంత్రాలలో ప్రావీణ్యము సంపాదించింది. తన ప్రతీకార్యచర్య పరిపూర్ణంగా సఫలం కావడానికి దేశభక్తుడై తన్నారాధించే మోహన్‌ను తగిన ఆయుధంగా తయారుచేసింది. దీనిలో కామేశ్వరి సాయం చేస్తుంది. భారత్, పాక్ యుద్ధసమయాన్ని అదనుగా చేసికొని పార్వతి, మోహన్ తమ ప్రాణాలను త్యాగంచేసి విరోధుల రాడార్ కేంద్రాన్ని ఆత్మవిధ్వంసక విమానాన్ని ప్రయోగించి నాశనం చేస్తారు. ఈ కీలక చర్య పాకిస్తానీయుల ఓటమికి, భారత విజయానికి కారణమౌతుంది. పార్వతి ప్రతీకార చర్యతో, మోహన్ ప్రాణత్యాగ చర్యతో మాతృదేశ రక్షణ జరుగుతుంది.

ఈ నవలలో కళాశాల విద్యార్థుల జీవితంలోని వాస్తవ స్థితిగతులు, తెలుగుదనపు తీరుతెన్నులు, ఆధునిక యుద్ధ విధానాలు ఆ యా సందర్భాలలో మురయా చక్కగా చిత్రించారు. విద్యార్థుల సినిమావ్యామోహం, తెలుగుదేశంలో త్యాగరాజోత్సవాలు, నవ్యాంధ్ర కవితలోని ఎంకిపాటలు, స్వాతంత్ర్యోద్యమ రాజకీయాలు ఆంధ్రుల జీవితంలో కొన్ని ఆధునిక పరిస్థితులను ప్రతిబింబింపచేసారు. మోహన్ జీవితం కొంతవరకు వాస్తవికతకు దూరంగాఉన్నా యువకులకు ఆదర్శప్రాయంగా ఉంది. ప్రేమఘట్టాలు ఉదాత్తస్థాయిలో నడిచినాయి. తెలిసీ తెలియని వయస్సులో ప్రేమకలాపాలలో కాలుజారిన వారి జీవితాలతోను, పరిస్థితుల వర్ణనలతోను నిండి ఒకే వస్తువు పేర్మార్పిడితో పెక్కు గ్రంథాల రూపంలో చౌకబారు నవల సాహిత్యం అనుక్షణం పుట్టుకొనివచ్చే ఈ రోజులలో మురయాగారి నవల క్రొత్తదనంతో కొంత వైవిధ్యాన్ని, విభిన్నానుభూతిని పఠితలకు కలిగిస్తుంది. మురయా కలంనుండి వచ్చిన యీ నవల నైతిక జీవితము విలువలపట్ల ఆసక్తి కలవారిని అలరిస్తుంది.

## మురయా కథలు "ఇహం పరం"

["ఇహం - పరం" రచయిత మురయా (దీపోత్సవం 1975) పేజీలు 272. వెల : రు 12-50.]

మురయా కథలు ఆంధ్ర పాఠకలోకానికి చిరపరిచితాలు. ఇదివరలో 'సిల్కుచీర'(1966) 'మంచిమనిషి' (1967) 'నిత్యమల్లి' (1968) అనే మూడు సంపుటాలుగా వెలువడ్డాయి. ఇది నాల్గో సంపుటం దీనిలో ఇహం పరం, వారసుడు స్వాధీన మృత్యువు, భయస్తుడు, ఉపాయం, గాలిగోపురం, అతనికంటె ఘనుడు, దాగినసత్యం సాధన, ఆత్మార్పణ, రసభంగం, ప్రయివేటు మాష్టారు, నమ్మకస్తుడు, తనదాకావస్తే, మమత, ఏగాలో దర్శా అనే 16 కథలున్నాయి. వానిలో ఇహం పరం మొదటి కథ. దానినే ఈ సంపుటానికి పేరుగా పెట్టారు. ఈ కథలో ఇహంలో చాలకాలం తనకు దూరమైన భర్త సాహచర్యం చివరిదశలో లభ్యమయ్యేటట్లు కనపడినా, ప్రలోభపడక పరాన్ని సాధించడానికి దీక్ష తీసికొన్న విశిష్ట వ్యక్తి శారదపాత్ర చిత్రణంద్వారా భార్యలను నిర్లక్ష్యంచేసే భర్తలకొక గుణపాఠం రచయిత తెలుపుతాడు. వారసుడు కథావస్తువు మామూలు ధోరణిలో కనపడే అక్రమ సంబంధ సంతానానికి సంబంధించిన ఇతివృత్తమే. స్వాధీన మృత్యువు కథతో ఆధ్యాత్మిక బలం సంపాదించిన నరసయ్యవంటి వ్యక్తికి మృత్యువే స్వాధీనంలో ఉంటుందన్న సత్యం ప్రస్ఫుటమౌతుంది. భయస్తుడుకథలో భయంయొక్క ఛాయలు కొన్ని కొన్ని జీవితాలలో ఎలా ఉంటాయో ఎలాంటి పరిణామాలు (మంచివీ చెడ్డవీ కూడ) తీసుకువస్తాయో కమల విచిత్ర జీవితం వ్యక్తం చేస్తుంది. 'ఉపాయం' కథ లోకంలో ధనార్జన పరుల తెలివి తేటలు వాస్తవానికి చాల దగ్గరరీతిలో తెలుపబడ్డాయి. కోటయ్య కొడుకు భద్రయ్య ఉపాయపరుడై వ్యాపారంలో తండ్రినిమించిన తనయుడౌతాడు.

గాలిగోపురం కథలో నిజాయితీపరుడు గాలిగోపురంవలె ఎంత మహోన్నతంగా జీవిస్తాడో, తన నిజాయితీకి దెబ్బ తగులుతుందని ఊహిస్తే ఎంత క్రుంగిపోతాడో కుటుంబరావు కథ నిరూపిస్తుంది. తాను ఆలయానికి చేస్తానన్న దానం భార్య చౌర్యం మూలంగా చేయలేకపోయినందుకు, ముఖ్యంగా మాటదక్కించుకొనలేకపోయినందులకు, కించపడి తట్టుకోలేక ప్రాణాలు పోగొట్టుకుంటాడు హృదయాన్ని తట్టి కదలించే దయనీయగాథ అతని కథ. 'అతనికంటె ఘనుడు', 'కలసివచ్చిన—నా కారు' అనే కథలు కాలక్షేపానికి చదువుకోదగ్గవిగా ఉన్నవి. 'దాగిన సత్యం' కథలో శాంత అవివేకంతో దాచిన సత్యం ఆమె భావ సత్యానికి ప్రాణాంతకమై కథ దుఃఖాంతం చేసింది. ఆధ్యాత్మిక విలువలకు చెందిన కథలలో 'సాధన' ఈ సంపుటంలో

రెండవకథ. 'ఆత్మార్పణ'కథలో సాహసియైన బండ్ల కోటయ్య చంద్రమ్మ అనే యువతిని లోబరచుకొని తర్వాత వివాహం చేసికొంటాడు అతని జీవితం సాహస చర్యలతోనిండి ఉంటుంది. వ్యాపారం చేసినా, జాతీయోద్యమంలో దూకినా అతనిది ప్రతిచోటా ముందడుగే. కాని చివరి దశలో తనకు, చంద్రమ్మకూ, శాంతికోసం రాజకీయోద్యమంనుండి విరమించి విదేశీయ ప్రభుత్వానికి లోబడి క్షమాభిక్షకు సిద్ధపడ్డాడు. కాని విధి అన్యథా తలచింది. అతడు పోలీసుల అనాలోచిత చర్యకు ఆహుతి అయిపోయినాడు. భార్య చంద్రమ్మ నిరాడంబర జీవితంతో దేశసేవా కార్యక్రమంలో నిమగ్నం ఔతుంది. ఇది ఆత్మార్పణకథ. 'రసభంగం'లో శారద విచిత్ర ప్రవర్తన రసభంగానికి కారణమౌతుంది. 'నమ్మకస్తుడు' కథ బడిపంతులు జీవితంలోని అవస్థలను చిత్రించే కథ. 'తనదాకా వస్తేకాని' అనే కథ మానవుడు ఇతరులపట్ల చూపే క్రౌర్యం, బాధ, తనదాకా వస్తేగాని ఎలాగు తెలిసిరాదో చాల సహజంగా వివరిస్తుంది. 'మమత'కథ స్త్రీల స్వభావంలో ఉండే ఒకవిధమైన మమకారాన్ని 'దగాలోదగా' అన్న కథ బాహ్య వేషాలతో చేసే మోసాన్ని, దానికి గురైన వ్యక్తుల మానసిక వ్యథను చిత్రంగా సూచిస్తుంది.

మురయా కథలలో కథన చాతురియేకాక కవితా రీతులుకూడ కనపడుతుంటాయి. నేటి కథాసాహిత్యంలో ఇది గమనార్హమైన విశేషం. అవకాశమున్నచోట్ల జాతీయ భావాలు చొప్పిస్తాడు. స్థానిక విశేషాలు ఉపమానాలలో కూడ చోటు చేసుకుంటాయి. ఉదా: జాగర్లమూడి తమలపాకుల్లా ఉన్న 'ఆమె చెక్కిళ్ళపై' సంభాషణలలో సహజత్వం, భావాలలో ఆర్ద్రత, పఠితలను ఆకట్టుకుంటాయి. అయితే కథలన్నీ సమస్థాయిలో లేవు. మొత్తంమీద ''ఎవరయా మురయా'' అని ముందైతే ఎవరయినా అనుకునేదే మళ్లీ వాళ్లే చివర అనుకుంటారు. —'మురయా గొప్ప' తెలుగు కథకుడు అని'' వ్రాసిన శ్రీ పోరంకి దక్షిణామూర్తి మాటలు కేవలం అభిమానంతో కూడిన అతిశయోక్తులు కావనపిస్తుంది.

*—శ్రీ వై. వి. రమణ*

# మన స్వాతంత్ర్యోద్యమం

[బొమ్మలకథ. క్రౌన్ ఆక్టోవో సైజు. 45 పుటలు. గట్టి అట్టబైండు. వెల రూ 3-50. ప్రచురణ డైరెక్టర్ పబ్లికేషన్స్ డివిజన్, భారత ప్రభుత్వ సమాచార ప్రసారశాఖ, పటియాలా హౌస్, న్యూఢిల్లీ. ప్రాంతీయ కార్యాలయం, శాస్త్రి భవన్, 35, హెడ్డోస్ రోడ్, మద్రాసు-6.]

రెండువందల ఏళ్ళ క్రిందటివరకూ భారతదేశం స్వతంత్ర దేశంగా ఉండినది. దేశంలోని వివిధ ప్రాంతాలు స్వతంత్ర ప్రతిపత్తి కలిగి వుండేవి. కాని 1757 ప్రాంతంలో ఈస్టిండియా కంపెనీ వారు వచ్చి, మనదేశంలో తిష్ఠ వేసుకుని కూర్చోడమే కాకుండా రాజులకు పరస్పర కలహాలు పెట్టి విడదీసి వారి రాజ్యాలు ఆక్రమించుకోవడం ప్రారంభించి క్రమంగా దేశమంతటినీ స్వాధీనం చేసుకున్నారు. అప్పుడే స్వాతంత్ర్యోద్యమానికి బీజావాపం జరిగింది. సిపాయీల పితూరీతో విజృంభించింది. స్వాతంత్ర్య సంపాదనకు పెక్కు మార్గాలు అవలంబింపబడినవి. ఎందరో ఎదురు తిరిగారు. చాలామంది అసువులు కోల్పోయారు. బ్రిటిష్‌వారి దమన నీతి ఉద్యమాన్ని అణచలేకపోయింది. గాంధీమహాత్ముడు అహింసాపద్ధతిని శాంతియుత సమరం సాగించి స్వాతంత్ర్యాన్ని సాధించాడు.

మన స్వాతంత్ర్యోద్యమ గాథ అందరూ తెలుసుకోవలసినదే! దీన్నిగురించి యిదివరకే ఎన్నో పుస్తకాలు చిన్నవీ, పెద్దవీ మన దేశంలోని అన్ని భాషలలోనూ వెలువడి ఉన్నాయి. కాని, అవి అన్నీ అందర్నీ ఆకర్షిస్తాయని చెప్పలేము. కొన్ని కొందరికే ఉపయోగిస్తాయి. కొన్ని కొందరికే నచ్చుతాయి.

ఏదయినా విషయం వ్రాతమూలంగా బోధించడంకంటె చిత్రాల మూలంగా తెలిపితే మనస్సుకు బాగా హత్తుకుంటుంది. ఈ విషయాన్ని గ్రహించి సుప్రసిద్ధ చిత్రకారులు ఎస్. డి. సావంత్ గారు మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రను 1757 నుంచి 1947 లో మనకు స్వాతంత్ర్యం లభించేదాకా వివరణలతో కూడా రెండువందలకు పైగా ఉన్న రంగుల చిత్రాలలో చూపారు. వీరు యిదివరలో పిల్లల కెంతో ఆసక్తిని కలిగించే పద్ధతిని గాంధీజీ బొమ్మల కథనూ, జవహర్‌లాల్ నెహ్రూజీ బొమ్మలకథనూ రూపొందించి యిచ్చిన జంట రచయితలలో ఒకరు. ఈ బొమ్మల కథను రూపొందించడానికి ప్రత్యేకంగా నియమింపబడ్డారు. రెండు శతాబ్దాల క్రితం కంపెనీ పాలనతో ప్రారంభమై 1947 ఆగస్టు 15వ తేదీ స్వాతంత్ర్యం వచ్చేవరకూ ఉద్యమంలోని వివిధ దశలూ మిక్కిలి చాకచక్యంతో ఇందులో చిత్రించబడ్డవి. చక్కని వివరణంతో ఇవి ఉన్నందున వీరి చిత్రాలు బాలబాలికలకు ఆ యా సంఘటనలు కళ్ళకు కట్టేటట్లు చేస్తాయి. ఆ యా వ్యక్తుల రూపురేఖలలో అణుమాత్రమూ వ్యత్యాసం లేకుండా ఇలా రంగుల బొమ్మలను చిత్రించడం సామాన్య విషయం కాదు.

భారత ప్రభుత్వం సమాచార, ప్రసారశాఖ పబ్లికేషన్స్ డివిజన్‌వారు యీ రంగుల బొమ్మల కథను తక్కువ వెలకు అందిస్తున్నందుకు వారికి ధన్యవాదాలు సమర్పించవలసి ఉన్నది.

*— "అంగీరస"*

# చలం శ్మశాన సాహిత్యం

[డాక్టర్ నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు; డెమ్మీ 64 పొరటలు. మూల్యం రు. 3/ ప్రతులకు : స్టేట్ బుక్ క్లబ్, 189–3 ఆర్. టి. హైదరాబాదు 500026.]

కామోప జీవనమే లక్ష్యంగా, ఆదిమ ప్రకృతి స్వేచ్ఛగా నడచి, క్రమేణా క్రమబద్ధమైనట్లున్నది. గాలి, నీరువలె స్త్రీని అనుభవించమన్నారు. వాత్స్యాయనునిబోటి మన కామశాస్త్ర నిపుణులు. అసలు ఈ సిద్ధాంతానికి చార్వాకుడే ప్రవక్త అయినట్లున్నది. విచ్చలవిడి పశు ప్రవృత్తిని నియమబద్ధం చేసినది శ్వేతకేతు. కానీ యీ పురుష సంబంధాలు—వాటి విలువలు మారుతునే వస్తున్నవి. పాండు రాజు కుంతితో (సంస్కృతమూలంలో ) ఒక ఆడుదానికి ఒక మగవాడనే పద్ధతితో ఇప్పుడు సంఘం చెడిపోతున్నదని వాపోతాడు. కొంత వరకు మన వాత్స్యాయనుడు, ఇప్పటి హ్యావ్‌లాక్ ఎల్లిస్‌వలెనే ఈ శారీరిక క్షుత్తు ఉపశమన సిద్ధాంతానికి ఒకవిధమైన శాస్త్ర స్థాయిని కల్పించినాడనవచ్చు.

ఇప్పుడు, ఈ వాంఛ అనుభవానికంటె ప్రదర్శనానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడుతున్నది. ఆ నగ్న దృశ్యాలు—విచ్చలవిడి విహారాలు బూతు వ్రాతలు—గుడ్డలు విప్పివేసి వీథులలో పరుగెత్తడం (స్ట్రీకింగ్) సంభోగ చేష్టలు ప్రత్యక్షంగాను, సినిమాలలోను చూచి ఆనందించడం అతి అయిపోయినవి. కాబట్టే సభ్యతా సంఘంలో ఏవగింపు పుట్టుతున్నది.

పూర్వం దీనికి మన ఇంద్రుడు జగజెట్టిగదా! ఆయన ఒళ్ళంతా యోనులైనాయి. ఇవి సుఖరోగాలవల్ల ఏర్పడిన రంధ్రాలేమో! కాని ఇదంతా సహజస్థితి కాదు. పశువుకు మనిషికి తారతమ్యంగా ప్రవర్తించడమే కామభోగానికి పరిమితి అనుకొంటే మానవుడు బాగుపడతాడు, సంఘమూ బాగుపడుతుంది.

ఆంధ్రలో 1920 ప్రాంతాన ఈ స్వేచ్ఛావిహార సిద్ధాంతం ప్రకాశానికి వచ్చినది. కొందరు ఒకాపెతో జంజాటాలు సాగించినారు. కాని మానవ సహజమైన స్వార్థచింత, ఈర్ష్య బయటకు ఉబికి ద్వేషాలు రేగినవి. ఈ నిందలు ఒక తెల్లఆబోతుమీద నల్లటి కందెనతో వ్రాసి ఊరిమీద (కాకినాడ) వదలినారు. ఇప్పుడు ప్రసిద్ధికెక్కిన ఒక కవి "నన్ను విద్యంగ నీరు" అని ఎవరో తన నోరు బలవంతంగా మూసిపెట్టినట్లు కవిత్వంలో విలపించినాడు. చివరకు ఈ సిద్ధాంతం ప్రతిపాదించిన నాయకుడే ఈసుతో ఆత్మహత్య చేసుకొన్నాడు. ఆ సంఘంలో సభ్యుడుగానో సహపాంథుడుగానో గుడిపాటి వెంకటచలం-కథల మూలకంగా బయటికి వచ్చినాడు. మామిడిపండు మొదట ఉన్నరుచిని, చీకంగా చీకంగా కోల్పోయినట్లు ఈయనకు ఈ అనుభవం మొగం మొత్తినట్లయినది. ఉప్పు పులుసు తిన్న కండ కావరం ఉడగగానె దేవునిపై భారంవేసి ఆశ్రమం చేరినాడు. ఇదీ సహజమే!

**చలం కామతత్త్వ విమర్శన...**

చలం స్కూల్‌వారి కామతత్త్వాన్ని విమర్శించే గ్రంథమే డాక్టర్ నిమ్మగడ్డ వెంకటేశ్వరరావుగారి "చలం శ్మశాన సాహిత్యం" అనేది. ఈ పేరు "చంద్రలేఖా విలాసా"ని కంటె ఘాటుగానే ఉన్నది. వల్లకాటికి దారితీసే సాహిత్యమని కాబోలు దీనిభావం. ఎక్కడనో మహారాష్ట్రదేశంలో (నాందేడ్) ఉంటూ, ఒక మందుల డాక్టరు (పి. హెచ్‌డి. కాని లేదుకాబట్టి) ఇంతటి విషయపూర్ణ సహేతుక విమర్శను, భావగంభీరను, భాషాప్రౌఢి ధారవేగం ఓజస్సు గలిగిన తెనుగు వచనంలో వ్రాయడం ఎన్నదగిన విషయం. చలంగారి శైలిని "శబ్ద సౌందర్యమే సాహిత్యమని నమ్మేవారి శరణ్యా"మంటారు వీరు. (24 పొరట) శబ్దసౌందర్యంలో ప్రాణం ఉండేటట్లు చేయడమే కదా సాహిత్య శిల్పం! ఈ గుణం-భావాలతో ఇప్పుడు మనకు పని లేదు-చలం వ్రాతలలో చాలావరకు ఉండి, మొదటినుంచి చదువరికి నోరూరిస్తూనే ఉండినదనక తప్పదు. కాని ఈ "జననేంద్రియాల జనసంస్కృతి-సూర్యాస్తమయ సంస్కృతి, ఆత్మ విధ్వంసక మార్గం" అనడంలో గ్రంథకర్త ఈ ఇంద్రియ తర్పణతత్త్వాన్ని బాగానే నిర్వచించినారు.

బెర్‌నార్డ్‌షా విషయంలో, నిశిత విమర్శకుడు జి. కె. చెస్టర్‌టంర్ ఇట్లా అన్నాడు: "అర్థంగాక అందరూ ఆయన వ్రాతల ఆమోదించినారు, నేను అర్థం చేసుకొని అధిక్షేపిస్తున్నాను" అని. అట్లనే ఈ డాక్టర్ చలం వ్రాతలు అవగాహనకు తెచ్చుకొని ఎదుర్కొని, ఆయన ప్రణయోపాసన సిద్ధాంతాన్ని తునాతునకలు చేస్తున్నాడు. చలం పసితనంలో తండ్రితోబాటు మానవులందరినీ ముఖ్యంగా ఆంధ్రులను (48 పేజి) ద్వేషించే ఒక రోగ గ్రస్తమైన మానసిక తత్త్వంలో ఎదిగినాడు. కాని ఆడుదాని చన్ను, చంక చూచి అప్పుడే లొట్టలు వేయడంవల్లనే ఈ అసహజ కామోపాసనలో, కాదు-ఉన్మాదంలో ఇరుక్కొనిపోయి, శక్తి ఉడుగగానే మమతలుడిగి ఆత్మశాంతికోసరం ఆశ్రమాల ఆవరణాలలో తలదాల్చుకొన్నాడు. ఇదీ డాక్టరుగారి వాదసరళి. ఇది అక్షరాలా నిజం. ఈ పశ్చాత్తాపం-ఆస్కార్‌వైల్డ్ చెరసాలలో డిప్రొఫన్‌డిస్ అనే పుస్తకంలో వెలువరించిన సత్యహృదయ స్పందనమో లేక తాత్కాలికమో ముస్ముందు చూడవలసి ఉన్నది.

డాక్టర్ రావుగారు, చలం సిద్ధాంతాలను ఒక్కొక్కటిగా ఏరి విమర్శించినాడు. చలంలో ఈ విపరీత భావాలను పెంచిన ఆయన

చుట్టూ ఆదిలో అలముకొని ఉండిన వాతావరణాన్ని వర్ణించడం వాదంలో ఒక గురుతరమైన పద్ధతి. ఈ పుస్తకం పూర్తిగా ఆ దారినే నడిచినది. సిగ్మండ్ ఫ్రాయిడ్ వాసనలు ఎట్లా చలంలో పాదుకొన్నవో ఆ పేరెత్తకుండానే వివరించినాడు. చలం స్త్రీపాత్రలు తారాశశాంకంలోనే తార ప్రతిబింబాలే; మగవాడిజోలి అంతగా పట్టించుకోడు ఈయన. మంచిచెడ్డల తారతమ్యం, వాటి వివరణ చలం మనసులో దూరనేలేదు అంటాడు డాక్టర్. ఇంకా, మానవులోని పశుప్రవృత్తినే ఆరాధించినాడు, కాదు ఆదర్శంగా తీసుకొన్నాడంటాడు. నిజమే! కాని నిగ్రహం ఉండే మనిషి బాగుపడుతాడన్న భావమే చలం పుర్రెలో దూరలేదు. ఆనాడు అది, ఇక ఈనాడు తీరా ఒళ్లు ఇల్లు గుల్ల అయిన తర్వాత వైరాగ్య గంధం పట్టించుకొన్నాడు. ఇదీ ఒక మేలనుకొంటానేను; దీనిని డాక్టరు ఒప్పుకొనేటట్లు లేదు.

స్త్రీని బానిసగా చేసినది భూస్వామి తత్త్వమని కమ్యూనిస్టు ధోరణిలో అంటాడు—ఈ రచయిత — ముందుమాటలో డాక్టర్ స్నేహితుడు—చలసాని ప్రసాదరావుగూడ. ఈ ఆలాపనలో, మానవ తత్త్వంలో మంచితనపు ఎత్తు చెడుతనపులోతు అన్ని దేశాలలో, అన్ని కాలాలలో, అన్ని సంఘాలలో, అన్నితెగలలో ఒక్కటేఅన్న నిత్యసత్యాన్ని వీరు గమనం చేసుకొన్నట్లు లేదు. ఇక్కడనే డాక్టరుగారు, నేను చీలు దారులలో పడినాము. ఈశ్వర నిరీశ్వరవాదం అనాదిది. ఇది అనుభవించవలసినదే గాని మాటలలో తేలేదిగాదు. అందువల్ల చలం గురువుల ఆశ్రయించడం మా బోంట్లకు విపరీతంగా గాని, కృత్రిమంగా గాని కనబడటంలేదు. కామి మోక్షకామి అయినా డనుకొందాం. పశుత్వం మానవత్వమై అతీత మానవత్వాన్ని అందుకోగలదని మా విశ్వాసం. మార్పురావడం మనిషికి సహజం; ఇందులో దోషమేమీ లేదు. చలం ఈ దారినబడితే మంచిదే.

“ప్రకృతి స్వయం చలన శక్తిని త్రోసివేసి, ఆ స్థానంలో భగవానుని తెచ్చిపెటినా”డని (64 పేజి) చలం పై రచయిత ఒక సొడ్డు బెట్టుతున్నాడు. ఇది ఈనాటి భౌతికవాదమేకాదు; మన సాంఖ్యులు ‘‘ప్రకృతి ప్రసవధర్మిణి’’ అన్నారు. దీనినే వేదాంతులు గ్రహిస్తూ ఉద్పాదక శక్తిని నడిపే (బీజం వేసే) ఏదో ఒక అతీత శక్తి ఒకటి ఉన్నదన్నారు. డాక్టరు దీనిని ఒప్పుకోకపోతే మునిగిపొయ్యేది ఏమీలేదు.

మెట్టుకు రచయిత తుచ్ఛభోగలంపటను బాగానే విమర్శించినారు. మతిపోయిన ఈ హిప్పీ కాలంలో ఒక మంచివాతావరణాన్నే ఈ పుస్తకం సృష్టించగలదు:

# వైశాలిని

[ నాటకము : శ్రీమాన్ వానమామలై వరదాచార్యులు; డెమ్మి 1/8 – 221 + 60 పేజీలు; వెల రు 15/-; ప్రతులకు : గ్రంథకర్త, చెన్నూరు పోస్టు. వయా మంచిర్యాల; అదిలాబాదుజిల్లా; 504209. ]

ఇది ప్రాచీన సంప్రదాయమును మాన్యవరచి అనుసరించి రచింపబడిన నాటకము. ఆచార్యులవారి ప్రాక్తన సాహిత్యాభిమానం ఇందు మూర్తీభవించినా, ఆధునిక పాఠకునికి వెగటు పుట్టించక పోవడం గ్రంథకర్తగారి లౌకిక పరిజ్ఞానము- కల్పనాచాతురి కారణాలు.

ఆంధ్రరాజధానిలో సాహిత్య వియత్తలము నడిపించే తారలన్నీ ఈ గ్రంథంపై అభిప్రాయాలిచ్చి, తమ సరసతను తెలుపుచూ (60 పొరటలు) ఆచారిగారి సర్వజన ప్రీతిని కలుపుగోలు తనాన్ని బయటబెట్టుతున్నారు. ఈ గుణాలే ఆచారిగారి కవిత్వమును, పాండిత్యమును ఆహ్లాదకరములుగా చేస్తున్నవి.

ఈ వ్రాతలలో మొగమాటం లేదు. గుణమునుబట్టి. వారి దృక్పథాన్నిబట్టి పొగడ్తలు చేసినారు. వీరు నాటక సాహిత్యమును గురించి, యీ రచనను గురించి సహేతుక విమర్శన చేసినారు. రస చర్చగూడా గలదు.

ఈ నాటక కథ మన అన్ని కావ్యాలకు నారుకయ్య (ఆకుమడి) అయిన మార్కండేయ పురాణంనుండే స్వీకరింపబడినది; ఇదేగదా ప్రథమాంధ్ర పురాణం. సంస్కృత నాటకాలలోని నాయికా నాయకులు—విదూషకులు—ప్రణయాలు- విరహాలు-ఋషుల శాపాలు—అన్నీ ఇందు చోటుజేసుకొని ఒక సలక్షణ సాంప్రదాయిక దీర్ఘ నాటకాన్ని రూపొందించినవి. మూలకథకు తమకు ఉచితమని తోచిన కొన్ని మార్పులు చేసిఉన్నారు. ప్రయోగంలో రక్తిగట్టే కొన్ని మంచి సన్నివేశాలున్నవి.

గద్యంలో పద్యంలో ఆచారిగారి సహజధార — పద ప్రయోగ వైశద్యం బాగా విస్ఫారిఉన్నవి. పాత్రపోషణ ఆ కోవవారి దారినే నడచినది. పాత్రోచిత భాష విషయంలోమాత్రం గ్రంథకర్త వెనుక అడుగు వేసినారు. మాండలిక భాష భేదించి అర్థంకాదంటారు. శిష్టవ్యావహారిక-కృతక శైలిలో దీర్ఘ కర్కశ సమాసాలు ఎందరికి అర్థమై చస్తున్నవి? పాత్రలలో క్రిందివారిని పైవారిని వేరుచేసే భాష వాడటం మంచిది కాదంటారు; ఇది అపూర్వ సమసమాజ వాదం! ఈ సిద్ధాంతం కృత్రిమ భాషతోబాటు కృత్రిమ పాత్రలనే సృష్టిస్తుంది-అవక తప్పదు.

నాటికలు విశ్రుంఖలంగా రంగంపై విహరించే ఈనాడు, గాలిలో తేలిపోనటువంటి సరకుగలది ఈనాటకం. ఆ రుచినికోరే వారికి వానవూమల్లె వారు మంచి నాటకాన్ని అందించినారు. ఇది ప్రదర్శనానికి గురుతరము-దీర్ఘము అయ్యేటట్లున్నది.

— శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

## మహోదయము (నాటకం)

[రచన: డాక్టర్ త్రిపురనేని వెంకటేశ్వరరావు ఎమ్. బి. బి. ఎస్. ప్రతులకు: రచయిత, కవిరాజ సాహిత్య విహారము, గుడివాడ, కృష్ణాజిల్లా. వెల: లేదు.]

కొన్ని సంభాషణలు వ్రాసి నాటకములని, ఏకాంకిలని అంటున్న ఈ రోజులలో ఈ రచయిత అలంకార శాస్త్రానుగుణంగా పెడంకముల నాటకం హేతువాద దృష్టితో వ్రాయడం ప్రశంసించ దగిన విషయం. ఇంతేకాక పౌరాణిక ఇతివృత్తాన్ని ఎంచుకొని వర్తమాన సాంఘిక, నైతిక, శాస్త్రీయ విలువల కనుగుణంగా నాటకం వ్రాయడంలోనే రచయిత ప్రతిభ ద్యోతక మవుతున్నది.

ఈ నాటకంలోని ఇతి వృత్తానికి మూలం తిక్కనసోమయాజి రచించిన భారత (ంలోని) విరాటపర్వము. అయితే ఆ ఇతివృత్తంలో ఈ కవి గణనీయమయిన, వాంఛనీయమైన మార్పులు ప్రవేశ పెట్టారు. ఉత్తర గోగ్రహణం సమయంలో అభిమన్యుడు అభిమానం అనే పేరుతో మాలిగా విరటుని కొల్వులో ప్రవేశించినట్లు ఈకవి చిత్రించారు. పైగా ఆయుద్ధంలో అభిమన్యుడు ప్రముఖపాత్ర వహించినట్లుకూడా ఈకవి చిత్రించడం వారి రచనా పటిమకు తార్కాణ.

ప్రామాణికమయిన నాటకానికి, పదికాలాలపాటు నిలబడదగు నాటకానికి కాలదేశకార్యైక్యములు మూశ మూడు ఉండాలని అలం కార శాస్త్రవేత్తలలో కొందరి అభిప్రాయం.

ఈ రచయిత హేతువాది. ఆ దృష్టితోనే ఈ నాటకం రచించారు. తదనుగుణంగా కొన్ని సంభాషణలు ఆయన వ్రాశారు ఉదాహరణకు 57 వ పుటలో "మంత్రశాస్త్రము కాదది మారణ శాస్త్రం. మంత్రముల పేరుతో అనేక అమాయక ప్రజలను బలి గొన్న దుష్ట భావజాల శాస్త్రమది. దురంహకార మూర్ఖులైన విద్యాధికులు ప్రచారముచేసిన మూర్ఖ శాస్త్రమది..." అని ఉత్తర చేత అనిపించారు. భారత కాలంనాటికి ఇంత హేతువాద దృష్టి వ్యక్తిలో ఉండడం సాధ్యమా అంటే సాధ్యమేనని ఈకవి అభిప్రాయం. అదే విధంగా 96 వ పుటలో "కర్ణా అతిరథ శ్రేష్ఠా!" నీకు వయస్సు మీరినకొద్ది కుర్రతనం వృద్ధియౌతుందనుకుంటాను...ఇంతటనైనా భేద వాదాలు మాని, ఒక గొడుగు కిందనున్నవారంతా ఒక బిడ్డలని గుర్తించి హృదయ పూర్వకంగా ఏకమై యుద్ధమునకు సిద్ధపడండి.

> గీ॥ సంఘశక్తియే, జగతిరాజ్యము సృజించు
> ... ... ... ... ... ...
> ఐకమత్యమె సర్వ శ్రేయస్కరంబు

అనే సుయోధనుని వాక్యాలుకూడా సార్వజనీనకంగా ఉన్నాయి.

ఆధునిక నాటక సమాజాలుకూడా ప్రదర్శించదగిన నాటకం ఇది. ఏకాంకికలేగాని సమగ్రమైన నాటకాలు అంతగా రాని ఈరోజు ల్లలో రచయిత ఇంత మంచినాటకం వ్రాయడం గమనించ దగిన అంశమే అవుతుంది. సంభాషణలు ప్రస్తుతకాల పరిస్థితులు ప్రతి బింబిస్తున్నాయి. పాత్రల చిత్రణతో శిల్పం వున్నది. ఇతివృత్తం పౌరాణికమైనదే అయినా ప్రస్తుత కాలానుగుణంగా ఒక కర్తవ్యాన్ని ప్రబోధించే దృష్టితో రచయిత వ్రాశారు. ఇది ఈ నాటకంలోని విశేషాలు.

పోతే ముద్రణను గురించి రచయిత మరింత శ్రద్ధ వహించి ఉండవలసింది. కొన్ని పద ప్రయోగాలు కొంచెం విడ్డూరంగా కన్పి స్తాయి. వయస్సు మీరినకొద్దీ కుఱ్ఱతనం వృద్ధి యౌతుందనుకుం టాను. (96 వ పుట) ఈ వాక్యం "వయస్సు వచ్చినకొద్దీ కుఱ్ఱ తనం ఎక్కువవుతున్నదనుకుంటాను" అని ఉంటే మరింత ఇంపుగా వుండేది. క్రియా వాచకాన్ని ప్రయోగించేప్పుడు కొంచెం జాగ్రత్త వహించడం అవసరమని ఈ రచయితవంటి పండితులకు వేరే చెప్ప నవసరం లేదనుకొంటాను. ఇటువంటి ప్రయోగాలు మరికొన్ని ఉన్నాయి. డాక్టర్‌గారికి వ్యాపకాలు, వ్యాసంగాలు ఎక్కువ. ఆ కారణాన ఇట్టి ప్రయోగాలు పొరపాటున దొరలి ఉంటాయి. కాగా అవి పెద్ద లోపాలు కాజాలవు.

రోగుల సేవతోపాటు, సరస్వతీసేవకూడా చేస్తున్న ఈ రచయిత అభినందనీయులు. ఈ నాటకంలో కొంత జిజ్ఞాసాదృష్టి కలదు. మరికొంత రసజ్ఞత కలదు. కాని పేరుచూచే ఏవగించుకొనే ఈకాలంలో ఇంతమంచి నాటకానికి అంత సులభంగా జనాదరణ లభిస్తుందా ?

— శ్రీ వి. యస్. అవధాని

## "రేడియో చెణుకులు"

[రచయిత: పన్నాల సుబ్రహ్మణ్యభట్టు. ప్రకాశకులు: సామాన్య ప్రచురణలు; పిఠాపురం. వెల: మూడురూపాయలు.]

మనకు విసుగుపుట్టించే కొన్ని విషయాలలో కూడా వాక్కో ప్పుడు చక్కని, సున్నితమైన హాస్యం దాక్కొని వుంటుంది. వోపిక,

తెలిసి వుండి అది గ్రహిస్తే నో విధమైన అనుభూతి కలుగుతుంది. తత్కాలంగా చికాకు, విసుగు, బాధ కలిగించే విషయాలలో కొన్ని పునశ్చరణ చేసుకుంటే వాటిలో కొన్ని చక్కలిగింతలు పెట్తాయి. మరికొన్ని వింత ఆనందాన్నీ, అనుభూతినీ కలిగిస్తాయి.

రేడియో చెళుకులు అనే యీ పుస్తకంలో మనకి ఎదురయ్యే, అవుతూ వేవున్న కొన్ని సాధారణ సమస్యలనూ, సంఘటనలనూ ఏంచుకుని, అందులో వో పద్నానుగు ఏరుకుని రచయిత పన్నాల సుబ్రహ్మణ్యభట్టు అతి చాతుర్యంగా, క్లుప్తంగా, హాస్యవ్యంగ్యంగా చిత్రీకరించారు.

హాస్యం క్షున్నంగా లేపోయినా, వ్యంగ్యంగాలేక సూటిగావున్నా అది అపహాస్యమయ్యేరు కుంటుంది. సునిపిత హాస్యం ఆరోగ్యానికో చక్కని నిదర్శన. అంతేగాక అనారోగ్యానికో మందు. ఈ పుస్తకంలో యీరకం మందులు పద్నానుగున్నాయి. అందులో ఉద్యోగ ప్రకటనలు, చౌకరాజ్యం, చీరల భార్య, కార్డు జీవితాలు మరింత మంచి మందులు. ఈ పద్నానుగు చెళుకులకూ బాపూ చేసిన చిత్ర రచన మెరుపు, ఈ మందులకు అందమైన ప్యాకింగ్!

శ్రీ భూపతి

# తొలకరి జల్లు

[(ఖండకవితా సంపుటి) పుటలు: 79 వెల : రు. 4–00 కర్త : శ్రీమతి చోడవరపు సత్యవతీదేవి. ప్రతులకు : శ్రీ చోడవరపు రాఘవాచారి. గవర్నరుపేట, విజయవాడ.]

నేటి కాలంలో రచయితులున్నంతగా కవయిత్రు లుండటం లేదు. కథానిక, నవలా రచనకన్న మిన్నగ కమ్మని కవితలను కుమ్మరించటానికి మన విదుషీమణులంతగా ముందుకు రావటంలేదు. "వాక్యమ్ రసాత్మకమ్ కావ్యమ్" అన్న వాక్యంతో సరిపెట్టుకుంటున్నారేమోననిపిస్తోంది. ఆ పరిస్థితులలో "కలము పట్టినంత కవయిత్రినెట్లౌదు" అన్నట్టి వినయస్ఫూర్తితో, గురువర్యులగు విశ్వనాధ వారి ఆశీర్బలంతో, తన భావావేశత పెల్లుతాను గమవర్షంలా ఈ తొలకరిజల్లులిచ్చి హర్షాన్నిచ్చారు రచయిత్రి. కవితా సంపద వీరికి పుట్టినింటి సొమ్మని, పతిదేవుని సరసామోదము ఈమెకు మెట్టినింటి సొమ్మని విదితమవుతుంది. నేటి కవితల గ్రీష్మాతపంనుండి ప్రజల యెడందలకు చల్లని జల్లుల నిచ్చేది ఈకవితా వెల్లువయని వాస్తవంగా అభిభాషించారు మేఘరంజని పీఠికాకర్త.

కవయిత్రి తీసుకున్న కవితాలక్షణంలో ఐక్యతవున్నది కాని, ఇతివృత్తాలలో చాల వైవిధ్య మున్నది. ఇష్టదేవతా స్తుతి నుండి, జాతీయ నాయకుల ప్రశంసలవరకు ఆద్యంతం ద్రాక్షాపాకంగా నడిచింది కవితా లహరి. వీనిలోని ఖండికలలో ప్రణయ పర్వము, ఊర్మిళ, కొంటెకృష్ణుడు, రాధ, వెన్నెలపిలుపు, బౌద్ధ దీక్ష, సమాధి సన్నిధి–ఇత్యాదులు వస్తువైలక్షణ్యాన్ని కలిగివుండి నవరత్నాలోకపో గ్రుచ్చిన హారంలా ఒప్పారుతున్నాయి. చివరలో యిచ్చిన పద్యాలను కలగూరగంప అని ప్రత్యేకంగా అనటం అనవసరం. ఇందులోవున్న ఖండికలన్నీ యించుమించు ఆలాంటివిగానే వుండి, ఏక కాల నిర్మాణంగా గోచరించవు.

సాంప్రదాయిక కవితాతత్త్వంపట్ల శక్త్యాసక్తులు గల ఈ కవయిత్రి రచన లలితపద విన్యాసంతో, ప్రసాద గుణానికి ప్రతీకగా కనబడుతుంది. "చల్లని చూపుతో, సరసచారుపయోధరభానమాన...మ్రొక్కెదనమ్మ భారతీ" అన్న పద్యభావావేశం పోతన వాణికి బాణిగా వాణీస్వరూపాన్ని నిలుపుకొంటుంది. గురుస్తుతిలో విశ్వనాధ వారిని గూర్చి చేసిన ప్రశంసనాతి కఠినమై, నాతికితగ్గ రచనలాగే వుండి విశ్వనాధ సహృదయ విశ్వరూపాన్ని మనముందు నిలబెట్టుతుంది. శైలి ప్రాచీన ధోరణిలోవున్నా వస్తువు స్వతంత్రంగాను, అత్యాధునికంగాను వున్న అశ్రుతర్పణంలాంటి ఖండికలు రచయిత్రి సుకుమార మనస్తత్వాన్నవగతం చేస్తాయి. "నాతిగల బ్రహ్మచర్యము నా తరమా" అన్నమాటకు అందమైన వీరి పద్యపు రూపు "నాతి విడిచి బ్రదుక నాకు దరమె" హృద్యం.

దేవులపల్లివారిని ప్రశంసించిన వీరికి వారి కవితాత్మయైన విప్రలంభ శృంగారానికి ఈ కవితలలో విస్తారంగా కనబడుతుంది. ఊర్మిళ, రాధ, అభిసారిక ఖండికలలాంటివి. "దాచుకున్న వలపు దోచుకొనగ", "పలుకరించినజాలు నే బులకరింతు"వంటి అందమైన ప్రయోగాలు ఆస్వాదయోగ్యాలు. విన్నాణి, తహతహ, తాజి–యిత్యాది పదప్రయోగం కొద్ది అన్వయ క్లిష్టతకు తావిస్తుంది. "సుమవేదన"లో కరుణశ్రీ మరోమారు కనిపిస్తారు. ఇంత కమ్మని కవిత అల్లగలిగిన కవయిత్రి "ప్రిస్టేజి"లాంటి అక్షరశుద్ధిలేని మణిప్రవాళ కవితలతో మాధుర్యాన్ని తగ్గించుకోరాదు.

"భావావేశములేక నీ పదములన్ భాసింతు మందారమై" అని వ్యంగ్యధోరణిలో వాణిని స్తుతించుకున్న, ప్రతిభా వ్యుత్పత్తులుగల ఈ కవయిత్రి కావ్యానుశీలనాభ్యాసవశమున మరో మంచి సమగ్ర కావ్య నిర్మాణానికి పూనుకొని సహృదయ రసజ్ఞుల నలరిస్తారని ఆశించవచ్చు. శృంగార కరుణారస పోషకమగు ఈ చిన్నికావ్యం అందుకు తగిన ప్రాతిపదిక అనటంలో విప్రతిపత్తి లేదు.

## కలం

[ (వచనకవితాసంపుటి). పుటలు : 68. వెల : తెలియదు. రచన : సుభాష్‌చంద్ర. ప్రతులకు : దేశిబుక్ డిస్ట్రిబ్యూటర్సు, విజయవాడ-2. ]

ఆధునిక కవితా ప్రవక్తలు కవితలోని ఛందానికి, భాషకు బంధవిముక్తి గావించినప్పటినుండి కవితాకన్య సామాన్యుని సొత్తయింది. ఆలోచన, ఆవేశం, రంగరించుకున్న అనేక భావుక కవి కుమారులు తమ సుందర కవితను గళమెత్తి, కలమెత్తి వినిపిస్తున్నారు. వచన కవితా సంపుటాలు నేడనేకం వైయక్తికంగాను, సామూహికంగాను, శరపరం పరీల్గా విసరబడుతున్నాయి. ఆధునిక తెలుగు కవితా రంగానికి స్థితి బలుపా, వాపా అని నిర్ణయించటానికి పరిణామశీలమైన కాలమే కారణమవుతుంది.

వాస్తవికత, సమత అనే రెండు నాదాలతో, సామాజికా వ్యవస్థల నినాదాలతో కవితలు వెలువడటం మామూలే. అయితే ఏ గుండె కాగుండె వినిపించే పలుకుల తీరులో లోతెంతో చూచుకోటమే సరియైన వివేచన అవుతుంది. ఈ 'కలం' అనే వచన కవితా సంపుటిలో అరవై మించిన కవితలున్నాయి. ఈ కవితలకు ఆరుద్ర, శివారెడ్డి లాంటి వచనకవితా దిగ్గంతుల ఆశీస్సులు లభించటం వీనిలోని మేలిమిని సూచిస్తుంది. అనుకరణలేక, తనకు తానుగ నిలబడుతున్న యీ వర్తమాన కవి, ఆరుద్ర అన్నట్లుగా కొత్త కలం చేపట్టి, సాంస్కృతిక కలం విప్లవానికి సాగిపోతున్నాడనిపిస్తుంది. పాత కలవు ప్రియ పాలికకు పాత కలలా స్వస్తిచెప్పి, సమాజంవైపు చూపును మళ్ళించి, తన కళ్ళతో ఆ కుళ్ళును చూడటానికి సంసిద్ధుడైనానని రచయిత 'కన్ఫెషన్' తో చెప్పుకోవటం ఆయన చిత్తశుద్ధినేగాక, ఈ పోరాటంలో ఎదగాలనే ఆరాటాన్నికూడ వ్యక్తం చేస్తుంది. ఉత్తమమైన ఆత్మానుశీలన, స్వయంవ్యక్తి రచయిత కెప్పుడూ రాణింపునిస్తాయి.

"చీకటిలా నిద్రిస్తున్న లోకంలో కిరణంలా ఉదయిస్తాను" అన్న ఆశావాదంతో, "కారడవుల్ని నరికి పారేస్తే సమతాసుందరి" జన్మిస్తుందనే అభ్యుదయ నాదంతో ఆరంభించి "ఊపిరి సలపని ఉదరాలన్నీ ఎక్కడి వక్కడే ఉరివేసుకుంటే చీకటిలేదు" అని యిచ్చే తీర్పులో కవి లోతుగుండెల ఆలోచనాలోచనం జ్వలిస్తుంది. "శోక స్తంభం కొవ్వొత్తి తాను తగలడుతూ భూమ్మీద కన్నీటిమేడ నిర్మించుకుంటుంది" అనటం ఉత్తమభావ బంధురంగావుంది.

"కలం" అనే పేటిలుకు సంబంధించిన కవిత కవి పూర్తి రూపును పట్టియిస్తుంది. "నా తలపు సమసమాజపు రూపు నేనె జాతికి నిజం" అనే పలుకులు అర్థవంతమైన ప్రాసలతో తేనెల చిను కుల్లావున్నాయి. భాష పేరుతో, భావాన్ని చంపని వీరి కవిత మెప్పు గొల్పుతుంది. మార్మికతలేక, ఖచ్చితంగా, సూటిగా విషయాన్ని చెప్పగల నేవ రచయితకున్నది. నీతి, విరటుని కొలువు అలాంటి ఖండికలు. 'కిటికీ పక్కగా చింతచెట్టు, దానికి వళ్ళంతా జుళ్ళే, విలాస పల్లకీ, కాంక్రీటు సరికె, రక్తసుఖ పారవశ్యాలు' – ఇత్యాది పదాలు కొంత అస్పష్టతకు హేతువు లవుతాయి; మరి ఆధునిక కవితలో అస్పష్టత ఒక భాగమే కాబోలు. కబంద హస్తాలనుండి, అస్తిసంజరం, భ్రంశం వంటి భాషా దోషాలు మలిముద్రణలో సవరించుకుంటారని అనుకుందాం. ఈపుస్తకం మొత్తంలో ఫార్ములా అనేది ఉన్నతమైన కవితా ఫార్ములా. ఇలాంటి ఫార్ములాలే కవిగారిని పెద్ద పీఠంలో కూచోబెడతాయి.

"నేను కవితా సూర్యుణ్ణి" అంటూ చేవగల నెదురు ముక్కు బాణమై భాసిస్తుంది అంటున్న యీ వర్తమాన కవి తెలుగువచన కవితా ప్రపంచానికి ధైర్యస్థైర్యాలతో మరిన్ని కవితా దీపికలనిచ్చి, సామాజిక రుగ్మతలకు ఫార్ములా టానిక్‌లు అందిస్తాడని ఆశించవచ్చు. భాషను, భావాన్ని, శైలిని మరింత పరిణతి, సంయమనాలతో సమన్వయ పరచి ప్రయోగిస్తే సుభాష్‌చంద్ర అందరితో సెభాషనిపించుకుంటాడు.

— "సుచంద్ర"

## గ్రంథస్వీకారము

1 శ్రీ కన్నెకంటి రాజమల్లాచారి కవితా సమీక్ష (వ్యాసమంజరి) రచయితలు: డాక్టరు సంగు రంగప్పకృష్ణమూర్తి, శ్రీ టి. శంకరనారాయణరావు. పేజీలు : 39; వెల: తెలియదు. ప్రతులకు : డాక్టర్ సంగు రంగప్పకృష్ణమూర్తి హిందీ శాఖాధ్యక్షులు, బెంగుళూరు విశ్వవిద్యాలయము, బెంగుళూరు మరియు శ్రీ టి. శంకరనారాయణరావు, కార్యదర్శి, అభ్యుదయ రచయితల సమాఖ్య, పోలీస్ స్టేషన్‌వద్ద, మార్కాపురం; ప్రకాశం జిల్లా.

2 మి తశతకము :-6 (కబీరు భావధారసహితము) రచన : డా. కొండూరు వీరరాఘవాచార్య; పేజీలు : 44; వెల : రెండు రూపాయలు. ప్రతులకు : రచయిత, తెనాలి.

3 యోగాశ్రమలేఖలు : రచన : శార్వరి, పేజీలు : 96; వెల : రు. 5/ ప్రచురణ : శార్వరి పబ్లికేషన్స్, 68, మారి అమ్మన్‌కోయల్ స్ట్రీట్, కొయ్యతోపు, మద్రాసు-600024.

4 శ్రీ రవీంద్రవాణి: (1934 జనవరినెలలో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో మహాకవి రవీంద్రనాథ్ టాగూరు Man, Super Man, I am He అను శీర్షికల కింద యిచ్చిన ఆంగ్లోపన్యాసములకు తెలుగుసమీక్ష) సమీక్షకులు : శ్రీ క్రొవ్విడి రామం పేజీలు : 32 వెల : రు. 1-50. ప్రతులకు : రచయిత, మఠంవీధి, కస్పా, విజయనగరం-2.

5 విజయ (తెలుగు సాహిత్య సంచిక, 1975-76) షాద్ నగర్, ప్రభుత్వ జూనియర్ కళాశాలవారి ప్రచురణ. శ్రీమతి ఇందిరాగాంధి ముఖచిత్రంతో వెలువడిన ఈ సంచికలో ఉపాధ్యాయుల, విద్యార్థినీ విద్యార్థుల కవితలు, కథలు, వ్యాసాలు, నాటికలు వున్నాయి.

6 వెలుగుమేడ : శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారికి అంకితము ఇచ్చిన ఈ పుస్తకములో 9 గేయనాటికలు కలవు. రచన : శ్రీ వడ్డెపల్లి కృష్ణ. పేజీలు : 92, వెల : రు. 4– ప్రతులకు : యువసాహితీసమితి, సిరిసిల్ల–505301. కరీంనగరం జిల్లా.

7 దివ్యవాణి : రచయిత : శ్రీ దేవినేని శ్రీ రామమోహనరావు, పేజీలు 89, మూల్యం : అమూల్యము. ప్రతులకు : రచయిత, నరసింహారావుపేట, ఏలూరు-2.

8 సౌకి కాలు (కవితా సంపుటి) రచన : శ్రీ బుర్రా వెంకటనాగేశ్వరరావు, పేజీలు : 12, వెల : ఒకరూపాయి ప్రతులకు : రచయిత, 'శారదా', కొత్తవీధి, చోడవరం-531036.

9 శ్రీ భగవన్నామ మహిమ (రామనామ మహిమ) రచయిత : శ్రీ కాశీనజ్జుల రామకోటిశాస్త్రి, పేజీలు : 132, వెల : మూడురూపాయలు. ప్రతులకు : రచయిత, మార్కాపురం, ప్రకాశం జిల్లా.

10 కరకంకణం (గేయాలు), రచన : కాటగడ్డ లక్ష్మీనరసింహారావు, పేజీలు : 32. ప్రచురణ : శేష్‌గోపాల్ పబ్లికేషన్స్, అమీనాపేట, ఏలూరు-534002.

11 యోగవిద్య, పేజీలు : 64, వెల : రు. 1–25; శరీరములు సాధన క్రమము, పేజీలు : 64, వెల : రు.1–25 ఆత్మవిద్య, పేజీలు : 64, వెల : రు. 1–25; THEOSOPHY, A WAY OF LIFE, పేజీలు : 58 వెల : రు. 1-25; THEOSOPHY AND ET[illegible] పేజీలు : 42, వెల : రు. 1-25. పై ఐదు పు[illegible]లకు రచయిత : శ్రీ యస్. సి. రామానుజాచార్యులు ప్రచురణ : శ్రీ రామా ప్రచురణలు, 17, జెయిన్ టెం[illegible] క్రాస్‌రోడ్, విశ్వేశ్వరపురము, బెంగళూరు-560004.

12 స్తోత్రమంజరి. శ్రీ హనుమాన్ చాలీసా (ఆం. ధానువాదం), శ్రీరామాష్టకము, శ్రీ వెంకటేశ్వరాష్టకము గ్రం[illegible] ఈ పుస్తకమునకు రచయిత : శ్రీ గొర్తి సీతారామయ్య, ప్రభుత్వకళాశాల, శ్రీకాకుళం.

13 'అభ్యుదయ' కాశీపట్నం కథలపై గోష్ఠి. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితలసంఘంవారి రెండవ బులిటెన్. పేజీలు: 8, వెల : 20 పై. ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, మద్రాసుశాఖ, 15, అయోతంబి స్ట్రీట్, మద్రాసు-17,

14 ప్రశంసా ప్రసూనాలు, పేజీలు : 4, సేకరణ : కవితామణి శ్రీ వి. పి. శ్రీరాములు.

శ్రీ మైసూరు చాముండేశ్వరీ అష్టకం, పేజీలు: 4 శ్రీ సంతాన వేణుగోపాల కృష్ణాష్టకము, పేజీలు : 6 పై రెండింటికి రచయిత : కవితామణి శ్రీ వి. శ్రీరాములు, కార్వేటినగరం, పుత్తూరు తా॥, చిత్తూరు జిల్లా.

15 దేవతలెత్తిన పడగ (నాటకం) పేజీలు : 76, వెల : రు. అకురాలిన వసంతం (నాటకం) పేజీలు: 109 వెల: రు. వెంటాడే నీడలు (నాటకం) పేజీలు : 127 వెల : రు. పై మూడు పుస్తకములకు రచయిత : శ్రీ పి వి. రమ ప్రతులకు: రచయిత; 10/423 గిర్మాజిపేట, వరంగల్-

16 నిజానికి నిచ్చెనలు (సృష్టికి మూలమైన నిజ తత్వా[illegible] ప్రత్యక్షానుభవంగా దర్శించే మార్గాలను గురించి వ్రా[illegible]బడిన 7 వ్యాసాలు ఈ పుస్తకములో కలవు) రచయిత శ్రీ ఎక్కిరాల భరద్వాజ, వెల : రు. 3. పేజీలు : 72 ప్రతులకు : రచయిత, విద్యానగర్, గూడూరు తా॥ నెల్లూరుజిల్లా.

17 మంత్రపుష్ప దండకమాల. తెలుగుసేత : శ్రీ [illegible] భట్టు సత్యనారాయణరాజు, శ్రీ విద్యా ప్రకాశన[illegible] శాల, మహబూబ్‌నగర్.

18 దైవభక్తి ప్రార్థనాగీతములు : రచయిత : శ్రీ భట్టు సత్యనారాయణ; పేజీలు : 10, ప్రతులకు కె. రామస్వామి, టౌన్ బిల్డర్స్, లైసెన్సుడు సర్వే[illegible] మహబూబ్‌నగర్-509001.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrik[illegible] Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.